# చతుర

మే 1999

రూ.7/-



# శీతాకాలం సూర్యుడు

అక్కినపల్లి సుబ్బారావు

# చతురప్రపంచం

## ఖర్చులేని వైద్యం

ఆకు పచ్చని కూరగాయలుగానీ, ఆకుకూర లుగానీ ఆరోగ్యాన్ని ప్రసాదించేవే అని వేరే చెప్పఖ్ఖర్లేదు. ముఖ్యంగా ఆహారంలోని నిత్యం ఆకు కూర... ఏ వైద్యులూ, ఏ మందులూ చెయ్యలేని పని చేస్తుంది. ఘుమ సమృద్ధిగా వుంది. వీటన్నిటితోపాటు మరో ముఖ్యమైన బలవర్థకం బీటా కెరొటిన్ కూడా మెంతుల్లో వుంది. ఇది సమతౌల్య పెరుగుదలకు అత్యంత దోహదకారిగా పనిచేస్తుంది. మెంతుల్లో క్వినైన్ జ్వర నిరోధకశక్తిగా పనిచేస్తుంది. వీటిలో వుండే క్షారతత్వం శరీరంలో అత్యుష్ణాన్ని, చెడు ఉష్ణాన్ని తగ్గించి శీతల పరుస్తుంది. శరీరంలో ఆమ్లాన్ని, వాయువును, కడుపు నొప్పులను తగ్గి




ఘుమలాడే తాజా మెంతికూర, లేదా లేత తోటకూర... నోట్లోంచి నీరూరించకపోతే ఆ వ్యక్తి ఏదో జబ్బుతో బాధపడుతున్నట్టే అనుకోవాలి. మెంతుల్లో ఐరన్, కాల్షియం, సల్ఫర్, క్లోరిన్‌లతోపాటు విటమిన్ సి కూడా స్తాయి మెంతులు. ఇందులో వుండే ఐరన్ కొత్తరక్తం పట్టడానికి దోహదపడుతుంది. యువతులకు, పెళ్లికాని పిల్లలకి, బాలింతలకీ కూడా మెంతులుగానీ మెంతి ఆకులుగానీ అత్యవసర బలవర్థక ఆహార పదార్థం

కవర్ ఫొటోగ్రాఫర్: బి.వసంత

అంటున్నారు డాక్టర్లు.

మెంతి ఆకును నూనెలో వేయించకుండా నీటితో ఉడకపెడితే ఇందులో విటమినులు ఎక్కువగా నష్టపోకుండా వుంటాయి. మెంతి కూర ఎక్కువగా దొరికే సీజన్లలో దానిని కొని ఎండబెట్టి నిలవచేసుకోవచ్చు. అలా చేసుకోవడంవల్ల దానిలో వుండే విటమిన్లు ఏమాత్రం నష్టంకావు. 100 గ్రాము మెంతుల్లో 4.4 శాతం ప్రొటీన్, 395 మిల్లీ గ్రాముల కాల్షియం, 1 మిల్లీగ్రామ్ పాస్ఫరస్, 16.5 మిల్లీ గ్రాముల ఐరన్, 52 మిల్లీగ్రాముల విటమిన్ సి వున్నాయి. కానీ ఇప్పుడొచ్చే ఫాస్ట్‌ఫుడ్స్‌లో ఈ రకమైన పోపుగింజలేవీ వుండకపోవడంతో చాలామంది వాటిని తినక ఆరోగ్యాన్ని దూరం చేసుకుంటున్నారు.

రక్తహీనత, కీళ్లజబ్బులు, చక్కెర వ్యాధి వీటన్నిటికీ కూడా మెంతులు ఔషధంగా పనిచేస్తాయని తెలుస్తోంది. నరాల నిర్మాణాన్ని కూడా పటిష్ఠంగా వుంచుతుందిది. డయాబిటిస్‌తో బాధపడేవారు రోజుకి 20 నుంచి 100 గ్రా. మెంతులను ఆహారంలో తీసుకోగలిగితే రక్తంలో గ్లూకోజ్ లెవెల్స్‌ను బాగా తగ్గిస్తుంది. అన్నిటికన్నా ఆరోగ్యకరమైన పద్ధతి ఏమిటంటే మెంతులను 3, 4 గంటలు నీటిలో నానపెట్టి ఆనక ఆ నీటిని తాగేసి మెంతుల్ని కూడా తినెయ్యాలి.

మెంతులను వేయించి, పొడిచేసి దానితో కొంచెం గోధుమ పిండి, చక్కెర కలిపి నీళ్లు జల్లి పొయ్యి మీదపెట్టి హల్వాలా తయారు చేయాలి. ఇది పిల్లలకి పాలిచ్చే తల్లులకి మంచిది. మెంతి ఆకులని మెత్తగా నూరి తరచూ తలకి పట్టించుకుని ఓ గంటపోయాక స్నానం చేస్తే జుట్టుకు మెరుపు, మృదుత్వం రావడమేకాక, పొడుగ్గా కూడా పెరుగుతుంది. టీ పొడితోపాటు కాసిని మెంతి ఆకులను కూడా వేసి మరిగించి ఆ టీని జ్వర పీడితులకిస్తే ఉష్ణం తగ్గి ఉపశమనాన్నిస్తుంది. మెంతి ఆకులను నూరిన ముద్ద చర్మానికి పూసుకుని కాసేపయ్యాక స్నానం చేస్తే చర్మం కాంతివంతంగా వుండటమేకాక చర్మరోగాలను దరిచేరనీయదు. ఇదికాక మెంతి కూరతో ఎన్నో రకాల కూరలు, పప్పులు, పచ్చళ్లు చేసుకోవచ్చు. ఎలా చేసుకున్నా మెంతిని తరచూ తినడం ఆరోగ్యకరం.

---

## బ్లాక్ విడో

ప్రపంచంలోని 30,000 రకాల సాలెపురుగుల్లో అతి ప్రమాదకరమైంది బ్లాక్‌విడో. అమెరికాలోని అలాస్కా రాష్ట్రం మినహా మిగిలిన అన్ని రాష్ట్రాల్లోనూ ఇది వుంది. ఎడారుల్లో జీవించే ఇవి మనుష్యసంచారంగల గ్రామాల్లోకి, నగరాల్లోకీ వస్తుంటాయి. కారణం నీరు. ఎక్కడ నీరుంటే అక్కడ బ్లాక్‌విడో లుంటాయి.

కాలిబొటన వేలంత పరిమాణంలో వుండే ఇవి కుడితే నిమిషాల్లో మజిల్స్ పనిచేయడం మానేస్తాయి. భరించలేనంత బాధకలుగుతుంది. దీని విషంలోని రసాయనిక పదార్థం రక్తనాళాలద్వారా వేగంగా మజిల్స్‌కి వ్యాపించి వాటిని అటాక్ చేస్తుంది. మనిషి తడిబట్ట పిండినట్టు పిండితే కలిగే లాంటి బాధ కలుగుతుంది. వెంటనే చికిత్స చేయకపోతే మరణం తథ్యం. 48 గంటలపాటు దీని విష ప్రభావం మనిషిలో వుంటుంది. 60 శాతందాకా ఇళ్లల్లో బూట్లల్లో, బట్టల్లో దాగి వుండి ఇవి మనుషులని కుడుతూ వుంటాయి.

ఇది సాలెపురుగులాగానే సిల్క్‌దారంతో గూడు అల్లుతుంది. దానికి ఏ పురుగో, ఎలుకోవచ్చి చిక్కుకుంటే ఆ దారాల కదలిక ద్వారా ఈ సంగతి గ్రహిస్తుంది. అది తప్పించుకోవడానికి విఫల ప్రయత్నం చేస్తు

న్నంతసేపూ ఆగి, అది అలిసిపోయాక దాని దగ్గరకి వెళ్లి విషం ఎక్కేలా కుడుతుంది. దాని శరీరంలోకి ఓ కొండిలాంటిదాన్ని గుచ్చి శరీరంలోని తడినంతా పీల్చేసుకుంటుంది. రక్తమేకాక మాంసం, ఎముకలు మొదలైనవాటిని కూడా దాని విషం ద్రవ పదార్థంలా మార్చేయడంతో అలా పీల్చగలుగుతుంది.

తినడంవల్ల అధికంగా గుడ్లు పెట్టగలుగుతుంది. అమెరికాలో ఓ చోట కొన్నివేల ఎకరాల్లో బ్లాక్‌విడో ఫారంని కట్టారు. ఇందులో దాని విషాన్ని తీస్తారు. బ్లాక్‌విడోకి నాలుగు నిమిషాలు నిద్రపోయేలా మత్తు ఇచ్చి మైక్రోస్కోప్ కిందవుంచి దాన్నించి విషం పిండుతారు. ఈ విషాన్ని దానికాటుకు విరుగుడుగా వాడే మందుల తయారీలో




బ్లాక్‌విడో దఫాకి 100 గుడ్లదాకా పెడుతుంది. అందువల్ల వీటి సంఖ్య అధికంగా విస్తరిస్తుంటుంది. జత కట్టిన ఏడు రోజులకల్లా ఇది గుడ్లు పెడుతుంది. సాలెగూడు అల్లి అందులో గుడ్లు పెడుతుంది. దాంతో అవి కింద పడవు. 3 నెలల తర్వాత పిల్లలు బయటకి వస్తాయి.

దీనికి బ్లాక్‌విడో అని పేరు పెట్టడానికికారణం తనతో జతకట్టడం అయ్యాక ఆ మగ సాలెపురుగును ఇది చంపి తింటుంది. అలా

ఉపయోగిస్తారు. ఈ విషం ఒక చుక్క ఖరీదు 25 నుంచి 30 డాలర్ల ఖరీదు వుంటుంది.

ఒక బ్లాక్‌విడో ఖరీదు ఒక డాలరు. కానీ దాన్నించి తీసే విషం ఖరీదు చుక్కకి 25 డాలర్లు. దాన్ని పెంచి విషం తీయడం శ్రమతో కూడుకున్న ప్రమాదకరమైన పని. తమాషా ఏమిటంటే మగ సాలెపురుగు పూర్తిగా నిరపాయకరం. దానికి విషపు గుండెలుండవు.

## సర్వరోగ నివారిణి

ప్రాచీనకాలంనుంచీ నిమ్మకాయను ఔషధాలలో ఉపయోగిస్తూ వచ్చారు. వేదాలలో నిమ్మపండుకు చాలా పవిత్రతను ఆపాదించారు. క్షుద్రదేవతోపాసనలోను, క్షుద్రశక్తులను తరిమికొట్టడంలోనూ వాడే వస్తువులలో




నిమ్మపండుకు ఎంతో ప్రాధాన్యత వుంది. ప్రాచీన ఆయుర్వేద వైద్యులైన చరకుడు, సారంగధరుడు నిమ్మపండు ఎముకలు, కీళ్ళకు సంబంధించిన వ్యాధులలో ప్రధాన ఔషధంగా పనిచేస్తుందని తెలిపారు. నిమ్మ పండులోని సి. విటమిను శరీరంలో రోగనిరోధకశక్తిని పెంచి, చర్మంపై వచ్చే పుళ్ళను తగ్గించి, నేత్రసంబంధరోగాలను రాకుండా నివారిస్తుంది. పళ్ల గట్టిదనానికి కూడా నిమ్మ పండు ఔషధంలా పనిచేస్తుంది. పళ్ళు పుచ్చిపోకుండా, ఊడిపోకుండా అరికడుతుంది.

100గ్రా. నిమ్మకాయలో 90 మిల్లీ గ్రాముల కాల్షియం, 20 మి.గ్రా ఫాస్పరస్, 0.3 మి.గ్రా ఐరన్, 63 మి.గ్రా. సి విటమిన్, తగు మోతాదులో బి. విటమిన్ వున్నాయి.

నిమ్మపండుపై తొక్కలో వుండే చమురు పదార్థం కూడా ఔషధాలలో వాడుతున్నారు. అరుగుదలకి స్కర్వి వ్యాధికి కూడా నిమ్మ పండు మంచి మందు. సముద్రంలో పయనించే నావికులు ఆహారపదార్థాలు అయిపోయి, తీరం చేరడానికి ఆలస్యమయ్యేలా వుంటే నిమ్మరసం తప్పనిసరిగా తాగేవారు. అది రోగాలనుంచి కాపాడటమే కాక ఆకలి బాధను ఆపుతుంది.

పైత్యం, అజీర్ణం, వాంతి వచ్చినట్టు వుండటం, కడుపులో ఆమ్లం ప్రకోపించడం... ఇత్యాది రోగాలు వచ్చినప్పుడు నిమ్మరసాన్ని కొంచెం తేనెతో కలిపి తీసుకుంటే బాధ నివారణ అవుతుంది. ఎసిడిటీ ఎక్కువగా వున్నప్పుడు ఓ చెంచాడు నిమ్మ రసంలో కొంచెం సోడా బైకార్బను కలిపి తీసుకుంటే అద్భుతంగా పనిచేస్తుంది.

ఉదయం లేస్తూనే ఓ గ్లాసుడు గోరువెచ్చని నీటిలో ఒక నిమ్మపండు రసం కలుపుకుని తాగితే మలబద్ధకం పోతుంది. పెప్టిక్ అల్సర్లను కూడా నిమ్మపండురసంతో నివారించవచ్చునంటున్నారు వైద్యులు.

మామూలు జలుబుకి, పొడిదగ్గుకి కూడా గోరువెచ్చని నీళ్ళలో కలిపిన నిమ్మరసం

తీసుకోవటం మంచిదంటున్నారు. దానికి ఓ చెంచాడు తేనెను కూడా చేర్చాలి. టాన్సిలైటిస్ వున్నవారు నిమ్మరసాన్ని ఓ గ్లాసుడు నీళ్లలో కలిపి, 4 టీ స్పూనులు తేనె, ఒక పావుస్పూన్ మెత్తని ఉప్పును కలిపి తీసుకోవాలి. చిగుళ్లు వాచినప్పుడు నిమ్మ తొక్కతో వాటిని రుద్దితే తగ్గుతాయి. వాతరోగానికి, కీళ్ళరోగానికి కూడా నిమ్మరసం ఔషధంగా పనిచేస్తుంది. నేత్రరోగాలకి కూడా ఇది మంచి మందు. 'కళ్ల కలక' వచ్చినప్పుడు కొంచెం నిమ్మరసం గోరువెచ్చని నీళ్లలో కలిపి కళ్లలోకి చల్లుకుంటే ఆ నీటి ద్వారా ఇన్‌ఫెక్షన్ కడుక్కుపోతుంది. తేలుకుట్టినపుడు కుట్టిన భాగంపై కొద్దిగా నిమ్మరసం వేసి, దానిపై కొంచెం పొటాషియం పెర్మాంగనేటును వుంచితే 10 నిమిషాలలో నెప్పి తగ్గుతుంది.

స్థూలకాయులకు కూడా నిమ్మరసం అద్భుత ఔషధంగా పనిచేస్తుంది. ఉదయం మొహం కడుక్కోగానే ఓ గ్లాసుడు నీళ్లలో ఒక నిమ్మకాయరసం పిండుకుని కొంచెం తేనె కలిపి తీసుకుంటే సన్నబడతారు. సౌందర్య సాధనంగా కూడా నిమ్మ కాయకు ప్రత్యేక స్థానముంది.

రోజూ రాత్రిళ్లు ఓ గ్లాసుడు పాలలో ఓ తాజా నిమ్మపండు రసంపిండి, ఒక చెంచాడు గ్లిసరిన్ కూడా కలిపి ఓ అరగంట వుంచి అటుపైన ఆ మిశ్రమాన్ని మొహానికి, కాళ్ళకి, చేతులకి బాగా రాసుకుని పడుకుంటే శరీరం నునుపుగా, తేజోవంతంగా వుంటుంది. ఈ పద్ధతి మొటిమల నివారణకి, పగిలిన పాదాలు, అరిచేతులు నున్నబడటానికి కూడా ఉపయోగిస్తుంది. ఎండిన చర్మాన్ని కాంతివంతం చేస్తుంది. చలిగాలులు, వేడి గాడ్పులనుంచి చర్మాన్ని రక్షిస్తుంది. కొంచెం నిమ్మరసం, మరికొంచెం ఉసిరి రసం కలిపి రాత్రి పడుకోబోయేముందు జుట్టుకు పట్టించుకుని తెల్లవారి స్నానం చేస్తే జుట్టు ఊడడం, నెరవడం, చుండ్రు మొదలైన బాధలు లేకుండా చేస్తుంది.

ఇన్ని మంచి గుణాలున్నప్పటికీ దీనిని అతిగా సేవించడం కూడా మంచిది కాదంటున్నారు శాస్త్రజ్ఞులు.

---

## అదృశ్య శత్రువు

ఈనాడు 'శబ్దం' మనిషిని నిత్యజీవిత కృత్యాల్లో పట్టి పీడిస్తున్న అదృశ్య శత్రువు. ఇంటిలో, ఆఫీసుల్లో ఫ్యాక్టరీల్లో రైళ్లల్లో, రోడ్ల మీద... ఎక్కడికెళ్ళినా చప్పుళ్ళు, యంత్రాల హోరులు మనిషికి అదృశ్యంగా



హానిచేస్తున్నాయి.

బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం రాకముందు శబ్దం మనిషికి మిత్రుడుగా వుండేది. అయితే ఆ తర్వాత వివిధ పరిశ్రమలవల్ల శబ్దకాలుష్యం ప్రవేశించి రోజురోజుకీ అది పెరిగిపోతోంది. 1930లలో బ్రిటిష్ డాక్టర్లు చెవికి సంబంధించిన కొత్త రోగాలను కనుక్కొన్నారు. వాటిలో కొన్ని బాయిలర్ వర్కర్స్ ఇయర్. బాయిలర్ విభాగంలో పనిచేస్తూ ఆ చప్పుడు వినేవర్కర్స్‌కి వస్తుంది. అలాగే పవర్‌లూమ్స్ సెక్షన్‌లో పనిచేసే వర్కర్స్‌కి పవర్ డెఫ్‌నెస్, రైలు ఇంజన్‌లో పనిచేసే వాళ్ళకి లోకోమోటివ్ ఇంజనీర్స్ డెఫ్‌నెస్ అనే కొత్త రోగాలు వచ్చాయి.

శబ్దం భరించలేక మనిషిలో చిరాకు, కోపం, తత్తరపాటు, భయం పుట్టుకొస్తాయి. వాహనాల సంఖ్య పెరిగేకొద్దీ ఈ సిండ్రోమ్ మనుషుల్లో అధికమౌతోంది. శబ్దంవల్ల గుండెజబ్బులు రావడానికి కూడా అవకాశముందని విస్కాన్సిన్స్ యూనివర్సిటీ ప్రొఫెసర్ నాథన్‌షెఫరీ ఓ పరిశోధనలో కనుగొన్నాడు. నోరే కాక చెవి కూడా, గుండెకు హాని కలిగిస్తుందట. అంటే కేవలం నోటిద్వారా వెళ్ళే ఆహారంవల్లనే కాక, చెవిద్వారా వెళ్ళే మితిమీరిన శబ్దాలు కూడా గుండెకు హానిచేస్తాయి. ఓ దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందేకొద్దీ శబ్దకాలుష్యం కూడా ఆ దేశంలో అధికమవుతూ వుంటుంది. దాంతో గుండెపోటు మరణాలు కూడా ఎక్కువవుతూ వుంటాయి.

చెట్లపెంపకం శబ్దాన్ని తగ్గిస్తుందని ఓ పరిశోధనలో తేలింది. పర్యావరణ రక్షణేకాక ఇంటిచుట్టూ పెంచే మొక్కలు శబ్దకాలుష్యాన్ని కూడా తగ్గిస్తాయి.

అల్యూమినియం కేస్టింగ్ ఫ్యాక్టరీలో శబ్దం 102 డెసిబుల్స్ స్థాయిలో వుంటుంది. 80 డెసిబుల్స్ దాకా మానవుని చెవి శబ్దాన్ని భరించగలుగుతుంది. అది దాటితే ప్రమాదం. పెళ్ళి పందిరిలోని శబ్దస్థాయి 100 డెసిబుల్స్ వుంటుంది. హైద్రాబాద్‌లోని రద్దీరోడ్డులోని శబ్దంస్థాయి 85 నుంచి 89 డెసిబుల్స్‌గా లెక్కకట్టారు. పబ్లిక్ మీటింగ్‌లోని శబ్దస్థాయి 95 నుంచి 98 డెసిబుల్స్.

అమెరికన్ ఇయర్ సర్జన్ డాక్టర్ శామ్యూల్ రోజెన్ ఇలా అంటారు. "మీరు శబ్దాన్ని క్షమించవచ్చు గానీ, శబ్దం మీ శరీరాన్ని క్షమించదు''

## ఎనీమియాకి యాంటీడోట్

"చెర్రీచీక్స్... రోజీలిప్స్..." అంటూ చిన్నపిల్లలు రైమ్స్ చెబుతూ వుంటారు. ఈ రైమ్ పాలుకారే పసివాళ్ళను చూస్తే నిజమే అనిపిస్తుంది. కానీ పెద్దవాళ్ళు కూడా ఈ వర్ణనలకు అర్హులే అవుతారంటున్నారు. ఎప్పుడంటే వాళ్ళు రెగ్యులర్‌గా బీట్‌రూట్ తిన్నప్పుడు. అలా తిన్న వాళ్ళను "పింకీచీక్స్, రోజీస్కిన్' అంటూ పాడచ్చు అంటున్నారు.

బీట్‌రూట్ కనుక ప్రతిరోజూ క్రమం తప్పకుండా తింటే శరీరం గులాబీరంగుకు మారడం తథ్యం అంటున్నారు పరిశోధకులు. అయితే ఇందులో ప్రకృతి సహజమైన సుగర్ భాగం అత్యధికంగా ఉండటంచేత సుగర్ వ్యాధివారు మాత్రం దీన్ని మితిమీరి తినరాదు. ఇందులో పొటాషియమ్, కాల్షియం, క్లోరిన్, అయొడిన్, ఐరన్, కాపర్... అత్యధిక మోతాదులో ఎ, బి విటమిన్లు కూడా వున్నాయి. దీని ఆకులో కూడా కాల్షియం, మెగ్నీషియం, ఐరన్ ఇవన్నీ అధికంగానే వున్నాయి. బీట్‌రూట్ కొత్తరక్తం పట్టడానికి దోహదం చేస్తుంది. దీనిలో వుండే ఐరన్ ఎర్ర రక్తకణాలను అభివృద్ధి చేయడంలో ఉపయోగపడుతుంది. అనీమియా... అంటే రక్తహీనతతో బాధపడేవారికి బీట్‌రూట్ దివ్యౌషధం.

ఈ రక్తహీనత ప్రసూతి మొదలైన అనేక కారణాలవల్ల స్త్రీలలో ఎక్కువగా వుండే అవకాశముంది. అందుకే ఇది స్త్రీ పాలిట రుచికరమైన ఔషధం అనవచ్చు.

ముఖ్యంగా మధ్యవయసువారికి ఇది చాలా మంచి దంటున్నారు శాస్త్రజ్ఞులు. ఇందులో ఎక్కువ పాళ్లలో వుండే సోడియం, పొటాషియంలు శరీరంలో జాయింట్లలో పేరుకుపోయే అనవసర కాల్షియంను కరిగిస్తుంది. ఈ జాయింట్ నెప్పులు వయసు మళ్ళుతున్నవారిలో మామూలుగా కనిపించే




గుణం. ఇదికాక హైపర్‌టెన్షన్‌కి, హార్టుకీ సంబంధించిన రోగాలకి కూడా బీట్‌రూట్ ఔషధంగా పనిచేస్తుంది.

ఇంతేకాక బీట్ చేసే పనులు ఇంకా ఎన్నో వున్నాయంటున్నారు వైద్యులు. మలబద్ధకాన్ని పోగొట్టడంలోను, జాండీస్ వచ్చినప్పుడు, కాలేయాన్ని శుభ్రపరచడంలోను బాగా పనిచేస్తుంది. క్షారగుణాన్ని కలిగి వుండటంచేత ఇది ఎసిడిటీకి కూడా మందుగా వుపయోగిస్తుంది. ఆమ్లవాయువులను ఉత్పత్తి కానీయదు. నరాల బలహీనత ఉన్నవారికి ఇది పరమౌషధం. నరాలకు పుష్టి నివ్వడంలో బీట్‌రూట్ చేసే సహాయం మరే ఇతర కూరగాయలూ చెయ్యలేవు.

బీట్‌ను కూడా పచ్చిగానే తినవచ్చంటున్నారు. దీన్ని ఎక్కువగా ఉడకపెడితే ఇందులోని విటమిన్ సి. నశించే ప్రమాదముంది. నీటిని ఎక్కువగా పోసి వార్చకుండా కొద్దిపాటి నీటితో, సగం మాత్రమే ఉడికించి తినడం మంచిది.

ఇది కాక బీట్‌ని ఉడకబెట్టగా వచ్చిన డికాక్షన్ చుండ్రును పోగొట్టడానికి బాగా పని చేస్తుంది. దీనికి కొద్దిగా అల్లాన్ని కూడా చేర్చవచ్చు. రాత్రి పడుకోబోయేముందు ఈ డికాక్షన్‌ని తలకు బాగా పట్టించి తెల్లవారి స్నానం చెయ్యాలి. అప్పుడు చుండ్రు పూర్తిగా నివారణ అవుతుంది. బీట్‌రూట్‌ని ఉడికించిన నీటిలో కొంచెం వెనిగర్ కలిపి స్నానం చేస్తే ఎలాంటి చర్మవ్యాధులయినా పోతాయంటున్నారు. ★

# చతుర

సంపుటి : 22   సంచిక : 4   మే : 1999

వృద్ధాప్యంలో భార్యలేని ఒంటరి జీవితాన్ని ఒదిలి అమెరికాలో వున్న కొడుకు వద్దకు వెళ్ళి వుంటున్నాడాయన.

అక్కడి క్రమబద్ధ జీవితపు యాంత్రికత, మనుషుల మధ్య లోపిస్తున్న పరస్పరాత్మీయతాభావం, మనిషి మహాప్రస్థాన సమయంలో సాటిమనిషి అతనికి మొక్కుబడిగా చెప్పే వీడ్కోళ్లు... ఇవన్నీ ఆయన మనసుని తీరని వేదనకి గురిచేశాయి.

అమెరికా వాతావరణంలో తన జీవితంలో ఏర్పడిన వెలితిని పూడ్చుకునేందుకు ఇండియాకు తిరిగివచ్చిన ఆ వృద్ధునికి ఎదురైన సంఘటనలెలాంటివి? అవి ఆయన్నెలా స్పందింపచేశాయి? తిరిగి తమ వద్దకు వచ్చెయ్యమని మరీ మరీ అడిగే ప్రియపుత్రుని అభ్యర్థనలకు సమాధానంగా ఆయన తీసుకున్న నిర్ణయం ఎలాంటిది?

భారత, అమెరికా, జనజీవన శైలిలోని వైవిధ్యాన్ని, ఆలోచనా సరళిలోని అంతగాల్నీ అక్షరీకరిస్తూ అక్కినపల్లి సుబ్బారావు రాసిన 'శీతాకాలం సూర్యుడు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



రామస్వామి దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం చదివేక రెండు రోజులనుంచీ జగన్నాధంకి సరిగ్గా నిద్రపట్టడం లేదు. తెల్లవారుజాము నాలుగున్నర గంటలకే మెలకువరాగా పరుపుమీద అటూ ఇటూ ఒత్తిగిల్లినా నిద్రపట్టే సూచనలేమీ కనిపించకపోవడంతో, పరుపు మీద నుంచి దిగి లైటువేసి రామస్వామి రాసిన ఉత్తరాలు విప్పేడు. గజిబిజిగా అక్షరాలు అలుక్కుపోయినట్లనిపిస్తే కళ్లద్దాలని సవరించుకుంటూ ఉత్తరంమీద దృష్టిని కేంద్రీకరించేడు జగన్నాధం. వంకరటింకర అక్షరాలతో, సరిగ్గా కూర్పులేని వాక్యాలతో, చిన్నపిల్లవాడు కెలికినట్లు రామస్వామి ఉత్తరం అస్తవ్యస్తంగా ఉంది. ఎన్నాళ్లయినా రామస్వామి ఉత్తరాలు రాసే ధోరణిలో మార్పురాలేదు. 'సాధారణంగా ఎనిమిది, తొమ్మిది రోజులలో రావలసిన ఉత్తరం ఎందుకో నెల్లాళ్లు తీసుకుంది' అనుకున్నాడు జగన్నాధం.

రామస్వామికి ఉత్తరాలు రాయడమంటే పరమ చిరాకు. కాలేజీ రోజుల్లో క్లాసుకి సంబంధించిన పుస్తకాలని మినహాయించి ఏ ఇతర పుస్తకాలు చదవడమన్నా ఇష్టపడేవాడుకాదు. విశాఖపట్నంలో బౌడారారోడ్డుని ఆనుకుని హార్బర్‌రోడ్డుకి దగ్గరగా ఉన్న ఇళ్లలో ఉండేవాడు. రామస్వామి తండ్రిది వడ్రంగి వృత్తి. రెండు లక్షల జనాభా ఉన్న విశాఖపట్నంలో పెద్ద కలప కంపెనీలు అప్పట్లోలేవు. లారీలమీద ఒరిస్సా రాష్ట్రం నుంచి విశాఖపట్నంకి కలప రవాణా అయ్యేది. పగలంతా ఇంటిలో తయారుచేసిన మంచాలని, టేబిళ్లని సాయంకాలం హార్బర్ రోడ్డుమీద ఒక వారగా ఉంచి అమ్మేవాడు రామస్వామి తండ్రి. రామస్వామికి ఇద్దరు చెల్లెళ్లు, ఇద్దరు తమ్ముళ్లు. ఏడుగురిని పోషించడానికి ఆ అమ్మకం వలన వచ్చే డబ్బు సరిపోక, అవకాశం వచ్చినపుడు ధనవంతుల ఇళ్లలో వడ్రంగి పనికి వెళ్లేవాడు రామస్వామి తండ్రి. తండ్రికి తీరుబడి అవకపోతే వడ్రంగి పనికి అవసరమైన కలపని ఎడ్లబండి మీద ఇంటికి తీసుకురావడం, సాయంకాలం మంచాలు, బల్లలు అమ్మేభారం రామస్వామి మీదపడేది.

రామస్వామి, తనూ ఎవిన్ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో కాలేజీ ముగిసేక ఎవిన్ కాలేజీ రోడ్డు దిగువకి చేరగానే చటుక్కున సంభాషణని తృంచి తనమానాన తాను వెళ్లేవాడు. రామస్వామి బిడియస్తుడు, మితభాషి. ఎవరితోనూ కలిసి తిరగడం కాని, ఇంటికి ఎవరినీ ఆహ్వానించడం కాని తన కంటపడలేదు. దానికి కారణం ఒక రోజు సాయంకాలం తనకి అవగాహన అయింది.

ఆ రోజు తనకి బాగా జ్ఞాపకం. కొత్తగా వెలిసిన రాజేశ్వరీ సినిమా థియేటర్‌లో 'అగ్గిదొర' సినిమా మేటనీ చూసి చెమటతో తడిసి సిగరెట్ కంపుకొడుతున్న బట్టలతో, హాలులోంచి బైటపడి, అలవాటుగా వెళ్లే రోడ్డు మీద మరమ్మత్తులు జరుగుతుంటే హార్బర్ రోడ్డెంబట ఇంటివేపు నడక మొదలుపెట్టేడు. సాయంకాలం ఆరు గంటలయింది. సూర్యుడు కిందకి దిగజారినా వేడి పూర్తిగా తగ్గలేదు. బహిరంగ మరుగుదొడ్డిలా వాడుతున్న ప్రదేశంనుంచి వస్తున్న కంపు, కుళ్లుకాలవలో నిలిచిపోయిన నీళ్ల కంపు కలిసి ముక్కుపుటాలని బద్దలు కొడుతుంటే దాని బాధ భరించలేక గబాగబా నడుస్తున్నపుడు రోడ్డు వారగా నులకలేని మూడు మంచాలని ఆనుకుని నిలబడ్డ రామస్వామిని చూసేడు. రామస్వామి తనని గమనించలేదు. రామస్వామి మంచాలు అమ్ముతాడని తనకి అంతవరకు తెలియదు. నుదుటని పట్టిన చెమటని రుమాలుతో పదేపదే తుడుచుకుంటూ అవస్థపడుతున్న రామస్వామి దగ్గరగా నిలబడి,

"ఏమిటి ఇక్కడ నిలబడ్డావు రామస్వామీ?" అని తను ప్రశ్నించిన తక్షణం రామస్వామి మొహం రంగులు మార్చింది. రామస్వామి మొహంలో సిగ్గు, సంకోచం, ఆవేదన అన్నీ ముమ్మరంగా కానవచ్చేయి. రామస్వామి వెంటనే ఏమీ సమాధానమీయ

లేదు. రామస్వామి ధోరణి వింతగా కని పించింది తనకి.

"కనిపించడం లేదా? మంచాలు అమ్ము తున్నాను'' అన్నాడు రామస్వామి దురుసు గా. ఆ దురుసుతనానికి ముఖ్య కారణం బహుశా తన లేమి నా కంటపడిందనేమో. లేకపోతే తను చేస్తున్న పనికి లేని న్యూనతని ఆపాదించుకుని బాధపడుతున్నాడేమో! అనుకున్నాడు తను. అతని దురుసుతనాన్ని పట్టించుకోకుండా "మంచం ఎంత ఖరీదే మిటి?" అనడిగేడు తను.

"ఐదు రూపాయలు'' అంటూ మెల్లగా రామస్వామి శాంతపడ్డాడు.

నెలకి నూట ఎనభై రూపాయల ఆదాయం ఉన్న మా కుటుంబంలో ఆరుగు రు ఉన్నారని, ఆర్థికంగా రామస్వామి కుటుంబంకంటే మేమేమీ ఎత్తులోలేమని అతనికి తెలియదు. నేను తరచూ సినిమాలకి వెళ్తానని అతనికి తెలుసు. అది నా బలహీ నత, కాని తను అన్నింటికన్నా దిగువ తరగతి టిక్కట్టు కొంటాడని అతనికి తెలియ దు. మేకపోతు గాంభీర్యంలా ఘరానాగా ఉన్న మూడు జతల బట్టలని శుభ్రంగా ఉంచుకోవడం చూసి తన ఆర్థిక అంతస్థుని తప్పుగా అంచనా వేసేడు రామస్వామి. కాలంతోపాటు రామస్వామితో స్నేహం పటి ష్టమైంది. ఆర్థిక దుస్థితి మనలో ఉన్న నిబ్బరాన్ని ఎంత చంపేయగలదో ఆ రోజు ల్లో తనకి అవగాహనైందనుకుంటుంటే ఒక్కసారి గాజు కిటికీ మీద మొదలయిన శబ్దం జగన్నాథం ఆలోచనల్ని తెంపింది. కిటికీ దగ్గరగా వెళ్ళి బైటకి దృష్టిసారించేడు జగన్నాథం.

ఎదురుగా గడ్డకట్టిన మిచిగన్ సరస్సు మీద మంచువానల మిశ్రమం పడుతోంది. సూర్యోదయానికి ఇంకా రెండు గంటలు వ్యవధి ఉన్నా తూర్పున దూరంగా, లీలగా వెలుతురు బైటపడ ప్రయత్నిస్తోంది. యుక్తవ యస్సు వచ్చి వయ్యారంగా కులుకుతున్న కన్నెపిల్లలా మంచుబద్ధకంగా ఊగుతూ ఆకా శంమీదనుంచి కిందకి దిగుతుంటే కన్నె పిల్లల్ని అదిలిస్తున్న తల్లిలా వాన చినుకులు, మంచుతునకల్ని దిగమని హడావుడి పెడు తున్నాయి. ఎన్నాళ్ళు చూసినా ఎన్నిసార్లు చూసినా ఆకాశాన్ని చీల్చుకుని కృత్రిమమైన తెల్లని రంగుని ప్రకృతికి ఆపాదిస్తూ కిందకి దిగుతున్న మంచు వింతగానే ఉంటుందను కుంటూ జగన్నాథం బాత్రూంలోనికి వెళ్ళి పళ్ళుతోముకుని వచ్చేసరికి ఐదుంపావ యింది. ఇంకో గంట గడిస్తే కాని కాఫీకి ప్రయత్నం తను చేయలేదు. కాఫీ కోసం వంటింటిలోకి వెళ్తే ఆ చప్పుడుకి నిద్రపోతు న్న ప్రజలకి అనవసరంగా నిద్రాభంగం! ఆరుంపావుకి పిల్లలులేచి స్కూలుకి వెళ్ళడాని కి తయారవుతారు. అప్పుడయితే ఫరవాలే దు అనుకుంటూ రామస్వామి రాసిన ఉత్తరా న్ని మరోసారి చేతిలోకి తీసుకున్నాడు జగ న్నాథం.

"జగన్నాథం, నేనూ మీ దేశం వచ్చేస్తు న్నానోయ్'' అన్న వాక్యం చదవగానే రామ స్వామితో ఐదేళ్ళక్రితం జరిగిన సంభాషణ జ్ఞాపకానికి వచ్చింది.

"మనిషి తనలో అసంతృప్తికి ఇతరులు కారణం అని నిందిస్తాడు. కాని అది నిజం కాదు. నీలో అసంతృప్తికి నువ్వే కారణం" అన్నాడు రామస్వామి తను అమెరికా వెళ్ళడా నికి సన్నాహమవుతుంటే. తనేమీ సమాధాన మీయలేదు.

"నిర్ణీత కాలానికి ముందరే పదవీ విర మణ చేసేవు. చాలాకాలంగా ఉన్న ఊరుని, స్నేహితుల్ని, బంధువుల్ని వదలి నీ జీవితం అక్కడ సంతృప్తిగా వెళ్తుందన్న భ్రమతో పరిగెడుతున్నావు'' అంటూ తను అమెరికాకి మకాం మార్చడాన్ని నిరసించేడు రామ స్వామి. అలా అన్న రామస్వామి ఈనాడు ఈ దేశం తరలి రావడానికి తగినంత బలీ యమైన కారణం ఉందా? అతని కారణాలు తనకి అల్పమైనవిగా కనిపించవచ్చు. ఆనా డు, రామస్వామికి తను ఈ దేశం రావడానికి కారణాలు అల్పమైనవిగా కనిపించలేదూ?



అనుకుంటూ తర్కించుకున్నాడు జగన్నాథం.

"దీపం చుట్టూ పరిగెత్తే శలభాల్లా అమెరికా అంటే ఎందుకు పరిగెడతారో!?" అన్న రామస్వామి ఊహాలు గత నాలుగైదేళ్లలో అంతగా మారేయా? అని అబ్బురపడుతుంటే, కిటికీ మీద చుర్‌చుర్ అన్న శబ్దం చేస్తూ చిన్న వడగళ్లు పడడం మొదలుపెట్టేయి. నాలుగైదు పెద్దపెద్ద మెరుపులు మెరిసేయి. కాకరపువ్వొత్తులు కాలుతున్నపుడు వెలువడే శబ్దంలా గాలి తాకిడికి కిటికీమీద మంచుచేస్తున్న శబ్దం జగన్నాధానికి చంచలని జ్ఞాపకానికి తెచ్చింది.

చంచల! ఎప్పటిమాట!

పచ్చిమిరపకాయ బజ్జీలు తిని, ఆ కారం భరించలేక నాలికని బైటకిపెట్టి, ఓణీ చెంగుతో విసురుకుంటూ కంటి నిండా తిరిగిన నీళ్ల పొరతో, ముక్కు ఎగపీలుస్తూ, డాబామీద కాలుకాలిన పిల్లిలా, కంగారుగా పచార్లు చేస్తున్న చంచలని మొదటిసారి చూసినపుడు తనలో ఏదో చెప్పలేని, వ్యక్తపరచలేని ఉత్సాహం రేకెత్తింది. తను స్థంభం

వెనుక కూర్చున్న సంగతి ఆమె గమనించలేదు. కారమంటే పడని తనకి పచ్చిమిరపకాయ బజ్జీలంటే హడల్. ఒకపక్క నోరు మండుతున్నా ఉఫ్, ఉఫ్ అని ఊదుకుంటూ రెండో పక్క మిరపకాయ బజ్జీని కొరకబోతున్న చంచలని చూస్తే ఆశ్చర్యమేసింది. అలా మంటతో పరిగెడుతూ ఆ వెధవ బజ్జీ తినకపోతే ఏంపోయింది? అనుకున్నాడు. చంచలతో పరిచయం పెరిగేక ఆ మాటే అంటే,

"నువ్వు ఒట్టి బుద్ధావతారంవి. కారంతో నోరు మండితేనే కదా మజా!" అంది.

చెంగల్వరావు పేటలో, ఆరు పోర్షన్లు ఉన్న ఇంటిలో ఒక భాగంలో చంచల, ఆమె తల్లి ఉండేవారు. గాలి జొరపడని ఇరుకు గదులు, ఆరు కుటుంబాలకి సమిష్టిగా రెండు పాతకాలపు మరుగుదొడ్లు. అందరి పోర్షన్లని ఆనుకుని చుట్టూ ఉన్న అరుగు మధ్యలో ప్రాంగణం. అద్దెకి దిగినవాళ్ళు, ఆ గూభ్యపు గదులలో ఎక్కువకాలం ఉండలేక అవకాశం దొరకగానే పోర్షన్ ఖాళీచేసి వెళ్ళిపోయేవారు. ఇంకేదారి లేనివాళ్ళు, ఆర్థికంగా ఇబ్బంది పడేవాళ్ళు తమ కుటుంబంతోపాటు ఎక్కువ కాలం అద్దెకి ఉండిపోయిన కుటుంబాలు చంచలది, హరనాథ్‌ది. తన ఇంటర్మీడియట్ చదువు ఆ గూభ్యంలోనే మొదలయింది. ఉన్న ఒకే ఒక గదిలో ఆరుగురు సర్దుకునేవారు. గదిలో నిర్వీర్యంగా వెలుతురునిచ్చే ఎలక్ట్రిక్ బల్బ్ కాంతి చాలక, రాత్రుళ్ళు అరుగు మీద, వెలుతురు ఎక్కువనిచ్చే ఎలక్ట్రిక్ బల్బ్ కింద కూర్చుని చదువుతో కుస్తీ పట్టేవాడు. సాయంకాలం డాబామీద, రాత్రుళ్ళు అరుగు మీద కూర్చుని చదువుకుంటున్నపుడు చంచల అటూఇటూ తిరుగుతూ తన కంటపడేది.

చంచల! ఇతరుల గురించి పట్టించుకోనట్లే ప్రవర్తించేది. ఒకే బిల్డింగ్‌లో ఉంటూ రోజూ ఒకరికొకరు అడపాతడపా ఎదురుపడినా చంచలతో ఏమీ మాటలాడకుండానే ఒక సంవత్సరం గడిచింది. పురుషుడు మాటలాడడానికి దగ్గరగా వస్తే ఆడవాళ్ళు పులిని చూసినట్లు భయపడే రోజులవి!

ఒక్కసారి శబ్దం చేస్తూ హాలులో ఉన్న 'తాతగారి గడియారం' అనబడే గోడగడియారం, తను ఇంకా తిరుగుతున్నానని చెబుతూ ఆరు గంటలు కొట్టింది.

జగన్నాథం ఆలోచనలు చంచలని వదిలి వాస్తవానికి వచ్చాయి.

ఇంకో పావుగంట గడిస్తే తను కాఫీ కలుపుకోవచ్చు. ఏమిటో ఇక్కడ ఇన్‌స్టెంట్ కాఫీ తాగితే కాఫీ తాగేమనిపిస్తుందేగాని సంతృప్తి మాత్రం లభ్యమవదు. ఐదేళ్ళ క్రితం వరకు ప్రతీరోజూ విజయనగరం పాల్ఘాట్ డికాక్షన్ కాఫీ తాగేవాడు. 'అబ్బ ఆ రుచేవేరు' అనుకుంటూ పాత కాఫీ రుచిని జ్ఞాపకానికి తెచ్చుకున్నాడు జగన్నాథం.

రామస్వామి అన్నట్లు తనకి నిన్నమీద యావ ఎక్కువ. అనుకుంటూ రామస్వామి ఉత్తరాన్ని మడిచి, పరుపు మీదనుంచి దిగి, మెల్లిగా వంటింటిలోకి చేరేడు జగన్నాథం.

మైక్రోవేవ్ ఓవెన్‌లో నీళ్ళని వేడిచేసి, ఇన్‌స్టెంట్ కాఫీ పొడర్, పాలు, పంచదారని జతచేసి, కాఫీ కప్పుతో డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని ఒక గుక్క కాఫీ తాగేడు జగన్నాథం. ప్రతీరోజులాగే కాఫీ రుచిలో మార్పేమీలేదు. ఐదేళ్ళుగా రోజుకి మూడుసార్లు కాఫీ తాగుతున్నా ఇక్కడ కాఫీ రుచితో తనకి రాజీ కుదరలేదు అనుకుంటూ అన్యమనస్కంగా అనాసక్తితో కాఫీ చప్పరిస్తూ మళ్ళీ ఆలోచనలలోకి ఒరిగేడు జగన్నాథం. ఎన్నుకోవడానికి ఆస్కారం లభించకుండా వున్న ఒకే ఒకమార్గంలో నడిచిన జీవితం తనది. ఆరవ తరగతి తరువాత ఏడవ తరగతిలోకి వచ్చినట్లు, చదువు, ఉద్యోగం, వివాహం, ప్రత్యేకంగా తన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా కేవలం యాంత్రికంగా జరిగేయి. తను పెరిగిన వాతావరణంలో వైవిధ్యంగా ఆలోచించడానికి అవకాశమేలేదు. పర్యవసానంగా స్వతంత్రించి ఏ పని చేయాలన్నా కాలంతోపాటు తనలో పెరిగిన పిరికితనం

దానికి అడ్డు తగిలేది. పిరికితనం! చంచలకి పిరికితనం అంటే కోపం.

మళ్ళీ జగన్నాథం ఆలోచనలలోకి చంచల చొచ్చుకువచ్చింది.

ఆవేళ దీపావళి. అన్ని కుటుంబాలు సమ ష్టి ప్రాంగణంలో మతాబులు, చిచ్చుబుడ్డులు కాలుస్తున్నారు. వాతావరణమంతా వెలుతురుతో నిండి వుంది. ఇనుపరజను ఎక్కువగా ఉన్న కాకర పువ్వొత్తులని చంచల కాలుస్తుంటే, చుర్ చుర్ మంటూ వెలుగు పువ్వులు కిందకి జారుతున్నాయి. ఎవరో వెలిగించిన భూచక్రం, గెంతుకుంటూ చంచల వేపు వస్తుంటే దానిని తప్పించుకోవడానికి చేతిలో ఉన్న కాకరపువ్వొత్తిని జారవిడిచి, ఒకచేతితో పరికిణీని పట్టుకుంటూ, వెనక్కి పరిగెట్టి తనమీద వాలింది. స్థంబాన్ని ఆనుకుని తను, మెత్తని చేతులతో తనని సొంతం అద్దుకున్న చంచల. పదహారేళ్ళ చంచల లేతమొహం సిగ్గుతో అలా కందిపోవడం తను ఆ దీపావళి కాంతిలో మొదటిసారి చూసేడు. యాంత్రికంగా ఆమె పడిపోకుండా ఉండాలని, లిప్తపాటు ఆమెని అందుకున్నాడు. తమాయించుకుని చంచల తనకి దూరంగా జరిగింది. ఎవరు ఏమనుకుంటారోనని తను హడలిపోయి మర్నాడు చంచలతో అదే మాటంటే, "ఆ మాత్రం నాకు తెలియదేమిటి? ప్రతీదానికీ నువ్వు భయపడతావు. ఇలా అయితే కష్టమే'' అంది కళ్ళు చికిలించి చేతులు ఊపుతూ. తను ఆ మాటలు సరిగ్గా వినలేదేమోనని సరిపెట్టుకున్నా, ఆమె గురించి ఆలోచన వచ్చేసరికి చంచల మెత్తని చేతుల స్పర్శ తనకి ఎన్నోసార్లు గగుర్పాటుని కలిగించింది.

పాత జ్ఞాపకాలు శరీరంలో దాగున్న జబ్బులాంటివి.

జబ్బు శరీరంలో దాగుకుంటుందా? ఏమో! ఒకసారి జ్వరం వస్తే సందు చివర్న ఉన్న డాక్టర్ భార్గవ్ దగ్గరకి వెళ్లేడు తను. కుండబద్దలు కొట్టినట్లు, పుల్లవిరిచినట్లు మాట్లాడే అతని దగ్గరకి చాలా తక్కువమంది వైద్యానికి వెళ్లేవారు. భార్గవ తక్కువ ఫీజు తీసుకుంటాడని ఇంటిలో అందరూ అతనినే సంప్రదించేవారు. భార్గవ్ అన్ని పరీక్షలు చేసి పొత్తి కడుపు బలంగా ఒత్తి చూసి,

"ఇది ఎమీబియాసీస్. దీనికి నెల్లాళ్ళు ఫ్లేజిల్ మాత్రలు వాడాలి'' అంటూ మాత్తర్లకి ప్రిస్కిప్షన్ రాసిచ్చేడు.

తను యథాప్రకారం భయపడుతూ "ఇది పూర్తిగా నయమౌతుందా?" అనడిగేడు. రెండు వందల పౌన్ల శరీరం ఊగిపోయేలా కదలి నవ్వుతూ, "మనిషి చావుతోనే ఇది పూర్తిగా చస్తుంది. మాత్తర్లు వాడేక తాత్కాలికంగా వ్యాధి సమసి పోయినట్లనిపించినా అది పేగులలో దాగుకుని కడుపులో పరిస్థితులు దానికి అనుకూలంగా కనిపించినపుడు మళ్లీ రోగం తిరగపెడ్తుంది. దీనివల్ల పెద్ద ఇబ్బంది ఉండదు కాని న్యూసెన్స్'' అన్నాడు. అది నిజం అయి ఉండాలి. తరువాత కాలంలో ఫ్లాజిల్ మాత్రలని చాలాసార్లు తను వాడాల్సిన అగత్యం కలిగింది.

ఆ వ్యాధిలాగే ఇన్నేళ్ల తరువాత చంచల జ్ఞాపకాలు బైటపడ్డాయి. దీనికి కారణమేమిటి? అని జగన్నాథం ఆశ్చర్యపడుతుంటే నరేంద్ర వంట గదిలోకి వచ్చి,

"కిటికీ మీద వడగళ్లు పడుతూ చేసిన శబ్దంవలన మీకు మెలకువ వచ్చేసిందా నాన్నా?" అనడిగేడు.

"లేదు, వడగళ్లు పడకముందే నాకు తెలివివచ్చింది'' అని సమాధానమిచ్చేడు జగన్నాథం.

"కేవలం మంచు కురిస్తే ఫరవాలేదు. కాని దానికి జతగా వానకలిస్తే వాన భూమి మీదకి దిగగానే ఐస్ అయే ప్రమాదం ఉంది. రోడ్లు తెగ జారుడుగా తయారవుతాయి. నిర్ణీత కాలానికి ఆఫీసుకి చేరాలంటే మామూలుగా తీసుకునే టైమ్‌కన్నా ఎక్కువ టైమ్ పడుతుంది. నేను సాయంకాలం ఆఫీసు నుంచి రావడం కాస్త ఆలస్యమౌతుంది. ఈవేళ పార్టీ సంగతి పద్మ నీకు చెప్పిందా

## స చిత్ర విచిత్రం



జూలై 4న అమెరికాకి స్వతంత్ర మొచ్చింది. ఆరోజు ప్రచురించేందుకు 'న్యూయార్క్ టైమ్స్' దినపత్రిక ఓ ఫొటో కాంపిటీషన్ పెట్టింది. దేశభక్తి ఇతివృత్తంగల ఈ ఫొటో ఆ పోటీలో గెలుపొందింది. దీనిని క్రిస్టల్ బోన్‌హేమ్ అనే ఆవిడ తీసింది. బహుమతి విలువ 250 డాలర్లు.

నాన్నా?" అని ప్రశ్నించేడు నరేంద్ర.

"చెప్పిందోయ్, కానీ ఈ చలిలో నాకు బైటకి వెళ్లాలనిపించడంలేదు. ఈవేళ నేను ఇంటిలోనే ఉండిపోతాను'' అన్నాడు జగన్నాథం.

"నీ ఇష్టం నాన్నా'' అంటూ స్నానం చేయడానికి లేచేడు నరేంద్ర.

చల్లారిపోయిన కాఫీని, మైక్రోవేవ్ ఓవెన్‌లో ఉంచి వేడిచేసి బైటకి తీసి బైట కురుస్తున్న మంచువేపు చూస్తూ కాఫీ తాగడం కొనసాగించేడు జగన్నాథం.



భారంగా శబ్దం చేస్తూ నడుస్తున్న గోడగడియారం, ఇంటిని వేడిగా ఉంచడానికి ఫర్నెస్ చేస్తున్న శబ్దం మినహా ఇంటిలో అలికిడిలేదు. నరేంద్ర, కోడలు పద్మ ఆఫీసుకి, పిల్లలు రాజు, రాధ స్కూళ్లకి వెళ్లి దాదాపు రెండు గంటలయింది. మంచు కురవడం నిలిచిపోయేక గుబురు మేఘాలమధ్య ఖాళీలలోంచి సూర్యుడు బైటపడడానికి గింజుకుంటున్నాడు. పెద్దపెద్ద మెషీన్లు, రోడ్డు మీద నిలిచిపోయిన మంచుని కీచుశబ్దం చేస్తూ రోడ్డుపక్కకి నెడుతున్నాయి. చెట్లమీద ఎలక్ట్రిక్ తీగలమీద చిక్కడిపోయిన మంచు గాలి వీచగానే చలితో శరీరం జలదరించినట్లు కదిలి జారుతుంటే మంచు బరువుతో ఒరిగిన చెట్టుకొమ్మలు, మెల్లిగా తమ పాత దశకి చేరుతున్నాయి. ఎంత మంచు కురిసినా రోడ్లమీద శుభ్రం చేయకుండా మంచు ఉండిపోవడం తను చూడలేదు. మానవుని కనీస అవసరాలు తీరడానికి ఈ దేశం చేసినంత ప్రయత్నం ఇంకేదేశమైనా చేస్తుందా? అంటూ ఆశ్చర్యపడుతూ ఆలోచనలోపడ్డాడు జగన్నాథం.

సాయంకాలం పార్టీకి రానని, ఇంట్లోనే ఉండిపోతానని చెప్పి తనేమైనా తప్పుచేసేడా?

పార్టీలు! అమెరికాలో ఇండియన్ల పార్టీలు, విచిత్రంగా ఒకే ఫక్కీలో ఉంటాయి. పుట్టినరోజనో, పిల్లలు హైస్కూల్ లేదా కాలేజీ ముగించేరనో, ఇరవై ఐదేళ్ల వైవాహిక జీవితం పూర్తయిందనో పార్టీలు తరచూ జరుగుతుంటాయి. ఆరు నెలల క్రితం నవీన్ దంపతులు తమ ఇంటి ఆవరణలో ఇరవై నాలుగు వేల డాలర్లు ఖర్చుపెట్టి కొత్తగా కట్టించిన స్విమ్మింగ్‌పూల్ చూడడానికి తెలిసిన వ్యక్తులని విందుకు ఆహ్వానించేరు. దాదాపు ఇరవై అడుగుల పొడవు, ఆరేడు అడుగుల వెడల్పుతో మెలికలు తిరిగి ఉన్న స్విమ్మింగ్‌పూల్‌లో ఈతవచ్చిన అతిథుల పిల్లలు కేరింతలు కొడుతుంటే ఈతరాని ఐదారేళ్ల పిల్లలు లైఫ్‌గార్డ్ వేసుకుని లోతు తక్కువగా ఉన్న నీళ్లలో కాళ్లని కదుపుతూ ఆనందిస్తున్నారు. నవీన్ స్విమ్మింగ్‌పూల్ చెప్టామీద కూర్చుని నీళ్లలో ఉన్న పిల్లలందరినీ నిశితంగా గమనిస్తూ ఏ అవాంతరమూ జరగకుండా గస్తీ కాస్తుంటే విందుకు విచ్చేసిన అతిథులు స్విమ్మింగ్ పూల్‌కి పదిహేను ఇరవై అడుగుల దూరంలో కుర్చీలు వేసుకుని కబుర్లలో పడ్డారు. యథాప్రకారం, హిందూదేశ సంప్రదాయాన్ననుసరించి పురుషులందరూ బైట ఒక చోట, ఇంటిలో ఎయిర్ కండిషన్డ్ గదులలో స్త్రీలు ఇంకొకచోట కూర్చుని లోకాభిరామాయణం మాటలాడుకుంటున్నారు. నవీన్ భార్య యశోద, ఇంటికి వచ్చిన

అతిథులకి ఫలహారం, డ్రింక్ అందేయో, లేదో అని అందర్నీ ప్రశ్నిస్తోంది. సూర్యుడు అస్తమించి, వెలుతురు తగ్గడంతో, స్విమ్మింగ్‌పూల్‌లోంచి పిల్లలని బైటకి రమ్మనమని నవీన్ మూడు, నాలుగు సార్లు హెచ్చరించడం విని, ఈత కొడుతున్న పిల్లల తల్లులు ఇంట్లోంచి బైటకి వచ్చి పిల్లలకి తువ్వాళ్లని చుట్టేరు. అరగంటలో పూల్ దగ్గర కోలాహలం తగ్గడంతో ఊపిరి తీసుకున్నాడు నవీన్.

స్టాక్‌మార్కెట్, ఆఫీసులో ప్రమోషన్లు పురుషుల చర్చనీయాంశాలయితే, పిల్లల డాన్స్, టెన్నిస్ పాఠాలు, మంచి ప్రింట్ తెలుగు వీడియోలు దొరకడం గురించి స్త్రీలు ఉద్వేగంతో చర్చని కొనసాగిస్తున్నారు. పొట్లకాయలు, ములక్కాడలు ఒక పౌండ్‌కి ఆరు డాలర్లేమిటి? అని వాపోవడం వినిపించింది. స్విమ్మింగ్‌పూల్‌కి దగ్గరగా మల్లెపొదలనానుకుని ఒంటరిగా కూర్చున్న తన చెవిలో స్త్రీల సంభాషణ, ఇంకొక చెవిలో పురుషుల చర్చ పడుతోంది. తనని మినహాయిస్తే పార్టీకి వచ్చిన అతిథులందరూ మధ్య వయస్సు వాళ్లే. కాస్సేపటికి చెవిలోపడుతున్న మాటల గురించి పట్టించుకోకుండా ఇటూ అటూ చూడసాగేడు తను. పడమటన సూర్యుడు ఎరుపురంగుని వదిలి కిందకి దిగిపోయేడు. నీలంరంగు దుప్పటిమీద చిన్నచిన్న పిండి వడియాలు ఆరెట్టినట్టు నీలంరంగు ఆకాశం మీద మబ్బు ముద్దలు కదలకుండా కూర్చున్నాయి. ప్రతీ పది పదిహేను నిమిషాలకొకసారి నిశ్చలంగా ఉన్న ఆకాశంమీద అరుచుకుంటూ పక్షుల గుంపులు పరిగెడుతుంటే ఆనందంగా, ఆశ్చర్యంగా వాటిని చూస్తుంటే,

"నాన్నా ఇతను కమల్, వీళ్లు కమల్ తల్లితండ్రులు'' అంటూ దాదాపు ఇరవై ఏళ్ల వయస్సుగల దంపతులని నరేంద్ర పరిచయం చేసేడు.

కమల్ తల్లితండ్రులు, ఇండియాలో ప్రదేశాల గురించి, రాజకీయాలు గురించి తెలిసిన వ్యక్తుల గురించి ముచ్చటించుకున్నారు. కాస్సేపయేక "మేము ఎల్లుండి ఇండియాకి తిరిగి వెళ్లిపోతున్నాం" అన్నాడు కమల్ తండ్రి.

"అదేం?" అనడిగేడు తను.

"ఆరు నెలల వీసామీద ఈ దేశం వచ్చేం, ఆ గడువు ఈ ఆదివారంతో పూర్తవుతుంది''

"ఇదే మొదటిసారా మీరు అమెరికా సందర్శించడం? లేక ఇదివరలో వచ్చారా? ఎలా అనిపించింది అమెరికా బతుకు?" అనడిగేడు తను.

"అమెరికాకేం అద్భుతంగా ఉంది. నా భార్యకి ఆస్త్మా ప్రోబ్లెమ్ ఉంది. ఈ దేశం సందర్శించడానికి వచ్చే యాత్రీకులకి అవసరమైన ఇన్స్యూరెన్స్ కొనుక్కున్నా, అది పాత వ్యాధులకి ఉపయోగపడదుట. స్వంత పైకంతో డాక్టర్లని సంప్రతించడం ఇక్కడ చాలా ఖర్చుతో కూడినపని'' అన్నాడు కమల్ తండ్రి. తల ఊపేడు తను.

"చాలా ప్రదేశాలు చూశాం బాగున్నాయి. కానీ ఈ ఆరు నెలలలో మా అబ్బాయి ఇంటికి పక్కగా ఉన్న ఇళ్లలో ఎవరు ఉన్నారో మాకు తెలియదు. అది నన్ను ఆశ్చర్యపరిచింది'' అన్నాడు కమల్ తండ్రి.

"ఈ దేశంలో ఒకరి గురించి ఇంకొకరికి అక్కరలేదు. ఎవరి బతుకులు వాళ్లవి. అదే ఈ దేశం ప్రత్యేకత"

"ప్రత్యేకత మాట ఏమోకాని నాకు అది చాలా విచిత్రమనిపించింది'' అన్నాడు కమల్ తండ్రి. దానికి ఏం సమాధానం చెప్పాలో తెలియక, తను పేలవంగా నవ్వేడు.

పార్టీలలో ఉన్న మధ్య వయస్సు జనంతో తను కల్పించుకుని మాటలాడలేడు. తన వయస్సు వాళ్లు పార్టీలలో ఉండకపోతే పార్టీలకి వెళ్లి ఒక మూలగా కూర్చుని ఆలోచనలలో పడడంలో ఆనందంలేదు, అనుకుంటూ పదోసారి రామస్వామి ఉత్తరాన్ని విప్పేడు జగన్నాథం.

"నేనూ మీ దేశం వచ్చేస్తున్నానోయ్, ఈ

విషయంలో నీ సలహా కావాలి'' అంటూ ప్రారంభమైన వాక్యం చదివేక సన్నగా నవ్వు కున్నాడు.

"ఈ విషయంలో నీ సలహా కావాలి'' అంటూ తన సలహా కోరిన రామస్వామి తను ఇచ్చే సలహాకి విలువ ఇస్తాడా?

చొరవ తీసుకుని తను ఒకటి రెండుసార్లు గతంలో సలహా ఇస్తే దానిని పాటించని రామస్వామి ఈనాడు మాత్రం పాటిస్తాడా?

రామస్వామి అతని కుటుంబ విషయాలు చర్చించడానికి ఇష్టపడేవాడుకాదు. ఇంటర్మీ డియట్ పరీక్షలలో మంచి మార్కులు రాక, ఉన్న ఊరిలోనే బి.ఏలో చేరేడు తను. మంచి మార్కులు వచ్చిన రామస్వామి, మొదట సంకోచించినా పదిహేను రోజులపాటు తను ప్రతీ రోజూ పోరడంతో ఇంజనీరింగ్ చదువు కి కాకినాడకి వెళ్లడానికి సమ్మతించేడు. కుల వృత్తిరీత్యా అతను స్కాలర్‌షిప్‌కి అర్హుడవ డంతో ఆర్థికంగా ఇతరులమీద ఆధారపడ కుండా ఇంజనీరింగ్ పూర్తిచేసేడు. ఇంజనీ రింగ్ చదువు ఆఖరి సంవత్సరంలో ఒక రోజు అర్థాంతరంగా ఊడిపడ్డాడు రామ స్వామి. ఆంధ్రా యూనివర్సిటీలో ఇంగ్లీ షులో ఎమ్.ఏ ఆఖరి సంవత్సరం క్లాసు లోంచి బైటకి రాగానే, తలుపు దగ్గరే తచ్చా డుతున్న తన జబ్బపుచ్చుకుని,

"అలా పద, అవుట్ గేటు దగ్గర కాఫీ తాగుదాం" అన్నాడు. అతని పాలిపోయిన మొహం చూడగానే ఏదోలా అనిపించింది. రామస్వామి ఏదో తీవ్రమైన ఆలోచనలో ఉన్నాడన్న అతని పరధ్యానం చెబుతోంది.

"నీకు నా చెల్లెలు నీరజ తెలుసా?" అనడిగేడు నాలుగు అడుగులువేశాక.

"తెలుసా అంటే తెలుసు. ఇక్కడా అక్క డా రెండు మూడుసార్లు కనిపించింది. ఏం ఎందుకు వేసేవు ఆ ప్రశ్న?" అని తిరిగి ప్రశ్నించేడు తను.

"ఆమె మెడిసిన్ చదువుతోందని ఒకసారి నీకు చెప్పేను, జ్ఞాపకముందా?"

తల ఊపేను నేను. రామస్వామి ఇంకా ఏదో చెప్పబోతున్నాడని నేనేమీ మాటలాడలే దు.

"ఒక వారంరోజుల క్రితం తన క్లాస్‌మేట్ డేనియల్‌ని రిజిస్టర్ పెళ్లి చేసుకుని ఇంట్లోంచి వెళ్లిపోయింది'' అంటూ బాంబు పేల్చేడు రామస్వామి. ఏంమాటలాడాలో తెలియని ఇరకాట పరిస్థితి అది. మౌనమే శరణ్యమని తను నోరు విప్పలేదు.

"ఇంటిలో అందరూ ఆమె చేసిన వెధవప నికి లబోదిబోమంటున్నారు, ముఖ్యంగా మా అమ్మ'' అన్నాడు బొంగురుపోయిన కంఠంతో. వర్షించబోయే మేఘంలా ఉంది అతని ధోరణి.

లోకం అంటే ఏమీ తెలియని రోజులవి! తెల్లనివన్నీ పాలని, నల్లనివన్నీ నీళ్లని నమ్మిన రోజులవి! ఇద్దరు వ్యక్తులు ఇష్టపడి తే వాళ్లు ఇంకే ఇతర విషయాలకి ప్రాధాన్యం ఇవ్వకుండా పెళ్లి చేసుకోవడం తప్ప ఇంకేమీ ఇతర మార్గం లేదని విశ్వసించిన రోజులవి! కాస్త అశుభ్రంగా కనిపించిన వ్యక్తి ఇంటికి వచ్చి నీళ్లడిగితే "నీగ్లాసు తెచ్చుకో దానిలో పోస్తాం" అన్న చిన్నాన్న పీక పిసికే ద్దామన్నంత కోపం వచ్చిన రోజులవి! ఉడికీ ఉడకని ఆదర్శాలని గాఢంగా హృదయానికి హత్తుకున్న రోజులవి.

రామస్వామి చెల్లెలు కానిపనేమీ చేయలే దని చెబుదామనిపించినా నీరజ, పరువు పూర్తిగా తీసిందని అంతరంగంలో కుమిలిపో తున్న రామస్వామితో అది చెప్పలేక, అత నితో మౌనంగా అవుట్‌గేటువేపు నడిచేడు.

కాఫీ తాగుతూ, "నీరజకీ మా ఇంటికీ ఇహ సంబంధాలు తెగిపోయినట్లే'' అన్నా డు.

కాలమహిమ! ఆనాడు అలా అన్న రామ స్వామి, ఈనాడు అదే చెల్లెలి సహాయంతో అమెరికా వలస రాబోతున్నాడు. మెడిసిన్ డిగ్రీ పుచ్చుకున్న రెండేళ్లకి అమెరికా వెళ్లింది నీరజ. డేనియల్ చెల్లెలి పెళ్లి చూడడానికి వచ్చి ఇంటిలో అందరికీ బట్టలూ బహుమతు

లూ తెచ్చింది. ఆమె వెళ్లాక,

"నీరజ చాలా స్వార్థపరురాలు. డబ్బంటే చెప్పలేనంత దాహం. డబ్బు ముందు బంధుత్వాలు, స్నేహాలు ఆమెకి అల్పంగా కనిపిస్తాయి. చాలా నిక్కచ్చి మనిషి. డబ్బుతో దేనినైనా కొనేయవచ్చను కుంటుంది. అయితే నీరజకి ఒక బలహీనత ఉంది. ఆమెకి పొగడ్త అంటే ఇష్టం. నీ అంతటి తెలివైన డాక్టర్ ఇంకెవరూ లేరంటే ఆమె మొహంలోనికి రక్తం తన్నుకువచ్చి అది ఎర్రమందారంలా విచ్చుకుంటుంది. నీరజ గైనకాలజిస్ట్, డేనియల్ చిన్న పిల్లల డాక్టరు. నీరజ, డేనియల్ నివశిస్తున్న ప్రదేశంలో నీరజ ఒక్కర్తే గైనకాలజిస్ట్. డేనియల్ కాకుండా మరిద్దరు చిన్న పిల్లల డాక్టర్లు అక్కడ ప్రాక్టీస్ మొదలు పెట్టేరు. ప్రాక్టీస్ మొదలుపెట్టిన రెండేళ్లలో నీరజ ప్రాక్టీస్, ఆదాయం బాగా పుంజుకోగా, డేనియల్ ప్రాక్టీసు, ఆదాయం క్షీణించాయి. నీరజ ఆదాయం డేనియల్ ఆదాయంతో లెఖ్ఖ కట్టి చూస్తే ఎంత లేదన్నా మూడింతలు ఉంటుంది. పెత్తనమంతా నీరజదే. ఇంటిలో డేనియల్ విలువ నామమాత్రమైంది. డేనియల్ సహాయంతో అమెరికా వచ్చిన సంగతి విస్మరించి, అహం పెంచుకుంది" అంటూ నీరజ విలక్షణ ధోరణిని విశదపరిచేడు రామస్వామి.

అది పన్నెండేళ్ల క్రితం.

"నీకు ఇంజనీరింగ్ డిగ్రీ ఉంది, ఆమె సహాయంతో అమెరికా వెళ్లిపోకూడదూ?" అని తను సలహా ఇస్తే "నోనో నీకేమైనా పిచ్చా? వెర్రా? ఆమె దగ్గరకి వెళ్లి ఉండడం అసంభవం. ఇది నీకు చెప్పేనో లేదో! నాకు, ఇతర కుటుంబ సభ్యులకి అమెరికా వెళ్లడానికి దరఖాస్తులు తెచ్చింది" అన్నాడు రామస్వామి. తను ఇచ్చిన సలహా రామస్వామికి నచ్చలేదని, కోపంతో ఎర్రబడిన అతని మొహం చెబుతోంది.

అలాఅన్న రామస్వామి ప్లేటు ఫిరాయించి, నీరజ దగ్గరకి రాబోతూ,

"నీ సలహా కావాలోయ్" అని ఉత్తరం రాశాడు.

"నీ సలహా కావాలి" అని అడిగే వాళ్లలో ఎంత మందికి సలహాకావాలి? నిజమైన సలహా కావాలా? లేక వాళ్లకి నచ్చిన సలహా కావాలా? రామస్వామికి ఏమిటి రాయడం? అంటూ శూన్యం లోకి చూసేడు జగన్నాధం.

★ ★ ★

"మీరు పోస్టాఫీస్ పని పూర్తిచేసి, మాల్‌లో కాస్సేపు అటూ ఇటూ తిరిగి ఇదే చోటుకి పన్నెండు గంటలకి వస్తే కలిసి ఇంటికి వెళ్లిపోదాం" అంటూ పద్మ జగన్నాధంని మాల్ గుమ్మం దగ్గరగా వదిలి వెళ్లింది.

మాల్ లోపలికి ప్రవేశించి పోస్టాఫీసు దిశగా నడిచేడు జగన్నాధం. మాల్‌లో దుకాణాలు అప్పుడే తెరుచుకుంటున్నాయి. ఒకే ఒక వ్యక్తి నిర్వహిస్తున్న పోస్టాఫీస్‌లో ఒంటరిగా కూర్చుని ఏదో పని చేసుకుంటున్న వ్యక్తి జగన్నాధం అడుగుల చప్పుడు విని తలెత్తి "వాట్ కెన్ ఐ డు ఫర్ యూ టుడే?" అనడిగేడు. ఇండియాలో పోస్టాఫీసులలో అలాంటి మన్ననలకి అలవాటు లేని జగన్నాధంకి కౌంటర్ వ్యక్తి పలకరింపు, ఎప్పటిలాగే చిరునవ్వుని తెప్పించింది. కావలసిన స్టాంప్స్ గురించి చెప్పి పది డాలర్ల బిల్‌ని అందిచ్చేడు జగన్నాధం. జగన్నాధం కోరిన తపాలా బిళ్లలని, మిగిలిన డబ్బుని జగన్నాధంకి లెఖ్ఖ చెప్పి "హేవ్ ఎ నైస్‌డే" అన్నాడు.

"థాంక్యూ... యూటూ" అంటూ కొత్తగా అలవాటు చేసుకున్న జవాబుని వల్లెవేసి పోస్టాఫీస్‌లోంచి బైటపడ్డాడు జగన్నాధం. మాల్‌లో వేలాడతీసిన గడియారం పదీ నలభై చూపిస్తుంటే "ఇంకా గంటా ఇరవై నిమిషాలు ఇక్కడ గడపాలి" అనుకుని దుకాణాలవేపు చూస్తూ పచార్లు మొదలుపెట్టేడు. ఎయిర్ కండిషన్డ్ మాల్‌లో నడిచే ప్రదేశానికి ఇరువైపులా రెడీమేడ్ బట్టల దుకాణాలు, ఫార్మశీకొట్లు, చిన్న పిల్లల ఆట వస్తువుల దుకాణాలు, పీజా, కాఫీ దొరికే ప్రదేశాలు, రెస్టారెంట్లు ఒకటేమిటి సమస్త

మూ ఉన్నాయి. ప్రతీ నూరడుగుల దూరంలో పై అంతస్థులకి వెళ్లడానికి మెట్లు, ఎస్కెలేటర్లు గలీజు లేకుండా శుభ్రంగా ఉంది మాల్. ఎవరైనా బైటపడవేసిన చిత్తు కనిపించగానే వేక్యూమ్ క్లీనర్‌తో చెత్తని ఏరేస్తోంది ఒక మాల్ పనిమనిషి. ఢిల్లీలో కన్నాట్‌ప్లేస్‌లో ప్రసిద్ధి కాంచిన పాలికా బజార్‌కి ఈ మాల్‌కీ ఎంత తేడా! ఉచ్చ, పీతుళ్ల కంపుకాని, ఛోలే బటూరాలు తయారవుతుంటే వెలువడే నూనె వాసన గానిలేవు. నడిచేటప్పుడు ఒకర్ని ఇంకొకరు తాకనవసరంలేనంత కాలిబాట. మాల్‌లో పది నిమిషాలు నడిచేటప్పటికి కాళ్లు భారంగా అనిపించేయి జగన్నాథంకి. నరేంద్ర ఇచ్చిన పది డాలర్లలో, తపాళా బిళ్లలు కొనగా మిగిలిన పైకం జేబులో ఉందని జ్ఞాపకానికి రాగా, ఎదురుగా, దాదాపు ఖాళీగా ఉన్న ఒక కాఫీషాప్‌లోకి ప్రవేశించేడు జగన్నాథం.

"నా పేరు షెరీ. నేను నీ వెయిటరెస్‌ని. ఏమి కావాలి?" అంది రెండు చేతులలో రెండు చిన్న గాజు కాఫీ చెంబులతో. తళతళలాడుతున్న ఆకులా ఉంది షెరీ, సుమారు ఇరవై ఏళ్లు ఉంటాయేమో, అనుకున్నాడు జగన్నాథం.

"చిన్న సైజు కేపుచీనో, పాలు పంచదారలతో కావాలి, ఇంకేమీ వద్దు'' అన్నాడు అమెరికన్ ఆనవాయితీని అనుకరిస్తూ. ఎదురుగా గ్లాసులో ఐస్‌వేసిన నీళ్లని ఉంచి ఆ పూబోడి లోపలకి వెళ్లేక నీళ్లని చప్పరిస్తూ నలువైపులా చూసేడు జగన్నాథం.

అందరికీ కనిపించేలా ఆరుబల్లలు, క్రెరలు మరుగుపరుస్తూ మరొక ఆరు బల్లలు ఉన్నాయి. అది కాఫీషాప్ కాదని, రెస్టారెంట్ అని జగన్నాథంకి అర్థమైంది. మూడు టేబిళ్ల మీద మనుషులు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. జగన్నాథం కూర్చున్న ప్రదేశంనుంచి ఎదురుగా ఉన్న దుకాణాలు చాలా చవుకగా వస్తువులని అమ్మేస్తున్నామన్న బోర్డులతో కొనుగోలుదార్లని ఆకర్షించ ప్రయత్నిస్తున్నాయి. ప్రభుత్వ రంగంకంటే ప్రైవేట్‌రంగం బాగా సమర్థవంతంగా పనిచేస్తుందని చెప్పడానికి ఉదాహరణకి అమెరికా కంటే ఏదేశాన్నైనా పేర్కొనవచ్చా? అని ఆశ్చర్యపడుతుంటే క్రెర తెర వెనుక ఇద్దరి వ్యక్తుల మధ్య జరుగుతున్న సంభాషణ జగన్నాథంకి వినిపించసాగింది.

"మా ఇంట్లో రేపు సాయంకాలం పార్టీకి దాదాపు పదిహేనుగురు వస్తారు''

"నీకు ఏమైనా సహాయం కావాలా?"

"నోనో! అలాంటిదేమీ లేదు. నేను మేనేజ్ చేయగలను''

"మరి ఏమిటి ప్రోబ్లెమ్?"

"ఎవరితో ఒకరితో చెప్పకపోతే ఇబ్బందిగా ఉంది. మా మావగారు మాతో ఉంటున్న సంగతి నీకు తెలుసుగా. ఈ పార్టీలు ఎంతలేదన్నా కనీసం నాలుగైదు గంటలు నడుస్తాయి. ఈ పార్టీకి వచ్చే వాళ్లందరూ నా భర్త ఆఫీసుకి సంబంధించిన వాళ్లే. ఎవరూ పరిచయంలేని వాళ్లతో మా మావగారిని కలపడం అంతమంచిది కాదు. ఆయన తెలియక ఏవేవో పాత విషయాలు మాట్లాడతారు. వయస్సు మీద పడడంతో చాదస్తం పెరిగింది. చెప్పినదే మళ్లీ మళ్లీ చెబుతారు. పార్టీకి వచ్చిన వాళ్లకి ఇబ్బంది. ఆయనని తన గదిలో ఆ ఐదు గంటలు బంధించినట్లు ఉండమనలేం. ఇదివరలో పిల్లలు ఉన్నపుడు వాళ్లవలన నాకు కొంత సహాయం లభించేది. ఆయనని బైటకి తీసుకెళ్లేవారు. వాళ్లు కాలేజీ చదువులకి దూరంగా వెళ్లిపోవడం మేమిద్దరమూ పనికి పరిగెత్తడంతో ఇప్పుడు పరిస్థితి అధ్వాన్నమైంది. ఆయనని ఏదైనా నర్సింగ్ హోమ్‌లో చేర్పిస్తే మంచిది''

"ఈ విషయంలో నీ భర్త ఉద్దేశ్యమేమిటి?"

"నేన్ను కదపలేదు. నర్సింగ్‌హోమ్‌లో ఆదరణ దానికిచ్చే డబ్బుమీద ఆధారపడి ఉంటుంది. మంచి నర్సింగ్ హోమ్‌లో ఉంచాలంటే నెలకి దాదాపు మూడువేల ఐదు వందల డాలర్లు కావాలిట. లేకపోతే సరిగ్గా చూడరు. మా మావగారికి వచ్చే

పెన్షన్ తక్కువ. మనమైనా భరించాలి లేదా ప్రభుత్వం భరించాలి. నిజమెంతో నికరంగా తెలియదుకాని చాలా నర్సింగ్‌హోమ్‌లలో డబ్బు తక్కువైతే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారంటారు. నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాలంటే ముందు ఆయనని, భార్య లేక పిల్లలో డాక్టరు దగ్గరకి తీసుకెళ్లి, నర్సింగ్‌హోమ్‌లో చేరడానికి సుముఖంగా ఉన్నట్లు ఆయన చేత కాగితాలు సంతకం చేయించాలి. అది ఆయన చేస్తారో, లేదో తెలియదు. నర్సింగ్ హోమ్‌లో చేరేముందు చాలామంది మానసికంగా. కృంగిపోతారంటారు''

"మరి ఏమిటి మార్గం?"

"ఇంకేమైనా కావాలా?" అనడిగింది షెర్రీ కేపుచీనోని జగన్నాధం టేబిల్‌మీద ఉంచుతూ.

"నో థాంక్స్. బిల్ తీసుకురా'' అన్నాడు జగన్నాధం. పూబోడి నిష్క్రమించింది. జగన్నాధం చెవులు సంభాషణని అందుకున్నాయి.

"ఏమిటో ఏమీ తోచడంలేదు''

''అవన్నీ పెద్ద పెద్ద సమస్యలు. రేపు నీకు ఏం సహాయం కావాలో చెప్పు"

"రేపు సాయంకాలం ఐదు గంటలకి మా మావగార్ని మీ ఇంటి దగ్గర వదిలి, తిరిగి, పార్టీ ముగిసేక వచ్చి తీసుకెళ్తాను''

"చంపేవు. మా ఆయన రేపు రాత్రి డిన్నర్‌కి బైటకి వెళ్దామన్నారు. ఆయన ఏమంటారో! ఆయన సాయంకాలం ఆఫీసు నుంచి తిరిగివచ్చేక, ఆయనతో సంప్రదించి నీకు ఫోన్ చేస్తాను''

"సరే మరచిపోకేం"

"కాఫీ తొందరగా తాగు. నీ హెయిర్ స్టైయిలిస్ట్ ఎప్పాయింట్‌మెంట్‌కి వేళయింది. రేపు పార్టీకి నువ్వు కొనుక్కున్న డ్రెస్ చాలా బాగుంది సుమా''

సంభాషణ ఆగింది.

కేపుచీనో తాగుతున్న జగన్నాధంకి కేపుచీనోలో తను పంచదార కలుపుకోలేదని జ్ఞాపకానికి వచ్చింది. కప్పులో కేపుచీనో రవ్వంతే మిగలడం చూసి పంచదార వేసుకునే ప్రయత్నం విరమించి కప్పు ఎత్తి పెట్టి మిగిలిన కేపుచీనోని తాగేడు జగన్నాధం.

షెర్రీ బిల్ తెస్తుందని ఎదురు చూస్తున్న జగన్నాధంకి విశాఖపట్నంలో ఆరు పోర్షన్ల ఇంటిలో గడిపిన పాత రోజులు జ్ఞాపకానికి వచ్చేయి.

ఆ రోజుల్లో ఏ కొద్ది మందో తప్ప రిటైరయేక అట్టే రోజులు బతికేవారుకాదు. తామున్న పోర్షన్‌కి ఎదురుగా ఉన్న భాగంలో ఒక స్టేషన్ మాస్టర్ కుటుంబం అద్దెకి దిగేరు. పెద్ద కుటుంబం, ఇబ్బందిగా రోజులు వెళ్లదీసేవారు. రిటైరయిన స్టేషన్ మాస్టర్ అప్పుడప్పుడు చొక్కా, బనియన్ లేకుండా కనిపించేవాడు. అతని ఒంటిమీద ఒక పౌను మాంసం కూడా ఉండేదికాదు. ఊపిరితిత్తుల ఎముకలు ప్రస్ఫుటంగా కనిపించేవి. ఆయనకి చుట్ట కాల్చడం అలవాటు. ఇంట్లో చుట్ట తాగితే కంపుకొడుతుందని బైట అరుగుమీద కూర్చుని చుట్ట కాలుస్తూ ఉమ్మివేయడం తను చాలాసార్లు చూసేడు. ఆ ఉమ్మివేయడం చూసి తనకి చిరాకు కలిగేది. ఆయన కుటుంబంలో ఇతర సభ్యులు ఆయనంటే విసుక్కున్నా ప్రత్యేకంగా అసహ్యించుకునేవారు కాదు. ప్రతిబంధకమనుకునేవారుకాదు. ఉన్నట్టుండి ఒకరోజు ఉదయం ఆ పోర్షన్ లోంచి ఏడుపులు వినిపించేయి, అందరూ ఘొల్లుమన్నారు. సాయంకాలానికి ఆయన పడుకున్నచోట దీపం వెలిగించేరు.

అది నలభై ఐదేళ్ల క్రితం ఇండియా. రోజులు క్రమంగా మారేయి. 'ముసలాడు, ముసల్ది' అంటూ తల్లితండ్రులపట్ల నిరసనగా వ్యవహరించినా విపరీతధోరణికి చేరలేదు ఐదేళ్లక్రితంవరకు. ఏమో! ఈ ఐదేళ్లలో మారిందేమో! అని ఆశ్చర్యపడుతూ షెర్రీ కోసం నలుదిక్కులా చూసేడు జగన్నాధం.

పూబోడి బిల్ తీసుకువచ్చి జగన్నాధం ఎదురుగా ఉంచి "హేవ్ ఎ నైస్‌డే'' అని

ఇతర వెయిటరెస్‌లతో కబుర్లలో పడింది. రెండు క్వార్టర్లని టిప్‌గా వదిలి, బిల్‌కి సరిఅయిన డబ్బుని కేషియర్‌కి అందించి, రెస్టారెంట్‌లోంచి బైటకి నడిచేడు జగన్నాథం.

మంచి కాఫీ తాగడానికి టిప్‌తో కలిపి రెండున్నర డాలర్లయింది. అంటే నూట పది రూపాయలు. ఇదే డబ్బుకి విజయనగరం పాల్‌ఘాట్ హౌస్‌లో ఇరవై కప్పులు కాఫీ వచ్చేది.

"నాన్నా, మీరు డాలర్లని రూపాయలలోనికి మార్చి లెఖ్ఖలు కట్టి 'అమ్మో! చాలా ఖరీదు' అన్న ధోరణి వదలాలి. లేకపోతే మీరు ఇక్కడ ఏమీ తినలేరు, తాగలేరు, కొనలేరు'' అన్న నరేంద్ర హెచ్చరిక జ్ఞాపకానికిరాగా సన్నగా నవ్వుకున్నాడు జగన్నాథం.

నరేంద్ర! ఐఐటిలో ఇంజనీరింగ్ డిగ్రీ సంపాదించేక ఈ దేశం వచ్చి చాలాకాలమైంది. నలభయ్యవ పడికి దగ్గరగా ఉన్న నరేంద్ర జుత్తు పలచపడడం ఈమధ్య కనిపిస్తోంది. పధ్నాలుగు, పదహారేళ్ల రాజు, రాధలు అమెరికాలో జన్మించినవాళ్లే. మరొక నాలుగేళ్లలో ఇద్దరూ కాలేజీ చదువులకి దూరంగా వెళ్తారు. అప్పుడు తన పరిస్థితి రెస్టారెంట్‌లో ఇద్దరు స్త్రీలు చర్చించిన పరిస్థితి లాంటిదవుతుంది. ఇండియాలో తనకి ఎనిమిది వందలు పెన్షన్ వస్తుంది. రూపాయలు చిల్లపెంకులు, డాలర్ల లోనికి మారవు. అధవా మారినా, మహా అయితే ఇరవై డాలర్లు ఇస్తారు. ఎందుకూ సరిపోని ఇరవై డాలర్లు. మంచి రెస్టారెంట్‌లో ఇద్దరు కలిసి డిన్నర్ తినడానికి కూడా సరిపోని ఇరవై డాలర్లు! ఇక్కడ ప్రభుత్వానికి తను పన్నులు కట్టలేదు, దాని నుంచి తనకి ఏం సహాయం వస్తుంది? మరి తన జీవితపు నాటకం ఆఖరి అంకం ఎలా నడుస్తుంది? అనుకుని గింజుకున్నాడు జగన్నాథం. మాల్‌లో జనసాంద్రత పెరిగింది. ఒక కుర్రవాడు తల్లితండ్రుల చేతుల్ని వదిలి పరిగెడ్తూ తొట్రుపడి బోర్లాపడి ఏడుపు లంకించుకున్నాడు. ఆ కుర్రవాని తండ్రి, కొడుకుని లేవదీసి సముదాయిస్తుంటే తల్లి కాళ్లకి, చేతులకి దెబ్బలేవైనా తగిలాయేమోనని పరిశీలిస్తోంది. చూడముచ్చటగా ఉన్న కుర్రాడు ఏడుపుని ఆపి తల్లితండ్రులని కౌగిలించుకుని మామూలయ్యేడు. ఆ ఆప్యాయత చూస్తున్న జగన్నాథం ప్రాణం లేచివచ్చింది.

ఆ జంట, కుర్రవాడు నడుచుకుంటూ జనసమూహంలో కలిసిపోయేరు. తిరిగి జగన్నాథం తన పాత ఆలోచనలలోనికి చేరేడు.

ఇండియాలోలా కాకుండా ఇక్కడ చాలా మంది తల్లిదండ్రులు పిల్లలంటే ఎక్కువ శ్రద్ధ కనబరుస్తారు. ఇండియాలో శ్రద్ధ ఎక్కువశాతం పిల్లల చదువుమీదే కేంద్రీకరించి ఉంటుంది. ఇతర వ్యాపకాలు అంత ముఖ్యంగా కనబడవు. ఇక్కడ అలాకాదు. లతలా తల్లిదండ్రులతో పెనవేసుకుని పెరిగిన పిల్లలు చాలామంది కనిపించారు. ఐనప్పటికీ కొందరి తల్లిదండ్రుల జీవితం ఆఖరిదశలో నర్సింగ్‌హోమ్‌లో ముగుస్తుంది. ఎంత విచారకరం. ఇలా ఎందుకు ముగుస్తోంది అన్నది అర్థమయ్యేసరికి చాలా కాలం పట్టింది. అమెరికాలో చాలాశాతం స్త్రీలు పురుషులలాగే పనికివెళ్తారు. అలాంటప్పుడు వయస్సు మీదపడిన తల్లిదండ్రులని సాకడం అంత సులభంకాదు. పనికి వెళ్ళకుండా కేవలం ఇంటిని నిర్వహిస్తూ నడిచే సంసారాలు లేకపోలేదు. అలా ఉన్న కుటుంబాలలో భార్యాభర్తల అభిరుచులు, ఇష్టాఇష్టాలుమారి, కొన్నాళ్ళు గడిచేక విడాకులకు దారితీసినపుడు ఇంటిలో ఉండిపోయిన స్త్రీ పరిగెత్తిపోయిన ప్రపంచాన్ని అందుకోలేక నష్టపోవడంతో స్త్రీలు ఉద్యోగానికి వెళ్ళడం మామూలైంది. ఒక వ్యక్తి ఇంకొకవ్యక్తి ఆధిక్యతని సహించని దేశం ఇది. వయస్సు మళ్ళిన వ్యక్తుల జీవితాల గురించి ఆలోచిస్తూ కూర్చుంటే తమ జీవితాలు నాశనమవుతాయేమోనన్న భయంతో బాధాకరమైనా వాస్తవికంగా ఆలోచించి ఇంకే మార్గమూ

కనపడక నర్సింగ్‌హోమ్ దారి ఎన్నుకుంటారు. కొందరి జీవితాలు నర్సింగ్‌హోమ్‌లో కాకుండా ఇంటిదగ్గరే, పిల్లల సంరక్షణలోనే ముగుస్తాయి.

ఇతరుల మాట ఎలాగున్నా నా జీవితపు చరిత్ర ఎక్కడ అంతమౌతుంది? అని రాబోయే రోజుల గురించి వ్యాకులపడుతుంటే జగన్నాథం మెదడు వేడెక్కింది. నుదుటని పట్టిన చమటని తుడుచుకుంటూ మాల్ గడియారం వైపు చూశాడు. పన్నెండు గంటలవడానికి పది నిముషాలు తక్కువని ముళ్ళుచూపిస్తుంటే జగన్నాథం మాల్‌ద్వారం వేపునడిచి, బైటకి వచ్చాడు.

చల్లని ఎయిర్ కండిషన్డ్ మాల్‌లోంచి బైటకి రాగానే జగన్నాథంకి చలికాలం ఎండ ఆహ్లాదంగా అనిపించింది. మూడు నాలుగు నిముషాలు గడిచాయి. పద్మ జాడలేదు. సూర్యుడు బాణాలని ఎడతెరిపి లేకుండా విసురుతున్నాడు. ఎండపడిన శరీరమంతా చుర్రుమనిపించగా ఎండలో నిలబడలేక తిరిగి మాల్‌లోనికి ప్రవేశించి, ద్వారందగ్గరగా నిలబడి గాజు అద్దాలలోంచి మాల్ వేపు వస్తున్న కార్లని గమనించసాగాడు.

★ ★ ★

రోడ్డువారగా టయోటా ప్రీమియా కారుని



పార్క్ చేయగానే పద్మ, జగన్నాథం కారు దిగారు. నరేంద్ర కారుని లాక్ చేసి వాళ్ల వెనకాలే ఏడు మెట్లు ఎక్కాడు. జానపద సినిమాలలో రాజుల కోటలకి ఉన్న తలుపుల లా ఉన్న తలుపు పక్కన ఉన్న డోర్‌బెల్ నొక్కింది పద్మ.

సాయంకాలం ఆరుగంటలయింది. కారు దిగి ఏడుమెట్లు ఎక్కేలోగా నుదుటని చమట ఉబకడం మొదలుపెట్టింది. తలుపు తెరచిన రవి, "రండి, రండి'' అంటూ ఆహ్వానించాడు.

"సారీ, కాస్త ఆలశ్యమైంది'' అంది పద్మ. రవి పక్కకి జరగగా ముగ్గురూ హాలులోకి నడిచారు.

బయట ముప్ఫయ్ రెండు డిగ్రీల వేడిలోంచి, లోపల ఇరవై రెండు డిగ్రీల ఉష్ణోగ్రతలో ఉన్న ఎయిర్ కండిషన్డ్ గదిలోనికి రాగానే హాయిగా అనిపించింది ముగ్గురికీ. సుమారు ముప్ఫయి అడుగులపొడవు, ఇరవై నాలుగు అడుగుల వెడల్పు గల గది మధ్యలో కొమ్మలతో వేలాడుతున్న దీపాలు మెరుస్తున్నాయి. గదిలో మూడుమూలల్లో మీదకి వెలుతురిని వెదజల్లుతున్న నల్లని హేలోజన్ లాంతర్లు, గోడమీదున్న పెయింటింగ్స్‌ని, ఇతర వస్తువుల అందాలని ఇనుమడింపచేస్తున్నాయి. అర్ధ అండాకారంలో అమర్చబడిన సోఫా సెట్ గదిలో మూడు పక్కలకి విస్తరించి ఉంది. దానికి ఎదురుగా నాలుగడుగుల వ్యాసం గల గాజు అద్దం, వర్తుల స్థంభాకారంమీద పైనున్న దీపాల ప్రతిబింబాల్ని చూపిస్తోంది. బైట నుంచి లోపలికి వచ్చే తలుపు దగ్గరగా మేడమీదకి వెళ్ళడానికి మెలికల మేడమెట్లు. హేలోజన్ లాంతర్ల పక్కని ఉన్న జాగాలో మూడు అంతస్తుల ఇత్తడి స్టేండ్‌లలో పూల మొక్కలు కిందికి వేలాడుతున్నాయి. మేడ మెట్ల వెనకాల ఒక బాత్రూం, సోఫాలు, టీపాయ్, వెలుగునిచ్చే లాంతర్లు ఉన్నభాగం ఏడెనిమిది అంగుళాల దిగువన ఉంది. పడికట్లు దాటుకుంటూ వెళ్తే మరొకగది. ఆ గదిలో సోఫాసెట్, టెలివిజన్, స్టీరియో అందంగా అమర్చబడి వున్నాయి. గదులకున్న కిటికీలకి, దుక్కపరదాలు బైటనుంచి వస్తున్న వెలుతురుని వడకడుతున్నాయి. మొదటి గదిని ఆనుకుని వంటగది, మేడ మీద మూడు పడకగదులు.

ఖరీదైన ఇల్లు, ఇంటిలో సరంజామా చూసి ఆశ్చర్యమేసింది జగన్నాథంకి. మెట్ల కిందున్న జాగాలో జోళ్లని వదిలి, సోఫా వేపు నడిచారు అందరూ.

"మిసెస్, మిస్టర్ రాఘవ, నరేంద్ర, పద్మ, నరేంద్ర నాన్నగారు జగన్నాథం" అంటూ సోఫాలో కూర్చున్న జంటని పరిచయం చేశాడు రవి.

ఒకరి నమస్కారాలు ఇంకొకరు అందుకున్నారు.

"ఇంకా ఎవరూ రాలేదా? ఖాళీగా ఉంది ఇల్లు?" అనడిగింది పద్మ.

"ఈవేళ రెండు కుటుంబాలనే ఆహ్వానించాం" అని సమాధానమిచ్చాడు రవి. వంటింటిలోంచి వేడినూనె, ఉల్లిపాయ పకోడీల వాసన ఇల్లంతా వ్యాపించింది.

"చల్లగా ఉంచడానికి గది తలుపులన్నీ మూసి ఉంచేయడంతో వాసన బైటికి పోదు'' అంటూ సంజాయిషీ ఇచ్చాడు రవి. రవి భార్య సుభద్ర వంటగదిలోంచి పకోడీలని తీసుకువచ్చి, తిరిగి వంటింటిలోనికి వెళ్ళింది.ఒక నిముషం గడిచాక ప్లేట్లు, నేప్‌కిన్, చెంచాలతో తిరిగి వచ్చి గాజు టీపాయ్ మీద నూనె మరకలు పడకుండా పెద్ద పోస్టర్లని కింద ఉంచి, తెచ్చిన పదార్థాలని సర్ది, పద్మ పక్కన చతికిలపడుతూ, "కాసేపు తలుపులు తెరవండి బాబూ'' అంది భర్తవేపు చూసి గునుస్తూ. రవి లేచి, పరదాలని పక్కకి తొలగించి, కిటికీ తలుపులు తెరిచాడు. పకోడీలు వేసుకోడానికి పేపర్ ప్లేట్లని అందరికీ అందిచ్చింది సుభద్ర.

"మా చిన్నప్పుడు విశాఖపట్నం

కురుపాం మార్కెట్ ఎదురుగా, రోడ్డుమీద, ప్రతిరోజూ సలసలా కాగే నూనెలో పకోడీలు వేయించి అమ్మేవాడు ఒకతను. భలేగుల్లగా ఉండేవి ఆ పకోడీలు. కురుపాం మార్కెట్ బస్‌స్టాప్ రాబోతోందని ఆ పకోడీల వాసన చెప్పకుండా చెప్పేది. వాసన రాగానే పుస్తకాలు పుచ్చుకుని దిగేవాళ్ళం. డబ్బులుంటే కొనుక్కునేవాళ్ళం. ఈ నూనె వాసన అలనాటి గుల్ల పకోడీలని జ్ఞాపకానికి తెచ్చాయి'' అంటూ ప్లేటులోనికి నాలుగు పకోడీలని వడ్డించుకుంది మిసెస్ రాఘవ.

ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు జగన్నాథం. అవును, ఆ పకోడీలు చాలా రుచిగా ఉండేవి అనుకుంటూ మెచ్చుకోలుగా మిసెస్ రాఘవ వేపు చూశాడు. సుమారు ఐదడుగుల నాలుగంగుళాల పొడవు, నూట ముప్ఫయ్ పౌన్ల బరువు, వ్యాయామంలేక కాబోలు భుజం, నడుములదగ్గర మెల్లిగా కొవ్వు చేరుకుంటున్న శరీరం, గుండ్రటి మొహం, తెలుపు ఛాయ, సన్నని కనుబొమ్మలు, సామాన్యమైన పొడవుగల ముక్కుకి బలమైన ముక్కుపుటాలు, రవ్వంత ఎత్తైన చెక్కిళ్ళు, నల్లని నలుపుకాని కనుగుడ్లు. కంటికింద చారికల్ని అంటుకున్న రిమ్ లేని కళ్ళజోడు, సన్నని పొడవాటి మెడలో ముత్యాలదండ, పలచబడిన జుత్తుని కప్పి ఉంచిన బన్. యవ్వనందశ వెళ్ళి చాలా కాలమైందని చెబుతూ పటుత్వం తగ్గిన శరీరపొంకం. దాదాపు ఏభై ఐదు-అరవై ఏళ్ళ వయస్సున్న మిసెస్ రాఘవని ప్రత్యేకంగా చూసేసరికి, "ఈమెని ఎక్కడో ఇదివరలో చూశాను'' అనుకున్నాడు జగన్నాథం.

గచ్చకాయ రంగుచీర, ఆ కట్టిన తీరు చూసి జగన్నాథం ఆనందపడ్డాడు.

"దుమ్మూ, ధూళీ పకోడీలు కొనుక్కొని తిన్నావా?" అన్న చీత్కారమో ఏమో కాని రాఘవ మొహంలో రంగులు మారాయి. కుంచించుకుపోయిన రాఘవమొహం చూసి ఇంకేదో చెప్పబోతున్న మిసెస్ రాఘవ తమాయించుకుంది.

"అలాంటివి జ్ఞాపకానికి తీసుకురాకు, నాకు ఒళ్ళు కంపరమెత్తుతుంది'' అన్నాడు రాఘవ.

జగన్నాథం దృష్టి రాఘవవేపు మళ్ళింది.

సగం బట్టతల, తెల్లని తెలుపు, నిశితంగా చూసేకళ్ళు. దాదాపు ఐదడుగుల తొమ్మిది అంగుళాల పొడవు, నూట డెబ్బై పౌన్ల బరువు. రాఘవని చూడగానే కొట్టొచ్చినట్లు కనిపించేది బొజ్జ. అయినప్పటికీ, ముప్ఫయ్ ఏళ్ళ క్రితం రాఘవ చాలా అందంగా ఉండి ఉండాలి అనుకున్నాడు జగన్నాథం.

రవి, "ఏం డ్రింక్ తీసుకుంటారు? స్కాచ్, బ్రాందీ, వైన్, బీర్, ఫ్రూట్ జ్యూస్?" అనడిగాడు అందర్నీ ఉద్దేశించి. రాఘవ, నరేంద్రలు బీర్‌ని, జగన్నాథం, మిసెస్ రాఘవలు ఆరెంజ్ జ్యూస్‌ని, పద్మ వైన్‌ని ఎన్నుకున్నారు. డ్రింక్‌లు తీసుకురావడానికి వంటింటిలోకి వెళ్ళాడు రవి. అందరూ కబుర్లలో పడుతుండగా రవి వచ్చి డ్రింక్‌లని అందరికీ అందిచ్చాడు.

రాఘవ, నరేంద్ర, రవి ఫుట్‌బాల్‌మీద చర్చిస్తూ డల్లాస్ కౌబాయ్స్ ఈమారు సూపర్ బాల్ గెలుస్తారంటే, కాదు గ్రీన్‌బేపేకర్స్ టీమ్ గెలుస్తుందని వాదించుకుంటుంటే ఆడవాళ్ళకి విసుగేసి రాబోయే దీపావళి ఫంక్షన్ ఎలా ఆర్గనైజ్ చేయాలో ఆలోచిస్తున్నారు. ఏం మాట్లాడాలో, ఎవరితో మాట్లాడాలో అర్థమవక పరాకులో తొందరగా ఆరెంజ్ జ్యూస్ తాగేస్తానేమోనని అతి జాగ్రత్తగా రవ్వంతే ఆరెంజ్ జ్యూస్‌ని చప్పరిస్తూ అందరివేపూ మార్చిమార్చి చూస్తున్నాడు జగన్నాథం.

అరగంట గడిచేసరికి ఆడవాళ్ళు వంటింటిలోకి నడిచారు.

"నరేంద్ర, రాఘవకి రియల్ ఎస్టేట్ బిజినెస్ ఉంది. తన ఆఫీస్‌లో ఉన్న పాత కంప్యూటర్లని మారుద్దామనుకుంటున్నారు. ఆయనకి నీ సలహా కావాలట" అన్నాడు రవి.

చర్చ ఫుట్‌బాల్‌మీదనుంచి కంప్యూటర్ల మీదకి మళ్ళింది. పదిహేను నిమిషాల తరువాత జగన్నాధంలేచి పెరటి తలుపు వేపు వెళ్ళడం, కంప్యూటర్లమీద చర్చ సాగిస్తున్న ముగ్గురూ గమనించలేదు.

ఎయిర్ కండిషన్డ్ గదిలోంచి తలుపు తెరిచి బైటికి రాగానే వేడిగాలి జగన్నాధం మొహాన్ని తాకింది. సూర్యుడు ఇంకా కృంగలేదు. ఇంటి వెనక ఉన్న అర ఎకరం జాగాలో ఏపిల్, కమలాలు, పియర్స్ పళ్లచెట్లతో పాటు; మల్లె, సన్నజాజి, గులాబీమొక్కలు ఉన్నాయి. పూలమొక్కలు పెద్దపెద్ద గోలాలలో పూలు విరగపూసి ఉన్నాయి. పళ్లచెట్లకింద రాలిపోయిన పది పన్నెండు పళ్ళు పడి ఉన్నాయి. పళ్లచెట్లు మహా అయితే పదడుగుల ఎత్తు ఉంటాయేమో! అంత విరగ కాయడం దగ్గరగా చూసి, చెట్లదగ్గరకి వెళ్ళి, చెట్లమీదున్న పళ్ళని, కాయలని ఆప్యాయంగా స్పృశిస్తూ పెరటిలో తిరగడం మొదలుపెట్టాడు జగన్నాధం.

"త్వరగా వచ్చేయ్, లేకపోతే డిన్నర్‌కి ఆలస్యమౌతుంది చంచలా'' అన్న హెచ్చరిక వినపడింది జగన్నాధంకి. వెనక్కి తిరిగి చూడడం సభ్యతకాదని పచార్లు కొనసాగించాడు. తలుపు తెరచుకుని మూసుకున్న రెండు నిమిషాలకి ఎండిపోయిన ఆకులమీద మెత్తని పాదాల సవ్వడి క్రమంగా పెరుగుతూ దగ్గరగా వచ్చాక ఆగింది. జగన్నాధం కుతూహలం ఆపుకోలేక వెనక్కి తిరిగాడు. ఎదురుగా మిసెస్ రాఘవ నిలుచుంది. ఆకాశంమీద పక్షుల గుంపు అరుచుకుంటూ వెళ్తుంటే, "ఈ దేశంలో పక్షులు కనిపించినట్లు మనదేశంలో నాకు కనిపించలేదు'' అన్నాడు జగన్నాధం కెనెడియన్..బాతులవేపు చూస్తూ.

"ఏమో మన దేశం వెళ్ళి ఎనిమిదేళ్లయింది. అతిగా జనాభా పెరుగుతుంటే ఏది దొరికితే దానిని చంపి తినేస్తున్నారు కాబోలు. ఇండియాలో జీవ్యావరణ దానిలో కష్టనష్టాలమీద టెలివిజన్‌లో ఒక డాక్యుమెంటరీ చూశాను. మనదేశం చాలా మారిందిట'' అంది మిసెస్ రాఘవ.

"మీరు ఈ దేశం వచ్చి ఎన్నాళ్ళయింది?'' అని ప్రశ్నించింది.

"దాదాపు ఐదేళ్ళు కావస్తోంది'' అని జవాబిచ్చాడు జగన్నాధం.

"మీ జీవితం దాదాపు అంతా అక్కడే గడిపారు. అదృష్టవంతులు. ఎక్కడ పనిచేసేవారు?''

"అది అదృష్టమని అందరూ అనుకోవడంలేదు. కావాలంటే మీరూ కొంతకాలం అక్కడ గడపవచ్చు మిసెస్ రాఘవా''

"నాపేరు చంచల. మిసెస్ రాఘవకంటే చంచల అని పిలిస్తేనే నాకు ఇష్టం. సిద్ధాంతరీత్యా మీరన్నది సంభవమే కాదనను. కానీ, జీవితంలో మనకిష్టమైనట్లు చాలా పనులు చేయలేం'' అంది చంచల.

చంచలవేపు పరీక్షగా చూశాడు జగన్నాధం. చాలాకాలం క్రితం మసకబారిన పాత జ్ఞాపకాలలోంచి పోలికల్ని కళ్ళు వెతుకుతున్నాయి. గచ్చకాయరంగు కనుపాపలైతే కనిపిస్తున్నాయి కానీ పొంగిన ఆమె కిందరెప్పల్ని ఆనుకుని ఉన్న ఈనాటి చారికలు అలనాడు లేవు. నారి సంధించిన విల్లులా ఉన్న అప్పటి శరీరానికి, మాంసం చేరుకుని తవతవలాడుతున్న ఈ శరీరానికి ఏదీ సాపత్యం? తరచూ గోళ్ళకి రంగువేసుకుని, తడి ఆరడానికి నోటితో ఊదుతూ ఆరాధనాపూర్వకంగా చూసుకునే ఆ చేతివేళ్ళు ఏమయ్యాయి? సూర్యుడునుంచి మొహాలమీద ఎండ వాలకుండా గొడుగుపట్టే నల్లగా, ఒత్తుగా ఉండే జుత్తు ఏమైంది? అన్నిటికన్నా అణువణువూ మూర్తీభవించిన అలనాటి ధైర్యం ఏదీ? జగన్నాధం మనస్సు ఒక్కసారి మూలిగింది. ఆలోచనల్లోంచి తెప్పరిల్లి "విజయనగరంలో చాలాకాలం పనిచేసి రిటైరయేక ఇక్కడకి వచ్చాను. నా చదువంతా విశాఖపట్నంలోనే జరిగింది'' అన్నాడు. చంచల కళ్లల్లో ఒక్కసారి వెలుగు వచ్చింది.

"విశాఖపట్నంలో మీరు ఎక్కడ ఉండేవారు?" అనడిగింది.

"నాలుగేళ్ళు చిన్నమ్మవారి వీధిలో, పసుపుపచ్చ ఎత్తరుగుల ఇంటిలో అద్దెకి ఉండేవాళ్ళం" అన్నాడు జగన్నాధం.

బలంగా ఊపిరితీసి, గాలిని వదిలింది చంచల. ఊపిరితిత్తులలో ప్రవేశించిన గాలివలన, రవ్వంత బిగువుని ప్రదర్శిస్తూ, చంచల ఉపరిభాగం కదిలింది. వెనక్కితిరిగి ఇంటి వేపు చూస్తూ, "నలభై ఏళ్ళ తరువాత నిన్ను పోల్చలేదు జగన్నాధం", అంది.

"నాకూ, నిన్ను చూస్తే గతంలో ఇది పరిచయమున్న మొహం అన్న అనుమానం వచ్చింది. కాని ఎక్కడో జ్ఞాపకానికి రాలేదు. నీ పేరు చంచల అని ఇందాక వినిపించాక గతం జ్ఞాపకానికి వచ్చింది. నలభై ఏళ్ళలో మనుష్యులలో మార్పు అనూహ్యం. మీ అమ్మగారు ఎలా ఉన్నారు?" అనడిగాడు జగన్నాధం.

పేలవంగా నవ్వి, కాస్సేపు మొహం రెండవవేపు తిప్పుకుంది చంచల.

జగన్నాధం ఏమీ మాట్లాడలేదు.

చంచల మొహాన్ని జగన్నాధం వేపు తిప్పి, "ఆమె చనిపోయినప్పుడు చూడడానికి కూడా వీలుపడలేదు'' అంది చంచల. కనుకొలకులలోంచి ఒకనీటి బొట్టు కిందకి దిగనా? వద్దా? అన్న మీమాంసలో ఉంది. కంటిలో నీళ్లు తిరిగిన చంచలని చూస్తే జగన్నాధంకి విచారమేసింది. ఎలాంటి ఉపశమన వాక్యాలు చెప్పాలా? అని ఆలోచిస్తుంటే,

"రాఘవకి గతం అంటే అసహ్యం, దానికి కారణం అతని బాల్యం. ప్రతీదానికీ ఇబ్బందిపడుతూ స్కాలర్‌షిప్‌మీద ఈ దేశంవచ్చి ఎమ్.బి.ఏ. డిగ్రీ పుచ్చుకున్నాడు. అమెరికాలో ఉన్న ఈ పాతికేళ్ళలో పెళ్ళికి, అతని తల్లి చనిపోయినపుడు రెండే రెండుసార్లు ఇండియా వెళ్ళాడు. ఇండియాలో స్వంత ఊరికి వెళ్తేఅతని చిన్ననాటి లేమి జ్ఞాపకానికి వస్తుందిట. డబ్బుకి ఇబ్బందిపడుతూ గడిచిన బాల్యమన్నా, దానికి సంబంధించిన ఏ విషయమైనా రాఘవకి తెగకోపం వచ్చి జీవితంలో తనకి తీరని అన్యాయం జరిగిందని మండిపడతాడు. అయితే తనకంటే తెలివైన వ్యక్తులు అవకాశంరాక ఇంకా అక్కడే ఆక్రోశిస్తున్నారని, దానిలోంచి బైటపడి అవకాశం లభించిన అతను చాలా అదృష్టవంతుడని నే వాదిస్తే ఒకసారి రుద్రుడయ్యాడు. అహం మనిషిని ఎంతటి నీచానికైనా దిగజారుస్తుంది. ఆ సంఘటన తరువాత అతనితో వాదానికి దిగకుండా జాగ్రత్తపడ్డాను'' అంటూ రాఘవ వింతధోరణికి కారణం వివరించింది చంచల.

"రాఘవ కంపెనీలో ఎంతమంది పనిచేస్తున్నారు? బాగా నడుస్తోందా?"

"ఆ కంపెనీలో ఇరవైమంది ఉన్నారు. గతంలో రాఘవ రకరకాల వ్యాపారాలు నడిపాడు''

"మరి నీ సంగతేమిటి?" అనడిగాడు జగన్నాధం. చంచల దానికి సమాధానమిచ్చేలోగా, సుభద్ర పెరటి తలుపు తెరచి, "డిన్నర్ పదార్థాలన్నీ టేబిల్ మీద అమర్చేను. అందరూ మీ గురించి నిరీక్షిస్తున్నారు'' అని పిలిచింది.

చంచల ముందు, వెనకాల జగన్నాధం ఇంటిలోకి ప్రవేశించారు.

రాత్రి పదిగంటలకి పార్టీ ముగిసింది. డిన్నర్‌కి వచ్చిన రెండు కుటుంబాలని సాగనంపడానికి రవి, సుభద్ర బైటికి వచ్చారు.

మోతాదుకి మించి బీరు తాగాడని, అలాంటిదశలో కారు నడపడం చట్టవిరుద్ధమని, ప్రమాదకరమని, చంచల కారు తాళాలు రాఘవనుంచి తీసుకోబోతుంటే, "ఏమీ పరవాలేదు, వెధవ బీరుకే ఇంత రాద్ధాంతం చేస్తున్నావేంటి?" అని తొట్రుపడుతున్న మాటలతో, చంచలని డ్రైవర్ జాగాలోంచి కదలమంటున్నాడు రాఘవ. చంచల చలించలేదు. ఇంక గత్యంతరంలేక, కారు రెండోవైపు

తలుపు తెరచి సీట్లో కూర్చోగానే కారు ముందుకు సాగింది.

నరేంద్ర, జగన్నాథం, పద్మ, రవి, సుభద్ర లకి కృతజ్ఞతలు చెప్పి తమ వేన్ వేపు కదిలారు. తెరచి ఉంచిన కిటికీలలోంచి చల్లని గాలి లోపలికి చొచ్చుకు వస్తుంటే, కారు వేగం పెంచి, హైవే చేరుకోగానే రిమోట్‌తో కారు కిటికీలని మూశాడు నరేంద్ర. హైవేమీద ఒక దిశ ప్రయాణానికి మూడు లేన్లు, రెండోదిశ ప్రయాణానికి మూడు లేన్లలో కార్లు అరవై ఐదు, డెబ్బయ్ మైళ్ళ వేగంతో రయిమని పరిగెడుతున్నాయి.

రాత్రి పదిన్నర గంటలకి, కారుకీ కారుకీ మధ్య ఇరవై-ముప్ఫయి అడుగుల ఖాళీతో మూడు లేన్లు కిక్కిరిసి వందలమంది ఎందుకు ప్రయాణం చేస్తున్నారో! అని ఆశ్చర్యపడ్డాడు జగన్నాథం. కొందరు తమలాగే పార్టీలకి వెళ్ళి తిరిగి వస్తున్నారని సరిపెట్టుకున్నా, తతిమ్మా వాళ్ళ మాటేమిటి? మిగిలిన వాళ్ళల్లో, తప్పక, రాత్రి ప్రయాణం చేస్తున్నవాళ్ళు ఎంతమంది? కారు నడపడం వచ్చిన చంచల పక్కన ఉంది కాబట్టి రాఘవ మత్తులో ఉండడం చూసి అతనిని కారు నడపనీయలేదు. కాని రాఘవ ఒక్కడే పార్టీకి వచ్చి ఉంటే మత్తులోనే కారు నడిపేవాడు. రోడ్లు ఎంతో విశాలంగా ఉన్నా కారు నడిపేవాళ్ళు నియమాలు పాటించినా, తాగుడుమైకంలో మెదడు స్వాధీనంలో లేకపోతే ఇతరులకి ప్రమాదం. ప్రాణహాని సంభవించవచ్చు. మద్యం లేదా ఇతర మత్తుపదార్థాల వాడకంవలనే జరిగిందని అంకెలు చెబుతున్నాయి. అమెరికన్లు సురాపానాన్ని తప్పుగా భావించరు. మొదట్లో నరేంద్ర, పద్మలు మద్యం సేవించినప్పుడు తనకి కనబడకుండా జాగ్రత్తపడేవారు. కాని ఒకసారి యాదృచ్ఛికంగా అది తనకంటపడి బట్టబయలైనాక తన ఉనికిని పట్టించుకోవడం మానివేశారు. నరేంద్ర, పద్మలు ఇండియాలో నివసిస్తుంటే మద్యం పుచ్చుకునేవారు కాదేమో!

ఈదేశం తరలివచ్చిన వాళ్ళనడవడి ఇంకోలా ఉంది. దీనికి కారణం చుట్టూ ఉన్న సమాజమా? మనదేశంలో మద్యం తాగడం తప్పన్న సిద్ధాంతంలో లోపం ఉందా? అక్కడ తప్పయినది ఈ దేశంలో సరి అయినది ఎలా అవుతుంది? తాగడం తప్పని మనదేశంలో ప్రబలి ఉన్న వాదం సరి అయినది అనుకుంటే పురాణాలలో దేవతలు, అమరులు సురాపానం చేస్తున్నారని రాసినదానిని ఎందుకు ఖండించలేదు? ఈ మంచీ, చెడూ నిర్ణయాలు ఎవరు చేస్తారు? వాటికి ఆధారం పురాణాలా? శాస్త్రమా?

నిన్నటితరానికి చెందిన తను, పాత సంప్రదాయాలని అంటి పెట్టుకున్న తను, మారుతున్న సమాజంలో ఇమడలేక సతమతమవుతూ, నీతులు వల్లెవేస్తూ ఇతరులలో తప్పులని వెతుకుతున్నాడా? అని జగన్నాథం మథనపడుతుంటే "రాఘవ ఇల్లు ఇక్కడికి ఎంతదూరంలో ఉంది'' అనడిగింది పద్మ.

"ఎనభై మైళ్ళు''

"అయితే మీరు ఈ శనివారం రాఘవ ఆఫీస్ చూడడానికెళ్తున్నారా? ఊరికే పనిచేయించుకుంటాడేమో'' అని పద్మ అనుమానపడింది.

"ఊరికే ఎందుకు పనిచేస్తాను? అతను మనకి ఇల్లుకొనడంలో సహాయపడతానన్నాడు'' అంటూ పద్మని శాంతపరిచాడు నరేంద్ర.

ఇప్పుడు నివశిస్తున్న ఇల్లు అమ్మి కొత్త ఇల్లు కొనడానికి నరేంద్ర, పద్మలు నిశ్చయించుకున్నారని జగన్నాథంకి అవగాహన అయింది.

"దానికీ దీనికీ లంకె పెట్టకండి. ముందు మీ చేత పని చేయించుకున్నాక తరువాత మొండి చెయ్యి చూపిస్తాడు జాగ్రత్త. వాళ్ళే మీ డబ్బు లేని వాళ్ళు కారు. ఆమె డాక్టరు, రాఘవ రియల్ ఎస్టేట్ బిజినెస్ నడుపుతున్నాడు''

తల ఊపాడు నరేంద్ర. జగన్నాథం ఆలోచనలో పడబోతుంటే,

"ఆమెతో జాగ్రత్తగా మసలండి. సుభద్ర ఆమెగురించి ఏవో చెప్పింది'' అందిపద్మ.

జగన్నాథం మనస్సు బాధతో మూలిగింది.

మనుష్యులని మనుష్యులు నమ్మకపోవడం ఇండియాలో చాలాసార్లు చూశాడు తను. అక్కడ నెలకొన్న వాతావరణం అలాంటిది. కానీ ఈ దేశంలో చిన్నచిన్న వాటిలో చాలా నిజాయితీ తనకి కనిపించింది. నరేంద్ర, పద్మల ఆలోచన ఇండియాలో, చాలసార్లు మోసపోయిన అనుభవం ఉన్న వ్యక్తుల ఆలోచనలా ఉంది. ఏమీ తెలియని రాఘవ, చంచలమీద దురభిప్రాయానికి కారణమేమిటి? స్వతహాగా ఎదుట వ్యక్తిని నమ్మడానికి ఇష్టపడని మన దేశపు నైజమా? లేక రాఘవ, చంచలల చరిత్ర మంచిది కాదా? అయినా నరేంద్ర కంటే దాదాపు ఇరవై ఏళ్ళు పెద్దదయిన చంచలనుంచి ఏం భయం? చంచలతో తన ఆఖరి సంభాషణ తరువాత, తనతో ఆమె ఉత్తర ప్రత్యుత్తరాలు చేస్తుందని తను ఆశించలేదు. విశాఖపట్నం వదిలివెళ్లిన చంచల గురించి వార్తలేమీ తెలియకుండానే రోజులు దొర్లాయి. తను బయటపడినట్లే చంచల ఒక్కసారి మటుమాయమైంది. సంవత్సరాలు కాలగర్భంలో కలిశాక, మళ్ళీ చంచల పునర్దర్శనం తనకి ఆనందాన్ని, విచారాన్ని కలుగచేసింది అనుకుంటుంటే, నరేంద్ర వేన్ని డ్రైవ్‌వేలో నిలిపాడు.

పద్మ దిగి, ఇంటి తలుపు తీయగా జగన్నాథం, నరేంద్ర ఆమెని అనుసరించారు.

★ ★ ★

నరేంద్ర, పద్మ, పిల్లలు బాస్కెట్‌బాల్ మేచ్ చూడడానికి వెళ్ళడంతో జగన్నాథం శూన్యంలోకి చూస్తూ ఆలోచనలో పడ్డాడు. రామస్వామి అమెరికా వచ్చి రెండు నెలలైనా అతనితో సరిగ్గా మాటలాడడానికి వీలవలేదు. అక్కడ రామస్వామికి, ఇక్కడ తనకి స్వతంత్రం లేని మాట నిజం. నరేంద్ర, పద్మలు తనని టెలిఫోన్ ఉపయోగించవద్దని ఎప్పుడూ చెప్పకపోయినా ఆ ఊహ వాళ్లకి ఈషణ్మాత్రమైనా లేకపోయినా, రామస్వామికి ఫోన్ చేయాలంటే తనకి ఏదో చెప్పలేని సంకోచం, ఒకరకమైన గిల్టీఫీలింగ్. తను అమెరికా వలస వచ్చి స్థిరపడడంవలన, విమానఖర్చు, హెల్త్ ఇన్సూరెన్స్, చలికాలంకి అవసరమయే ఉన్నిబట్టలు, తిండికయే ఖర్చులు ఉండనే ఉన్నాయి. వాటికితోడు టెలిఫోన్ బిల్ పెంచడమా? అని తను వెనుదీస్తాడు. రామస్వామికి ఫోన్ చేయడానికి మొహమాటపడతాడు. చిన్నప్పుడు తల్లిదండ్రుల దగ్గర పిల్లల ఖర్చులు ఎలాగో, అలాగే తల్లిదండ్రులు పెద్దవాళ్ళయాక, పిల్లల దగ్గర తల్లిదండ్రుల ఖర్చు సహజం అని సరిపెట్టుకుందామన్నా, ఆ వివరణ మింగుడుపడడంలేదు. ఆ గిల్టీ ఫీలింగ్ పోగొట్టుకోవడానికి ఉద్యోగం చేసి డబ్బు ఆర్జిద్దామన్నా అరవై ఏళ్ళు పైబడ్డ తనకి ఎలాంటి ఉద్యోగం దొరుకుతుంది? అథవా దొరికినా అది ఎక్కడ దొరుకుతుందో? తను అమెరికా వచ్చిన మొదట్లో నరేంద్ర, పద్మల మధ్య జరిగిన చర్చ జగన్నాథం మదిలో మెదిలింది.

"గౌరీపతిగారు కేమార్ట్ కంపెనీలో పనిచేస్తున్నారుట" అంది పద్మ.

"డిప్యూటీ కలెక్టర్‌గా పనిచేసి ఉద్యోగంలోంచి రిటైరయిన మనిషికి, కేమార్ట్ కంపెనీలో ఉద్యోగం ఆయన హోదాకి రవ్వంత తక్కువేమో'' అన్నాడు నరేంద్ర.

"వాట్ నాన్సెన్స్! ఈ దేశంలో ఏ ఉద్యోగమైనా ఒకేలాంటిదంటారు. డిగ్నిటీ ఆఫ్ లేబర్. నాకైతే దానిలో ఏమీ తీసిపారేయడానికి కనిపించడంలేదు. మీకు తెలియదేమో గౌరీపతిగారి భార్య కూడా అక్కడే షెల్ఫ్‌లు సర్దడానికి పనిచేస్తోంది. వాళ్ళు ఉంటున్న కౌంటీలో ఉద్యోగానికి వెళ్ళడానికి ఫ్రీ బస్ పాస్ ఇస్తారుట. లంచ్ పట్టికెళ్ళి అక్కడ తిని, సాయంకాలం వస్తున్నారుట" అంది పద్మ.

"డిగ్నిటీ ఆఫ్ లేబర్ సంగతి సరే, బస్‌లో వెళ్ళడానికి ఫ్రీపాస్ ఎందుకు ఇస్తున్నార బ్బా?" అని ఆశ్చర్యపడ్డాడు నరేంద్ర.

"ఆ సదుపాయం నర్సింగ్‌హోమ్‌లలో ఉన్న సీనియర్ సిటిజన్స్ కోసం నిర్దేశించబ డినది కాబోలు. అరవై రెండేళ్ళు దాటినవా ళ్ళు ఇతరులమీద ఆధారపడకుండా తమంతట తామే షాపింగ్ చేసుకోవడాని కిట. గౌరీపతిగారు, ఆమె ఆ సౌకర్యాన్ని వాడుకుంటున్నారు'' అని వివరించింది పద్మ.

"గౌరీపతిగారు, గౌరీపతిగారి సతీమణి ఎందుకు ఉద్యోగాలకి వెళ్తున్నారు? ఆ ఉద్యో గాలు ఇంటరెస్టింగ్‌గా ఉన్నాయనా? లేక ఇంటిలో కూర్చుని కూర్చుని బోరెత్తిపోయి బైటికి తిరగాలనా? ఈ రెండూ కాక డబ్బు ఆర్జనకా? ఏమిటి కారణం?"

"మీరు ఇలా జీళ్ళపాకంలా ప్రతీదానినీ సాగతీస్తారు. ఈదేశం పురోగమించడానికి ముఖ్యకారణమేంటి? ఎవ్వరూ ఖాళీగా కూర్చోరు. ఏదో ఒక పని చేస్తుంటారు. మనదేశ ప్రజలని చూడండి. రిటైరవడమే మిటి? గుళ్ళూ గోపురాల చుట్టూ ప్రదక్షిణలు చేస్తారు. దొరికితే రుద్రాక్షమాలలు, తుల సిదండలు తిప్పేస్తుంటారు. పనిచేసేవాళ్ళు తక్కువ, ఊరికే కూర్చుని తినేవాళ్ళు ఎక్కువ. అందుకే ఆ దేశం అలా ఉంది, ఈదేశం ఇలా ఉంది'' అంటూ తన సోషియా లజీ జ్ఞానాన్ని ప్రదర్శించబోయింది పద్మ.

"ఆ దేశంలో ఉద్యోగాలు చేయడానికి తయారుగా ఉన్నవాళ్ళు కోట్లకి కోట్లు ఉన్నా రు. ఏ ఉద్యోగమైనా ఫరవాలేదని ముందుకు దుమకడానికి సిద్ధంగా ఉన్న వ్యక్తులకే ఉద్యో గాలు లేక కొట్టుకు ఛస్తుంటే ఇక రిటైరయిన వాళ్ళకి ఉద్యోగాలు ఎక్కడ లభిస్తాయి? పర పతి ఉన్నవాళ్లని వదిలేస్తే, ఇతరులని చూసే నాథుడేలేడు. అదొకటేకాదు ఈ దేశంలో నివశిస్తున్న అరవై ఏళ్ళ వ్యక్తి దేహదారుఢ్యా నికి, ఇండియాలో పెరిగి, అక్కడే జీవితం గడిపిన అరవై ఏళ్ళవ్యక్తి దేహదారుఢ్యానికి చాలా వ్యత్యాసముంది. రెండుదేశాలలో వ్యక్తులనీ పోల్చడంలో ఔచిత్యంలేదు. నీతో ఇంకా వాదించేవాడినే కాని రాజుని టెన్నిస్ నుంచి తీసుకురావాలి, టైమయింది'' అంటూ వాచీవైపు చూస్తూ నరేంద్ర లేచివెళ్ళా డు.

తన వాదనని కొట్టిపారేసి తిరగబడడానికి వీలులేకుండా తనని అర్ధాంతరంగా వదిలివె ళ్లిన నరేంద్ర వేపు గుర్రుగా చూస్తూ వంటింటి లోకి వెళ్ళింది పద్మ.

ఒంటరిగా మిగిలిన తనని నరేంద్ర, గౌరీ పతిగారి గురించి రేకెత్తించిన ప్రశ్నలు ఆలో చింపచేశాయి.

హైస్కూల్ పూర్తిచేసి, కాలేజీ డిగ్రీలేని వాళ్ళుచేసే గంటకి ఆరుడాలర్ల ఉద్యోగానికి పోస్ట్ గ్రేడ్యుయేట్ డిగ్రీ ఉందని దరఖాస్తు ఫారంలో రాస్తే అవసరమైన అర్హతలుకన్నా, చాలా అధిక అర్హతలున్న గౌరీపతిగారికి ఆ ఉద్యోగం ఇవ్వరు. బహుశా ఆయన అప్లికేష న్‌లో సగం నిజం రాసి ఉండాలి. గౌరీపతి గారి సతీమణి అర్హతల గురించి, డిగ్రీలగు రించి తనకి తెలియదు. కొనుగోలుదార్లు పేకెట్లని అస్తవ్యస్తంచేస్తే వాటిని షెల్ఫ్‌ల మీద పాతస్థానంలో అమర్చే పనికి దాదాపు గంటకి ఐదున్నర డాలర్లు ఇస్తారు.

"దాంట్లో తప్పేముంది?" అని గదమా యించింది పద్మ. నిజమే దానిలో ఏమీ తప్పులేదు. అయితే, ప్యాంటు, చొక్కాలు వేసుకునే పురుషుడు చీరకట్టుకున్నట్లు, గౌరీ పతిగారు నడిపిన జీవితానికి, ఈ కిమార్ట్ ఉద్యోగానికి మధ్య చాలా వైవిధ్యం ఉంది. అంతే., తను అమెరికా వచ్చిన కొత్తలో, స్కూళ్లలో ఉద్యోగానికి దరఖాస్తులు పంపితే, అమెరికన్ డిగ్రీలులేని, అరవై ఏళ్ళు పైబడు తున్న తనకు ఎవ్వరూ ఉద్యోగం ఇవ్వలేదు. తను, ఇతర చిల్లరపనులు చేయడానికి తయా రవకుండా, "నాన్నా, టీచింగ్ ఉద్యోగం వస్తే చేయండి, ఇంకేమీవద్దు'' అంటూ ముందరే నరేంద్ర హెచ్చరించడంతో ఇతర ఉద్యోగాల

జోలికి తను పోలేదు.

"డిగ్నిటీ ఆఫ్ లేబర్' అంది పద్మ. "ఏ ఉద్యోగమైనా ఒకలాంటిదే'' అన్న పద్మ కొన్నాళ్ళక్రితం తన అన్నయ్య కూతురిపెళ్లి చెప్పుల దుకాణం మేనేజర్‌కి ఇచ్చి చేస్తున్నారని ఏవో సాకులు కల్పించుకుని పెళ్ళికి వెళ్ళడం ఎగ్గొట్టింది.

"అబ్బ! లండన్ ఎయిర్‌పోర్ట్‌లో మనదేశంవారు పాకీదొడ్లు, బాత్‌రూమ్‌లు శుభ్రంచేస్తుంటే చూసి బిక్క చచ్చిపోయాను. ఎంత సిగ్గువేసిందో' అన్న పద్మ "డిగ్నిటీ ఆఫ్ లేబర్' అంటోంది.

"డిగ్నిటీ ఆఫ్ లేబర్' దేశం దేశం బట్టి మారుతుందా? లేక తమ వాదనలో బలం పెంచడానికి అనుకూలమైనప్పుడు, నేతిబీరకాయలో నెయ్యిలా బైటికి ఆదర్శాలని వల్లెవేస్తారా? ముఖ్యంగా ఇలాంటి చిలకపలుకులు ఇతరుల విషయంలో వర్తిస్తాయి కాబోలు అనుకున్నాడు తను.

మనిషికీ మనిషికీ ఇష్టాయిష్టాలలో, నమ్మకాలలో తేడాలు ఉండడం సహజం. ఒక వ్యక్తి తన నమ్మకాలు ఉత్కృష్టమైనవి అనుకోవడంలో తప్పులేదు. బైటికి ప్రదర్శించినపుడూ ఇబ్బందిలేదు. కాని దానికి విరుద్ధంగా ఉన్న వ్యక్తి నమ్మకాలు అధమమైనవని ఆ వ్యక్తి ఎదుట బాహాటంగా వ్యక్తపరచి ఆ వ్యక్తిని బాధించినపుడే వస్తుంది చిక్కు అనుకున్నాడు జగన్నాథం.

★ ★ ★

పెద్ద అరుపులతో టెలివిజన్ ప్రోగ్రాం నడుస్తోంది. చాలా ప్రోగ్రాంలలో కొన్ని సన్నివేశాలు ఒకేమూసలో ఉన్నట్లు కనిపిస్తాయి. సాయంకాలం అలసిపోయి ఉస్సురంటూ ఇంటికి చేరిన భర్త లోపలికి రాగానే, "హనీ, నేను ఇంటికి వచ్చాను'' అంటాడు కోటు ఉడదీసి సోఫాలో పడేస్తూ. వంటింట్లోంచి భార్య నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ భర్తని సమీపించి పెదాలమీద ముద్దుపెట్టుకుంటూ, "హౌ వజ్ యువర్ డే?" అని ప్రశ్నిస్తుంది. భర్త మరీ అలసట ప్రదర్శించకుండా ఉంటే, 'మ్చ్', 'మ్చ్' అంటూ ముద్దుల సంఖ్య పెరుగుతుంది. ఇంటిలో ఇంకెవరూ లేకపోతే భర్తని అదుముకున్న భార్య, అరక్షణం ముద్దులని ఆపి, భర్త చొక్కా గుండీలు, పై ఉడదీస్తుంది. ఉద్వేగం పెరిగిన భర్త భార్య జాకెట్ గుండీలు ఊడతీయడమో లేదా వీపు వెనకాలకి చేతులు చాచి జిప్పర్‌ని విప్పడం మొదలుపెడతాడు. ముద్దులవేగం, మనుష్యులలో ఆరాటం పెరుగుతుంటే గబగబా పరుపుమీదకో లేక పక్కనే ఉన్న సోఫామీదకో ఇద్దరూ ఒరగడం, తరువాత శారీరక కంపనం కనిపిస్తుంది. అమెరికా వచ్చిన కొత్తలో ఇలాంటి సన్నివేశాలు జగన్నాథంకి తెగ ఇబ్బంది కలిగించేవి. కాని కాలంతోపాటు అవి అలవాటయి జుగుప్సాకరంగా అనిపించడంలేదు. సాయంకాలం ఏడున్నర ఎనిమిది గంటలకే ఇలాంటి ప్రోగ్రాంలు చూపిస్తుంటే పదహారు, పదిహేడేళ్ళ పిల్లలు లీనమై వాటిని చూస్తుంటే, జగన్నాథం ఇబ్బంది ఫీలయి అక్కడనుంచి లేచి వెళ్ళేవాడు. ఇంచుమించు రాసక్రీడలు చూపిస్తున్న టెలివిజన్ ప్రోగ్రాంలో అందరూ నిమగ్నులై ఉండగా టెలిఫోన్ మోగింది. దాని దగ్గరగా ఉన్న నరేంద్ర ఫోన్ ఎత్తి 'హలో' అన్నాడు. అవతల వ్యక్తి చెప్పినది విని, 'ఉన్నారు' అంటూ,

"నాన్నా, మీకు ఫోన్' అంటూ నరేంద్ర జగన్నాథంకి ఫోన్ అందివ్వబోయాడు.

"నాకు ఎవరు ఫోన్ చేస్తార్రా?" అంటూ ఫోన్ అందుకున్నాడు జగన్నాథం.

"నేను జగన్నాథంని'' అంటూ సంభాషణని మొదలుపెట్టాడు జగన్నాథం.

"నాపేరు సాయి. పన్నెండేళ్ళక్రితం విజయనగరంలో నేను మీ విద్యార్థిని'' అన్నాడు ఫోన్‌లో వ్యక్తి.

"నన్ను క్షమించాలి. వయస్సు మీదపడుతుంటే నాకు జ్ఞాపకశక్తి తగ్గుతోంది. చటుక్కున నాకు మీరు జ్ఞాపకానికి రావడంలేదు'' అన్నాడు జగన్నాథం.

"నేనేమీ క్లాసులో మొదటి రేంక్ విద్యార్థిని కాను జ్ఞాపకం రావడానికి. ఆఖరివరుసలో కూర్చునేవాడిని. మీరు సభ్యతగా జ్ఞాపకశక్తి తగ్గుతోంది అన్నారు. దానికేం ఫరవాలేదు. గత రెండేళ్ళలో చాలాసార్లు మీ గురించి వాకబు చేశాను. కానీ మీ టెలిఫోన్ నెంబర్ , ఎడ్రస్ దొరకలేదు. ఈమధ్య మనదేశం వెళ్ళినప్పుడు హైదరాబాద్‌లో లెక్కల మాస్టారు నారాయణరావుగారు కనిపిస్తే ఆయనని అడిగి మీ టెలిఫోన్ నెంబరు తీసుకున్నాను. ఎలా ఉన్నారు మాష్టారు?" అనడిగాడు.

పనికట్టుకుని తన ఉనికి గురించి వెతికే ఒకవ్యక్తి ఉన్నాడా? అని జగన్నాధం ఆశ్చర్య పడ్డాడు. ఆనందంతో ఒళ్ళు పులకరించింది. ఈ సాయి తన గురించి అంతగా వెతకడానికి కారణమేమిటి? తననుంచి ఏం ఆశిస్తున్నాడు? తన దగ్గర ఏమీలేదు అతనికి ఇవ్వడానికి. ఉద్యోగ ప్రయత్నంలో నన్ను కలిసి, ఆ పరిచయాన్ని పురస్కరించుకుని నరేంద్ర సహాయం కోరతాడేమో? లేకపోతే కొన్నాళ్ళు ఇక్కడ ఉండడానికి ఆశ్రయమడుగుతాడేమో? అడిగితే తను ఆ సహాయం చేయలేనని ఎలా చెప్పడం? అంటూ జగన్నాధంకి కోటి అనుమానాలు మొలుచుకువచ్చాయి. ఆ ఆలోచనలలో కొట్టుకుంటుంటే,

"నేను మీ ఇంటికి ఇరవై ఐదు మైళ్ళ దూరంలో ఉన్నాను. ఉద్యోగరీత్యా ఇంకో వారం రోజులు ఈ హోటల్లో ఉంటాను. రేపు సాయంకాలం ఆరుగంటల తరువాత నాకు ఖాళీ. మీ ఇంటికి వచ్చి మిమ్మల్ని కలుస్తాను. మీకేమైనా ఇతర కార్యక్రమం ఉంటే మరోరోజు కలవడానికి ప్రయత్నిస్తాను'' అన్నాడు సాయి.

'హమ్మయ్య! ఇతనికి తన సహాయం ఏమీ అవసరంలేదు. తను అనవసరంగా గాభరాపడ్డాడు'' అనుకుంటూ తెప్పరిల్లి,

"తప్పకుండా రా, మా ఇంటికి ఎలా రావాలో మా అబ్బాయి చెపుతాడు'' అంటూ నరేంద్రకి ఫోన్ అందిచ్చాడు జగన్నాధం.

"ఉత్తరానికి వెళ్ళే హైవే ముప్పయి తీసుకుని, పడమటికి వెళ్ళే హైవే నలభై రెండుకి మారండి. దానిమీద నాలుగు, ఐదు మైళ్ళ ప్రయాణం చేశాక, రాసన్ ఎవెన్యూకి మళ్ళండి.నాలుగు ట్రాఫిక్ లైట్లు దాటాక వచ్చే వుడ్ రోడ్ కనిపిస్తుంది. కుడివైపు మళ్ళితే ఎడమవేపు మూడోఇల్లు'' అని ఎలా రావాలో వివరించి ఫోన్‌ని కింద ఉంచాడు నరేంద్ర.

నరేంద్ర సాయికి ఏఏ హైవేలు తీసుకుని రావాలో చెబుతుంటే జగన్నాధంకి ఇండియా గుర్తుకువచ్చింది. ఇండియాలో అయితే, "అమ్మకోనేరు ఉత్తరగట్టంబట వెళ్తూ అక్కడ రాజుల వీధి ఎక్కడ? అని ఎవర్ని అడిగినా చెబుతారు'' అంటూ కొండగుర్తులు చెప్పడానికి, ఇక్కడికీ ఎంత తేడా! అమెరికాలో వీధులకి పేర్లు, వరుసవారిగా ఇళ్ళకు నెంబర్లు స్పష్టంగా కనిపిస్తాయి. రోడ్లమీద ప్రయాణం చేస్తుంటే రాబోయే వీధిపేరు ముందస్తుగా తెలుస్తుంది. ఎంత చిన్న ఊరయినా ఆ ఊరికి ఒక మేప్ ఉంటుంది. ఇంకొకర్ని అడగకుండా మనంతట మనమే ఎడ్రస్ బట్టి ఇల్లు కనుక్కోవచ్చు. మనదేశంలో రోడ్లపేర్లు స్పష్టంగా కనపడవు. రాత్రుళ్ళు వీధిలాంతర్లు పనిచేయవు. ఎవరో ధనవంతుడు గొప్పకోసం ఎలక్ట్రిసిటీ పనివాళ్ళకి లంచం ఇచ్చి తన ఇంటిదగ్గర ఉన్న వీధి లాంతరుకి బల్బ్ పెట్టించినా సాయంకాలమయ్యేసరికి లాంతర్లని రాళ్ళు రువ్వి బద్దలుకొట్టి, వీధులని చీకటిగానే ఉంచుతారు. చీకటిగా ఉంచకపోతే రోడ్డుపక్కన ఉన్న కుళ్ళు కాలవని మరుగుదొడ్లుగా ఉపయోగించే స్త్రీలకి ముఖ్యంగా ఇబ్బంది.

పీత కష్టం పీతది! అన్నారు వెనకటికెవరో, అలా అని ఊరుకోకుండా ఐదువేల ఏళ్ళ నాగరికత, మన్ను, మశానం అంటూ ప్రగల్భాలు పలుకుతాం. స్త్రీలు వాడుకోవడానికి మరుగుదొడ్లు లేవు అనుకుంటుంటే ఐదేళ్ళకితం విశాఖపట్నంలో జరిగిన సంఘ

టన జగన్నాధంకి జ్ఞాపకానికి వచ్చింది.

అది మార్చి నెల, శనివారం ఉదయం ఆరున్నరయింది. శుక్రవారం రాత్రి అర్ధాంత రంగా కురిసిన వర్షం వాతావరణాన్ని ఆహ్లాదం చేసింది. ఆంధ్రా యూనివర్శిటీ పనిమీద విశాఖపట్నం వచ్చి ఎల్లమ్మతోట దగ్గర, బస్ స్టాండ్‌కి ఎదురుగా లాడ్జిలో పడుకుని, ఉదయమే లేచి, కాలకృత్యాలు తీర్చుకున్నాక, వాతావరణం చల్లగా ఉండ డంతో యూనివర్శిటీకి నడిచి వెళ్దామని మద్దెలపాలెం రోడ్డు పట్టాడు తను. రోడ్డుమీద బస్‌లు అట్టే నడవడంలేదు. ముందరరోజు కురిసిన వానవలన రోడ్డుమీదున్న దుమ్ము మీదకి లేవడంలేదు. విశాఖపట్నం ఇంకా పూర్తిగా కళ్ళు తెరవలేదు. మెల్లిగా అడుగు వేస్తూ కొత్తగా కడుతున్న స్టేడియం దగ్గరికి వచ్చాడు. రోడ్డుకి ఒకవైపు స్టేడియం, రెండ వవైపు దిగువ తరగతి జనాభా ఇళ్ళు. స్టేడియం గోడని ఆనుకుని నలుగురు ఆడవా ళ్ళు నించున్నారు. వాళ్ళు నిలుచున్న తీరు వింతగా ఉంది. వాళ్ళు అర్ధచంద్రాకారంలో నిలుచున్నారు. వాళ్ళ వెనకాల ఏమౌతోందో తెలియకుండా ఉండడానికి అలా నిలుచున్నా



రని తరువాత అర్థమైంది. రవ్వంత ఆశ్చర్య పడుతూ నూరడుగులు నడిచాక, ఉండబట్ట లేక వెనక్కి తిరిగి చూశాడు. ఆ గుంపు నిలుచున్న తీరు చెదిరిపోయింది. వెనకాల నుంచి ఒక స్త్రీ ఖాళీ చెంబుతో బైటికి రాగానే అందరూ కలిసి పూరిగుడిసెలవేపు వెళ్ళారు.

ఆమె దీర్ఘశంక తీర్చుకుంటుంటే రోడ్డు మీద నడిచే ప్రజల కంట ఆమెపడకుండా ఉండాలని మిగిలిన నలుగురు స్త్రీలు కోటకట్టి, కవచంలా ఆమెకి అడ్డు నిలుచున్నారని గ్రహించేటప్పటికి నామీద నాకే అసహ్యం వేసింది. గతంలో నేను రోడ్డుమీద లఘుశంక తీర్చుకున్నానని జ్ఞాపకానికి వచ్చి మరింత కుంచించుకుపోయాడు తను ఆనాడు. కాస్సేపటికి సౌకర్యాలు లేకపోయినంతమాత్రాన ప్రకృతి ధర్మం ఆగదుకదా, ఎవరైనా ఏం చేయగలరు? అని సరిపెట్టుకున్నాడు. ఇప్పుడు మనదేశం ఎలాగుందో? అని జగన్నాథం మథనపడుతుంటే,

"నాన్నా! నేను సాయంకాలం ఆఫీస్ నుంచి వచ్చేంతవరకు ఆయనని ఉంచండి'' అంటూ జగన్నాథంని ఆలోచనల్లోంచి మేల్కొలిపాడు నరేంద్ర.

తల ఊపాడు జగన్నాథం.

రాత్రి ఎనిమిదవగానే రాజు, రాధ టెలివిజన్ చూడడం ఆపి తమతమ గదులలోనికి వెళ్ళారు. ఏ ప్రోగ్రామూ నచ్చక నరేంద్ర రిమోట్‌తో ప్రతీ రెండు నిమిషాలకీ ఛానల్ మారుస్తుంటే, విసుగేసి కాబోలు పద్మ లేచి లోపలికి వెళ్ళింది. న్యూస్ ఛానల్ చూడడం మొదలెట్టాడు నరేంద్ర.

ఆరోజు జరిగిన ఖూనీలు, మానభంగాలు గురించి చూపించాక ప్రపంచంలో జరుగుతున్న వార్తలని ప్రసారం చేస్తున్నారు. ప్రపంచంలో అరాచకానికి, హింసలకి అరబ్బు దేశస్థులే ముఖ్యకారణం అన్న ధోరణి కనబరుస్తూ టెలివిజన్ చూస్తున్న వాళ్ళకి, అరబ్బు దేశస్థులంటే చెడ్డ ఊహని నాటడానికి ప్రయత్నిస్తున్నట్లు కనిపిస్తుంది. యూరప్, జపాన్ దేశాలని వదిలేస్తే ఇంకే దేశంలోనైనా ఇరవైమంది చనిపోయినా అది ముఖ్యమైన వార్తగా ప్రసారమవదు, కాని ఇజ్రాయల్‌లో ఎవరైనా తుమ్మితే అది ప్రసారం చేయదగ్గ వార్తవుతుంది. మొదట్లో తనకి అది అర్థమయ్యేదికాదు, కాని టెలివిజన్, ముఖ్యమైన వార్తాపత్రికలు నడిపేది యూదులే అన్న సత్యం తెలియగానే ఆ వార్తల ప్రసారానికి కారణం తెలిసింది.

యూదులకి అరబ్బులంటే అనుమానం. చాలాకాలంగా ఆ రెండు తెగలమధ్య యుద్ధం జరుగుతూనే వుంది. కాని అమెరికాకి వలసవచ్చి, ఇక్కడ స్థిరపడిన తరువాత కూడా పాతకక్షలు, పాత ఊహలు వదలడంలేదు. సజావుగా ఎందుకు ఆలోచించడంలేదు? అని ఆలోచిస్తుంటే సాయి ఫోన్ జ్ఞాపకానికి వచ్చింది.

సాయి ఫోన్ చేయగానే తను ఎందుకు భయపడ్డాడు? ఏదో అవసరముంటేగాని ఫోన్ చేయడని ఎందుకు దురభిప్రాయపడ్డాడు? ఐదేళ్ళయి ఈ దేశంలో ఉంటున్నా తన ఆలోచనల్లో మార్పు ఎందుకు రాలేదు? అని సిగ్గుపడుతూ కళ్ళు మూసుకున్నాడు జగన్నాథం.

"ఎవరీ సాయి?" అన్న ప్రశ్న కళ్ళ ముందర నిలుచుంది.



టొయోటా క్రేమీ కారు రోడ్డుమీద

ఆగింది. కారులోంచి సుమారు ఐదడుగుల పదంగుళాల పొడవు, నూటఏభై పౌన్ల బరువు గల వ్యక్తి బ్రీఫ్‌కేస్‌తో దిగి, కారుని లాక్‌చేసి, ఇంటివేపు రావడం కిటికీలోంచి జగన్నాథంకి కనిపిస్తోంది. నడిచివస్తున్న వ్యక్తి మొహం స్పష్టంగా కనిపించకపోవడంతో, జగన్నాథం కళ్ళద్దాలని సవరించుకున్నా దృష్టి మెరుగవ లేదు. అంటే ''కళ్లద్దాల పవర్ చాలడంలేదన్న మాట'' అనుకుంటూ తలుపు తెరిచాడు జగన్నాథం. ద్వారం ఎదురుగా నిలుచున్న ఆగంతకునిలో పరిచయమైన గుర్తులకోసం వెతుకుతుంటే, ఏమీ కానరాలేదు. జ్ఞాపకాలు, వార్ధక్యానికి మొదటి దశని ప్రకటిస్తూ, తమ అసమర్థతని తెలియచెప్పాయి.

''రండి రండి'' అన్నాడు జగన్నాథం పక్కకి జరుగుతూ.

''నా పేరు సాయి. నన్ను గుర్తించలేదని మీరు అనవసరంగా మథనపడకండి. ఈమధ్యకాలంలో నాలో చాలా మార్పు వచ్చింది. నేవేసుకున్న ఈ సూటు ఆ మార్పుని ఇంకా పెంచింది'' అంటూ గదిలోనికి ప్రవేశించి ద్వారం దగ్గరే ఒక వారగా జోళ్లని వదిలి, ఎదురుగా ఉన్న సోఫాలో మెల్లిగా సర్దుకున్నాడు. సోఫాలో కూర్చుంటున్న అపరిచిత వ్యక్తిని పన్నెండేళ్ళ క్రితం మస్తిష్కంలో ఇరుక్కున్న పాత విద్యార్థుల జ్ఞాపకాల మొహాలలో ఇమడ్చ ప్రయత్నిస్తే జోడీ ఏదీ దొరకలేదు.

''దాదాపు పన్నెండేళ్ళ తరువాత మిమ్మల్ని చూస్తున్నాను. మరీ పోల్చలేనంత కాకపోయినా, మీలో కూడా చాలా మార్పు వచ్చింది. పన్నెండేళ్లంటే తక్కువేమీ కాదుగా'' అన్నాడు.

జగన్నాథంకి సాయి అంటే ఏర్పడిన మంచి అభిప్రాయం పెరగనారంభించింది.

''ఎలా ఉన్నారు మాస్టారూ?''

''బాగానే ఉన్నాను'' అని ముక్తసరి సమాధానమిచ్చాడు జగన్నాథం.

''మీరు మాకు షేక్స్పియర్ డ్రామా 'మర్చెంట్ ఆఫ్ వెన్నిస్' చెప్పారు'' అన్నాడు సాయి. ''మర్చెంట్ ఆఫ్ వెన్నిస్''

''మర్చెంట్ ఆఫ్ వెన్నిస్'' అంటూ జగన్నాథం మెదడు రివ్వున గతంలోనికి పరిగెత్తి జ్ఞాపకాలని కెలికి ఎందుకో పన్నెండేళ్ళ క్రితం ఒక వాన రోజు దగ్గర ఆగింది.

ఆవేళ దట్టంగా కురుస్తోంది వాన. ఊరూ, వాడా ఏకమవుతాయని భయపెట్టేలా కురుస్తోంది.

కోడుగంటి వారి వీధిలోంచి హాస్టబల్, షరాఫ్‌ఖానా వీధి ఎత్తులనుంచి వాననీళ్లు వాగులా కిందకి తన్నుకువస్తున్నాయి. ఎత్తునుంచి కిందకి దిగిన నీరు, కాలేజీ గేటు దగ్గర పల్లంలో కొంత నిలిచి మిగతా నీరు పెద్ద చెరువు పక్కకి పొర్లుతోంది. మధ్యాహ్నం రెండు గంటలనుంచి మూడు గంటల వరకు డ్రామాక్లాసు. సుమారు ఎనభైమంది ఉండవలసిన క్లాసులో ముగ్గురు మాత్రం ఉన్నారు. ముగ్గురికి పాఠం చెప్పడమా? మానడమా? అన్న సందిగ్ధంలో ఉండగా, పూర్తిగా తడిసి, నఖశిఖపర్యంతం నీళ్ళు కారుతూ పాఠం కోసం వచ్చి ద్వారం దగ్గర నిలబడ్డ కుర్రాడిని చూసి ముచ్చటేసింది. లోపలికి వచ్చి బల్లలమీద కూర్చుంటే బల్లలు తడిసిపోతాయని కాబోలు, అనుమానంగా రవ్వంత సిగ్గుపడుతూ ద్వారం దగ్గరే నిలుచుండిపోయాడు అతను. మధ్యాపాపిడి తీసిన తలనుంచి నీళ్లు కారుతుంటే, భుజానికి తలని ఆన్చి నీళ్లని తుడుచుకుంటున్న అతనిని చూసి, పాఠం మొదలుపెట్టాడు తను.

''నువ్వు మధ్యాపాపిడి తీసేవాడివా?'' అనడిగాడు జగన్నాథం.

చిరునవ్వు చిందింది సాయి మొహంమీద.

''ఆ వానరోజు మీరు నా పేరు అడిగి వుంటే మీకు చటుక్కున జ్ఞాపకానికి వచ్చేవాడిని'' అంటూ సాయి నవ్వాడు, జగన్నాథం అతనితో శృతికలిపాడు. ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

విజయనగరంలో ఉత్సాహంగా జరిగే దీపావళి, అమ్మవార్ల పండుగ, రథయాత్రల గురించి, అమ్మకోనేరులో వదిలే కార్తీకదీపాల గురించి మూడు కోవెల్లలో నడిచే పురాణకాలక్షేపాల గురించి ఉత్సాహంగా అరగంటసేపు పాతజ్ఞాపకాలని నెమరువేసుకున్నారు.

తలుపు తోసుకుని లోపలికి వచ్చాడు నరేంద్ర.

"నా పేరు సాయి. చాలా సంవత్సరాల క్రితం, విజయనగరంలో నేను మీ నాన్నగారి విద్యార్థిని'' అంటూ సోఫాలోంచి లేచి నిలబడి తనని తాను పరిచయం చేసుకున్నాడు సాయి. చాచిన సాయి చేతిని నరేంద్ర అందుకున్నాడు.

"పద్మ ఇంకా ఆఫీసునుంచి రాలేదా? సాయిగారికి తాగడానికి ఏమైనా ఇచ్చేవా నాన్నా'' అంటూ వంటింటిలోనికి వెళ్ళి ఫ్రిజ్ తెరచి, గ్లాసులలో ఆరంజ్ జ్యూస్‌తో తిరిగివచ్చి, ఒకటి సాయికి, ఇంకొకటి జగన్నాథంకి అందిచ్చి మిగిలిన గ్లాసుతో జగన్నాథం పక్కన ఆశీనుడయ్యాడు.

విజయనగరం కబుర్లు తిరిగి మొదలయ్యాయి.

"నేను మున్సిపల్ హైస్కూల్‌లో చదువు ముగించేక, ఎవిన్ కాలేజీలో రెండేళ్ళు చదివాను. అందుచేత మీరు నెమరువేసుకుంటున్న విజయనగరం జ్ఞాపకాలు, మీకు కలిగించినంత ఉత్సాహాన్ని నాకు కలిగించవు. ఎవిన్ కాలేజీలో చదువుకున్నా, చాలాకాలం విజయనగరంలో పనిచేయడంవలన మానాన్నకి ఆ ఊరంటే ఎంతో అభిమానం" అన్నాడు నరేంద్ర.

శబ్దం చేసుకుంటూ పద్మ, రాజు, రాధలు లోపలికి వచ్చారు. మరోసారి సోఫాలోంచి లేచి నిలబడి సాయి తననితాను పరిచయం చేసుకున్నాడు.

చీకటిపడింది. ఎనిమిదవబోతుంటే, "నేను వెళ్ళాలి, నాకు డిన్నర్ ఎప్పాయింట్‌మెంట్ ఉంది'' అంటూ సాయి లేచాడు. నరేంద్ర, పద్మలు, "ఈ ఊరినుంచి వెళ్ళేలోగా ఒకసారి మా ఇంటికి డిన్నర్‌కి రావాలి'' అన్నారు.

"వచ్చే ట్రిప్‌లో చూద్దాం. వచ్చేనెలలో ఈ ఊరు వచ్చే ఒక అవకాశం ఉంది. నాదొక చిన్న ప్రతిపాదన" అంటూ ఆగేడు సాయి. ఎవ్వరూ ఏమీ మాటలాడలేదు.

"నేను న్యూజెర్సీ రాష్ట్రంలో ఉంటాను. స్వంత ఇల్లు ఉంది. జగన్నాథంగారు నాకు తండ్రివంటివారు. ఆయనంటే నాకు చాలా పూజ్యభావం. ఆయనకి అభ్యంతరం లేపోతే మీకూ ఇష్టమయితే ఆయనని నాతో ఒకసారి తీసుకువెళ్తాను. నా భార్య చంద్రికకి మాస్టారి గురించి చాలా చెప్పాను. ఆయనని కలుద్దామని ఉబలాటపడుతోంది. ఏ కష్టమూ ఆయనకి కలగకుండా, న్యూయార్క్, దాని దగ్గరగా ఉన్న ప్రదేశాలు చూపిస్తాను'' అన్నాడు.

నరేంద్ర, పద్మల సంశయం కనిపెట్టి, "మీరు వెంటనే 'అవును', 'కాదు' అని చెప్పనవసరంలేదు. బలవంతం ఏమీలేదు. తీరుబడిగా ఆలోచించండి. పదిరోజులు తరువాత ఫోన్ చేస్తాను'' అంటూ బ్రీఫ్‌కేసందుకుని కారువేపు నడిచాడు సాయి.

తొమ్మిదివందల మైళ్లు కారులో ప్రయాణం చాలా ప్రయాసతో కూడిందని, ఇప్పుడిప్పుడే పరిచయం అయిన సాయితో వెళ్తే వాళ్ళని ఇబ్బంది పెట్టినట్టవుతుందని నరేంద్ర వాదిస్తే

"తనంతతాను ఆహ్వానించిన సాయి వెంట వెళ్ళడంలో తప్పేముందని'' పద్మ తిరుగుప్రశ్న వేసింది. కారులో ప్రయాణం చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంటుందని, న్యూయార్క్ వెళ్ళి అన్ని ప్రదేశాలు చూడవచ్చని, రాధ, రాజు, |తాతగారు| న్యూజెర్సీ వెళ్ళడాన్ని బలపరిచారు. జగన్నాథం న్యూజెర్సీ వెళ్ళడమా? మానడమా? ఏదీ నిర్ణయమవకుండానే చర్చ ఆగింది. జగన్నాథం ఊపిరి పీల్చుకున్నాడు.

★ ★ ★

"రెండుసార్లు ఫోన్ చేశాడు, ఆయనకి మావగారంటే చాలా గౌరవంలా ఉంది. మీరు అనవసరంగా కంగారుపడుతున్నారు'' అంది పద్మ జగన్నాథం న్యూజెర్సీ వెళ్ళడానికి బట్టలు సర్దుకుంటుంటే.

"మీరు అనవసరంగా ఇబ్బందులకి గురి అవుతారేమోనని నా భయం అంతా. అక్కడ మీకు ఎప్పుడు నచ్చకపోతే అప్పుడు ఫోన్ చెయ్యండి. మీరు తిరిగి రావడానికి ఏర్పాట్లు చేస్తాను'' అన్నాడు నరేంద్ర.

"ఆయన పొద్దున్నే లేవాలి. ఆయనకి నిద్రకి వేళయింది'' అంటూ నరేంద్రని పద్మ లోపలికి తీసుకెళ్ళింది.

★ ★ ★

ఉదయం ఏడు గంటలకి ఇంటి దగ్గర బయలుదేరి, ఆఫీసుకివెళ్ళే కార్ల రద్దీలలోంచి బైటపడి ఇండియానా హైవే ఎనభైమీదకి చేరేసరికి దాదాపు రెండు గంటలు పట్టింది. చికాగో పరిసర ప్రాంతాలలో రద్దీ ఇంతా అంతా కాదు. ఒక కారు ఇంకొక కారుని స్పృశిస్తూ గంటకి అరవైఅయిదు డెబ్భయి మైళ్ల వేగంతో దూసుకుపోతుంటే, సంభాషణకి ఉపక్రమించకుండా కారు నడపడంలో దృష్టిని కేంద్రీకరించాడు సాయి. రోడ్డుమీద కార్ల సాంద్రత తగ్గాక "ఈ హైవేలు పంతొమ్మిదివందల యాభైలలో కట్టినవి. ఒకదిశకి మూడు లేన్లు, రెండవదిశ ప్రయాణానికి మూడు లేన్లు మొత్తం ఆరులేన్లు ఉన్న రోడ్లు దాదాపు డెబ్భయివేల మైళ్లు ఉన్నాయిట. ఈ దేశవాణిజ్యం చాలామట్టుకు రోడ్లమీద నడిచే వాహనాలమీదే జరుగుతుంది. ఈ దేశం తయారుచేసినన్ని కార్లు ఇంకే దేశం చేయదు. అమెరికా ఆర్థిక వ్యవస్థ, కార్లు, కార్లకి సంబంధించిన వాణిజ్యంమీద ఎంతో ఆధారపడిఉంది. కార్ల కంపెనీలకి రోడ్లమీద సరుకు రవాణాచేసే కంపెనీలకి రైల్వే కంపెనీల పోటీ కిట్టదు. ఈ దేశంలో ప్రతీదీ ప్రైవేట్ రంగమే. రైల్వేలని చిన్న చిన్న కంపెనీలు నడుపుతాయి. అవకాశం లభించినప్పుడు ఆ చిన్న రైల్వే కంపెనీలని పెద్ద కార్ల కంపెనీలు కొనుక్కుని, రైళ్లు నడవకుండా ఉండాలని, రైల్వేలైన్లని ఊడపీకేసిన ఉదంతాలు ఉన్నాయి. డబ్బు సంపాదించడం దానికి సంబంధించిన పోటీలూ అబ్బో! చాలా విచిత్రాలు ఉన్నాయి ఈ దేశంలో'' అన్నాడు సాయి.

సాయి నడుపుతున్న కారు పక్కలేన్ లోంచి, నలభై-నలభైఐదు అడుగుల ట్రక్ శబ్దం చేసుకుంటూ, సాయి కారుని అధిగమించి ముందరకి వెళ్ళినప్పుడు, ట్రక్ వెళుతుంటే చెదిరిన గాలి, సాయి కారుని కుదపడంతో, మాటలు ఆపి, డ్రైవింగ్ మీదకి దృష్టిని మళ్ళీ కేంద్రీకరించాడు సాయి.

ఎయిర్ కండిషన్డ్ కారులో ఉన్న చల్లదనం జగన్నాథంని మగత నిద్రలోనికి తోసింది. జగన్నాథంకి మెలకువ వచ్చేసరికి కారు హైవేమీద డెబ్బయి మైళ్లవేగంతో శబ్దం చేయకుండా పరిగెడ్తోంది. చేతివాచీలో ముళ్లు పదిన్నర చూపించేసరికి.

"అప్పుడే మూడు గంటలయిందా మనం బయలుదేరి?" అనడిగాడు జగన్నాథం.

"మీరు మంచి నిద్ర తీశారు. రాబోయే రెస్ట్ ప్రదేశంలో ఆగి, ఒక కప్పు కాఫీ తాగి మళ్ళీ బయలుదేరుదాం" అన్నాడు సాయి.

"నీ ఇష్టం" అంటూ బయటకి చూడసాగాడు జగన్నాథం.

హైవేకి ఇరువైపులా ఏపుగా ఎదిగిన చెట్లు. దాదాపు డెబ్బయి ఎనభై అడుగుల ఎత్తున్న చెట్లకి, కల్నేత చీరలో ఉన్న రంగులలా, చెట్లు రంగు ఆకుల మిశ్రమాన్ని ప్రదర్శిస్తున్నాయి. ఎక్కువ సూర్యరశ్మిని, తేమని అందుకున్న ఆకులు తమ హరితాన్ని నిలుపుకుంటుంటే అవి తక్కువైన ఆకులు వెలవెలపోవడం మొదలుపెట్టి, పసుపురంగుని, పండిన జాంపండు రంగుని, ఎర్రని ఎరుపు రంగులని సంతరించుకున్నాయి.

'వేర్లలో నీళ్లు తక్కువవడంవలన కాబోలు, తేమ కోల్పోయిన ఆకులు పెద్దగా గాలి

వీచగానే కిందకి వాలుతున్నాయి. వాటిని చూస్తుంటే లక్షలకి లక్షలు వెచ్చించి ఆకాశంమీదనుంచి పువ్వులు రాలినట్లు తీసిన ఓ హిందీ చిత్ర సన్నివేశం గుర్తుకువచ్చింది జగన్నాథంకి.

ఒకే చెట్టుమీద అక్కడక్కడ ఒకే ఆకులో ఎర్రని ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చరంగులు, పైడిరాజుగారి తైలవర్ణ చిత్రంలా జమిలిగా ఉండడం చూసిన జగన్నాథంకి ఒడలు పులకరించింది. విశ్రాంతి ప్రదేశంలో కారుని నిలిపి చిన్న మాల్‌లా ఉన్న బిల్డింగ్‌లోనికి ప్రవేశించారు ఇద్దరూ. బయట హైవేమీదకి స్పష్టంగా కనిపించకపోయినా సుమారు నూట ఇరవై అడుగుల పొడవు, దాదాపు నలభై-యాభై అడుగుల వెడల్పు ఉంటుంది ఆ కట్టడం. లోపలికి ప్రవేశించగానే బిల్డింగ్‌లో ఎడమవేపు లఘుశంక, దీర్ఘశంకలు తీర్చుకోడానికి శుభ్రంగా ఉన్న గదులు, ద్వారానికి ఆనుకుని గోడమీద ఎనిమిది పది టెలిఫోన్లు ఉన్నాయి. టెలిఫోన్ల దగ్గరగా ఒక పెద్ద బోర్డుమీద ఆ ప్రదేశం ప్రాముఖ్యత, దగ్గరగా సందర్శించడానికి ఉన్న చారిత్రాత్మక ప్రదేశాలు, రాష్ట్రం రోడ్డు మేప్ అందరికీ కనిపించేలా అమర్చి ఉన్నాయి. బిల్డింగ్ రెండవవైపు సావనీర్లు అమ్ముతున్న చిన్న చిన్న దుకాణాలు, పుస్తకాలు, మేగజైన్లు అమ్ముతున్న దుకాణాలు, కాఫీషాప్, రెస్టారెంట్‌లు ఉన్నాయి. బిల్డింగ్‌లో ప్రవేశించిన తరువాత , పగలు రాత్రీ తెలియనన్ని లాంతర్లు కాంతులని వెదజల్లుతుంటే,

"ఈ రెస్టారెంట్‌లు ఇరవైనాలుగు గంటలూ తెరచి వుంటాయి'' అన్నాడు సాయి. కాఫీ అందుకున్నాక, దానికయిన ఖర్చు పర్స్ తీసి జగన్నాథం ఇవ్వబోతే

"మీరు పర్స్ తీసి డబ్బు ఇస్తాననడం నన్ను అవమానించినట్టే. ఈ దేశంలో కాఫీ చాలా చవుక మేష్టారూ'' అంటూ బిల్‌కి డబ్బు అందిచ్చాడు సాయి.

పరీక్షగా సాయివేపు చూశాడు జగన్నాథం.

ఎంత ప్రయత్నించినా, తన జీవితపు ఫొటో ఆల్బంలో ఇతని ఫొటోలేదు. మరుగున పడిన కొన్నివేల విద్యార్థుల మొహాలలో ఇదొక మొహం, అంతే. కాని అతని జీవితంలో ఉపాధ్యాయునిగా తను చాలాకాలమ్గే నిలిచి, అతనికి తను ప్రత్యేకంగా జ్ఞాపకమున్నాడు. ఇతనికి తను జ్ఞాపకం ఉండడానికి ఇంకేమైనా కారణం ఉందా? ఇతను పొరబడడంలేదుకదా? ఛ! అదెలా సంభవం? విజయనగరం గురించి, కాలేజీ రోజుల గురించి క్షుణ్ణంగా తిరగతోడుతున్న ఇతను పొరపడడమా? ఒకవేళ పొరపడినా, అది తనకి రవ్వంత ఆనందాన్ని కలిగిస్తోంది, అనుకుంటూ గతంలోనికి చూశాడు జగన్నాథం.

జీవితపు ఆఖరి ప్రకరణంలో పేజీలు తిప్పుతుంటే, ఇంకేదో పుస్తకానికి చెందిన మడతలుపడి అతికించి ఉన్న కాగితపు పుటలులా సాయి కనిపిస్తున్నాడు. కాగితం మడతపడడం!

"మడతలు పడకుండా మందు దట్టించాలని చెప్పలేదా? నువ్వు మందు దట్టించవద్దు, ఇక్కడనుంచి వెళ్ళు'' అంటూ సిసింద్రీలు దట్టిస్తున్న తన బుర్రమీద మొట్టికాయ మొట్టాడు చిన్నాన్న! ఆ రోజుల్లో దీపావళి పండుగకి అవసరమైన బాణాసంచా చాలామటుకు ఇంటిలోనే తయారయ్యేది. విజయనగరంలో చాలా కోలాహలంగా జరిగే పండుగలలో దీపావళి ఒకటి. అప్పుడు తనకి పదమూడేళ్లు. సాయంకాలం నాలుగు గంటలకి ఉరకలు పెడుతున్న ఉత్సాహం, చీకటి ఎప్పుడు అవుతుందా? అని ఆరాటం.

"అమ్మా, ప్రమిదలలో నూనె పొయ్యి, నేను ఒత్తులు వేస్తాను'' అని తను తొందరపెడుతుంటే.

"ఉండరా, ఇప్పటినుంచీ దీపాలు వెలిగిస్తే చాలా నూనె తాగేస్తాయి. చీకటిపడనీ'' అంటూ అమ్మ కసిరింది. అయినా ఉత్సాహం రవ్వంతైనా తరగలేదు. తన బాధ భరించలేక, ఐదున్నర అయ్యేసరికి

ప్రమిదలలోనికి నూనె ఒంపింది అమ్మ.

ఐదు రూపాయలు పెట్టి బజారునుంచి తెచ్చిన చిచ్చుబుడ్లు, కాకరపువ్వొత్తులు, తాటాకు టపాకాయలు, తొందరగా వెలిగించి, రాత్రి ఎనిమిదయ్యేసరికి ఓడిపోయిన వీరునిలా లోపలికి వచ్చాడు. ఉత్సాహం సమసి మెల్లగా దిగులు ఆవహించుకోవడం మొదలయింది.

"రారా, అన్నం పెట్టాను'' అంటూ నాకిష్టమైన పరమాన్నాన్ని గరిటతో పళ్లెంలోనికి వడ్డించినా,

"అయ్యో దీపావళి అయిపోయిందే'' అన్న చింతవలన, తిండిమీదకి దృష్టి మళ్లలేదు. రవ్వంత పరధ్యానంతో భోజనం కానిచ్చి కిటికీ దగ్గర నిలబడి బైట వెలుగుతో ప్రజ్వరిల్లిపోతున్న ప్రపంచాన్ని చూడసాగాడు. చుట్టూ ఉన్న ప్రపంచం అంతా ఇంకా మతాబాలు, చిచ్చుబుడ్లు అంటిస్తున్నారు. నేలని వదిలిన సిసింద్రీలు, అటూ ఇటూ తుళ్ళుతూ ఐదారు సెకన్లపాటు రోడ్డుమీద నడిచి వెళ్ళే జనాభా కాళ్ళలోపడి వాళ్ళని కంగారు పెడుతుంటే,

"వెధవా, మనుష్యులు లేకుండా చూసి వదలాలని చెప్పానా, లేదా?" అంటూ పెద్దవాళ్ళ అరుపులు, అవి పట్టించుకోకుండా కుర్రాళ్ళు తమ ధోరణిలోనే ఉండడం భలేగా ఉండేది.

పక్కింటి కాలేజీ కుర్రాడు చూస్తున్నాడో, లేదోనని నిర్ధారణ చేసుకున్నాక, ఎదురింటి ఆడపిల్ల పెద్ద మతాబా వెలిగించి, ముత్యాలు కిందకి జారుతుంటే, ఆ వెలుతురులో తన గుండ్రటి మొహాన్ని అతనికి ప్రదర్శిస్తూ చిరునవ్వు చిందించడం తను కిటికీలోంచి గమనిస్తున్నాడు.

ఎవరో వదిలిన సిసింద్రీ, భూమిని వదిలి మీదకి లేచి తను చూస్తున్న కిటికీని గుద్ది వెనక్కి మళ్ళింది. అది చూసి,

"కిటికీ తలుపులు తీసి చూడకు అని చెప్పానా, లేదా? బట్టలు అంటుకుంటాయి'' అంటూ బలవంతంగా కిటికీ తలుపులు మూసింది అమ్మ. ఆమె లోపలికి వెళ్ళాక కిటికీ తలుపులని నాలుగైదు అంగుళాలు మాత్రమే తెరచి బైట జరుగుతున్న వింతని చూడసాగాడు తను.

తారాజువ్వల జోరు పెరిగింది. వాటి ముందర సిసింద్రీలు వెలాతెలా పోతున్నాయి. కొన్ని సిసింద్రీలు మందు సరిగ్గా కూరక కాబోలు, లేదా మందు కూరుతున్నప్పుడు కాగితపు పొరలు అడ్డుపడో 'తుస్, తుస్' మంటూ భూమిని వదలడంలేదు. రాజుల వీధిజట్టు సుమారు ఇరవై-ముప్ఫయి మంది చేతిలో తారాజువ్వలతో, సంచీలో మందు దట్టించిన వెలగకాయలతో ఇంగ్లీషు సినిమాలలో రోమన్ సైనికులలా, యుద్ధానికి వెళుతూ, "మేం వస్తున్నాం" అంటూ ప్రకటన చేస్తూ తారురోడ్డుమీద తారాజువ్వలని పైకి వెయ్యడానికి బదులు భూమిమీద వదిలారు. కిటికీ చిన్న కంతలోంచి అవన్నీ సరిగ్గా కనబడక అమ్మమీద విసుగుకున్నాడు.

మతాబాలు అయిపోయాయి కాబోలు, ఎదురింటిపిల్ల కాకర పువ్వొత్తులలోనికి వచ్చింది. క్రీగంటితో కాలేజీ కుర్రాడివేపు పోజులు విసురుతూనే ఉంది.

తారాజువ్వలు మీదకి లేచాక ప్రేలినశబ్దాలు, దూరంగా ఔట్లు పేలుస్తున్న శబ్దాలు, కోలాహలం వినిపిస్తుంటే మెల్లిగా కళ్ళు మూతలుపడ్డాయి.

తెల్లవారుఝామునే తెలివి వస్తే లాగు సవరించుకుంటూ రాయబారం సరిగ్గా అందక పేలకుండా మిగిలిన టపాకాయల్ని ఏరుతుంటే దీపావళి వెళ్ళిందని, మరో సంవత్సరం గడిస్తే కాని మళ్ళీ తిరిగి రాదన్నది మనస్సులో నాటుకుంది. ఆ దీపావళి తరువాత మళ్ళీ విజయనగరంలో దీపావళి పన్నెండేళ్ల తరువాత చూశాడు. అప్పటికి విజయనగరం, దీపావళి రెండూ మారేయి.

దీపావళి వెళ్లిన మర్నాడు ఉదయం దిగు

లుతో కొట్టుకుంటుంటే, వెలగని టపాసులు కనిపించినప్పుడు కలిగిన చెప్పలేని ఆనందంలా జీవితపు చివరి అంకంలో అనూహ్యంగా సాయి ప్రవేశించి ఆశ్చర్యపరి చాడు అనుకుంటుంటే,

"ఏమిటి ఆలోచిస్తున్నారు మాస్టారూ? కాఫీ చల్లారిపోతోంది'' అంటూ సాయి హెచ్చరించాడు. జగన్నాథం మౌనంగా కాఫీని చప్పరించడం మొదలుపెట్టాడు.

"ఈ దేశంలో సరుకుల రవాణా రాత్రనక, పగలనక నిరంతరంగా పెద్ద పెద్ద ట్రక్స్‌మీదే జరుగుతుందని మీరు గమనించే ఉంటారు. ఈ ట్రక్స్ అన్నీ ఎయిర్ కండిషన్ చేసినవే. సరుకు రవాణా చేసేటప్పుడు తిండికి, ఇతర కార్యాలకి అనవసరంగా టైమ్ వృధా చేయకుండా ఉండాలని ఈ రెస్ట్ ప్రదేశాలు ప్రతీ నలభై-నలభైఅయిదు మైళ్లకి ఏర్పాటు చేస్తారు. ఇదే ప్రదేశంలో మనం పెట్రోల్ నింపుకోవచ్చు. అన్నీ ఇలా సమకూర్చి పెట్టినందుకు హైవే వాడిన వాళ్ళ దగ్గర టోల్ గుంజుతారు'' అంటూ వివరించాడు సాయి.

"హైవేమీద నాకు పోలీసులు కనిపించలేదు. వాళ్ళు గస్తీ తిరగరా?" అనడిగాడు జగన్నాథం.

"మీరు నిద్రలో ఉండడంవలన మీరు వాళ్ళని గమనించలేదు. కార్లలో హెలికాప్టర్లలో పోలీసులు అన్నీ సవ్యంగా నడుస్తున్నాయో లేదోనని గమనిస్తూనే ఉంటారు. ఒకసారి ఏమైందో తెలుసా మేస్టారూ? నేను ముగ్గురు మిత్రులతో కలిసి ఫ్లోరిడా వెళ్తున్నాను. చికాగోనుంచి ఫ్లోరిడా వెళ్తుంటే చాలా ఎత్తు ఉన్న ఎపలేచియన్ కొండలమీద నుంచి ప్రయాణం చేయాలి. కొండ ఎత్తు ఎక్కుతూ, నా కారు పొగలు కక్కి ఇహ నడవనని మొరాయించింది. అదృష్టవశాత్తూ కారు బెక్కుతూ దగ్గరగా ఉన్న గేస్ స్టేషన్‌వరకు నడిచింది. అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలయింది, ఆదివారం.

అక్కడ ఎవరూ మెకానిక్‌లు లేరు. గేస్ స్టేషన్ మేనేజర్‌తో కారు మెకానిక్‌ని చూసేలా మాటలాడి నలుగురు మనుషులం ఆరు సూట్‌కేస్‌లతో బిక్కుబిక్కుమంటూ ఏం చేయాలో తోచక నిలుచున్నాం. మేం వెళ్లవలసిన ప్రదేశం ఇంకా నాలుగువందల మైళ్ళు ఉంది.

అరగంట గడిచింది. ఒక హైవే పోలీసు కారు మాముందర ఆగింది.

"ఏమిటి సమస్య?" అంటూ ఆరడుగుల నాలుగంగుళాల పొడవు, నూటతొంభై పౌన్ల బరువు వ్యక్తి కారులోంచి బైటకి దిగాడు. కంటికి బంగారు రంగు ఫ్రేమ్ రేబాన్ కళ్లద్దాలు, ఎండలో తళతళా మెరుస్తున్న బేడ్జి, తుపాకీ చేతిలో.

మా గోడు చెప్పుకున్నాం.

"ఇక్కడకి డెబ్బైమైళ్ల దూరంలో ఒక ఎయిర్‌పోర్ట్ ఉంది. అక్కడ మీరు కారు అద్దెకి తీసుకోవచ్చు. అంతదూరం మిమ్మల్ని నేను తీసుకెళ్ళలేను. నాకు సరిహద్దు ఇంకొక ఇరవైఐదుమైళ్లు మాత్రమే. అంచెలవారీగా మిమ్మల్ని ఆ ఎయిర్‌పోర్ట్ వరకు తీసుకెళ్ళడానికి ప్రయత్నిస్తాం" అంటూ మా సామాన్లని తన కారులో ఉంచనారంభించాడు.

"థాంక్‌యూ, థాంక్‌యూ'' అంటూ కారులో సామాన్లని చేర్చి ఎక్కి కూర్చున్నాం.

గంటన్నర వ్యవధిలో ఎయిర్‌పోర్ట్ చేరాం. అబ్బా. ఈ దేశంలో పోలీసుల గురించి చెప్పాలంటే చాలా టైమ్ పడుతుంది'' అన్నాడు సాయి.

చిరునవ్వు నవ్వాడు జగన్నాథం. సాయి కారుని హైవేమీదకి మళ్ళించాడు.

చటుక్కున విశాఖపట్నం విజయనగరం హైవే జ్ఞాపకానికి వచ్చింది జగన్నాథంకి.

మహా అయితే రోడ్డు వెడల్పు ముప్పయి అడుగులు ఉంటుందేమో. ఆ వెడల్పులోనే ఇరువైపులా పరిగెత్తే వాహనాలు దూసుకుపోతుంటాయి. లారీలు, బస్సులు ఇతర వాహనాలు హారన్లని మోగిస్తూ, కేరింతలు కొట్టి

ఒకరిని ఇంకొకరు అధిగమిస్తూ, ఎదురుగా వచ్చే వాహనాలకి జాగా లేకుండా చేసి బీభత్సాన్ని సృష్టిస్తాయి.

రాత్రుళ్లు వాహనాల దూకుడు చెప్పనక్కరలేదు. ఏదైనా ఏక్సిడెంటయి ప్రజలు చచ్చిపోతే, కేసులు మాపు చేయించడానికి డబ్బులు గుంజే పోలీసులు కనిపిస్తారు కాని సామాన్యంగా పోలీసులు కనిపించరు. మంత్రులు ప్రయాణం చేయబోతుంటే రోడ్లు సొగసు చేస్తారు. లేకపోతే వాటి జోలికే పోరు.

"పందిపిల్లల్ని ఈనేసినట్లు ఈనేస్తుంటే ప్రాణానికి విలువలేదు'' అన్నాడు తోటి లెక్చరర్ రామం ఒకసారి.

"ఉదాహరణకి ఒక తల్లికి ఎనిమిదిమంది పిల్లలు ఉంటే పిల్లలు ఎక్కువగా ఉన్నారని తల్లి నిర్లక్ష్యం చేస్తుందా? దేశంలో ప్రజా అంతే'' అని తిరుగు సమాధానం చెబుదామనిపించినా, వాదన చేతకాక మౌనంగా ఉండిపోయాడు తను ఆనాడు అనుకుంటుంటే,

"మాస్టారు మళ్ళీ ఏదో ఆలోచనలో పడ్డారు'' అన్నాడు సాయి.

"ఇక్కడ జీవనసరళిని మనదేశపు జీవితంతో పోల్చిచూడడం నా ఆలోచనలలో ఒక భాగమైంది. దాదాపు ఐదేళ్ళ క్రితం విజయనగరం వదిలిపెట్టాను'' అని సమాధానమిచ్చేడు జగన్నాథం. ఇంకా ఏమైనా జగన్నాథం చెబుతాడేమోనని సాయి ఎదురుచూస్తుంటే, "మరి నీ సంగతేమిటి?" అనడిగాడు జగన్నాథం.

"నేను విజయనగరం వదిలి చాలాకాలమైంది. నా ఇరవై ఒకటవేట. బి.యస్‌సి. డిగ్రీ చేతికి వచ్చింది. ఒంటరిగాడ్ని, ఆస్తిపాస్తులు ఏమీలేవు. ఉద్యోగవేటలో హైదరాబాదు వచ్చాను. రెండు వారాలు మాత్రమే ఉంటానన్న షరతుమీద మా నాన్నకి దూరపు బంధువు ఇంట్లో సూట్‌కేస్ ఉంచి, ఉద్యోగాల వేట మొదలుపెట్టాను. హైదరాబాదులో నా లాంటి ఉద్యోగ అర్హతలున్న వ్యక్తులు వేల మీద ఉన్నారు. ఏ ఉద్యోగమైనా నెలకి మూడువందలు ఇస్తే చాలని ముష్టెత్తినట్లు ఎక్కని గుమ్మంలేదు. కాలేజీలలో చదివి డిగ్రీలు తీసుకున్నవాళ్లు, ఇంటిదగ్గరే ఉండి కరెస్పాండన్స్ కోర్సుల ద్వారా డిగ్రీలు తెచ్చుకున్నవాళ్ళు, స్థానికంగా నివశిస్తున్నట్లు దొంగ సర్టిఫికేట్లు పుట్టించి వేరే రాష్ట్రంనుంచి వలసవచ్చినవాళ్లు ఎంతోమంది హైదరాబాదులో పెరిగారు. ఒకరాయి రువ్వితే డిగ్రీ ఉన్న నలుగురికి తగిలేటట్లున్న హైదరాబాదులో స్వశక్తిమీద ఉద్యోగం సంపాదించడం అసంభవమని నీరసపడుతున్న ఒకరోజు నా జీవితం ఒక మలుపు తిరిగింది.

ఆవేళ మంగళవారం. ఉదయం పది గంటలయింది. అప్పటికే ఆరోజు మూడు ఆఫీసులు చుట్టివచ్చాను. కాళ్ళు పీకుతున్నాయి. ఇరానీ రెస్టారెంట్ కనిపిస్తే దానిలో దూరి టీకి ఆర్డరిచ్చాను.

ఐదు నిమిషాలలో సలసలా మరిగిన టీని ఎదురుగా ఉంచాడు సర్వరు. అతితక్కువ టీ పొడి వేసి, నీళ్ళని బాగా మరగనిచ్చి చివర్న రెండు చుక్కలు పాలు రాల్చి వడకట్టిన టీ అది. టీపొడి వేశాక చాలాసేపు మరగడంవలన టీకి చేదుతనం వచ్చింది. కొంతచేదు, వేడిలో కరిగిపోయినట్లనిపించినా, టీ చాలా స్ట్రాంగ్‌గా అనిపించి,

"మరికొంత పంచదార వెయ్యగలవా?" అన్నాను సర్వరుతో. చిన్న ఊరునుంచి హైదరాబాదు వచ్చిన నాకు దబాయించడం ఇంకా అలవడలేదు.

"సార్ పంచదార కిలో ఎంతో తెలుసా?" అంటూ నావేపు ఒక వింతచూపు విసిరి, అశుభ్రమైన చెంచాలో సగం చెంచా పంచదార పట్టుకువచ్చి నా టీ కప్పులో ఉంచాడు. మేనేజర్ దగ్గరికి వెళ్ళి అతను ఇచ్చిన అరవై పైసల బిల్ నా ఎదురుగా ఉంచి వెనక్కి మళ్ళాడు. అప్పుడే నలుగురు విద్యార్థులు రెస్టారెంట్‌లోనికి వచ్చి దగ్గరగా ఉన్న బల్లమీద కూర్చుంటూ, బల్లమీద గ్లాసులతో బలంగా కొట్టడం మొదలు పెట్టడంతో

సర్వర్ ఆ దిశగా పరిగెత్తాడు.

"కస్టమర్స్ వస్తే వాళ్ళకి ఏమిటి కావాలో చూడడానికి ఇంత ఆలస్యమా?" అంటూ మండిపడి "నాలుగు టీలు తొందరగా పట్టుకురా?" అని హుకుం జారీచేసి కబుర్లలో పడ్డారు.

వాళ్ళవేపు వెళ్ళింది నా దృష్టి. పదిహేడు పద్ధెనిమిదేళ్ళు ఉంటాయేమో. బెల్‌బాటమ్‌లు వేసుకున్నారు. కిందకి దిగిన మోచెంపలు. నిర్లక్ష్యంగా వదిలేసిన జుత్తు. చేతికి ఖరీదైన వాచీలు, ఉంగరాలు, చలువ కళ్ళద్దాలు.

"ఈవేళగాని పాఠాలు సరిగ్గా నడపకపోతే నాసామిరంగా వాడి బల్లలకి నిప్పెట్టెయ్యక పోతే నా పేరు రామ్ కానేకాదు'' అంటూ జేబులోంచి గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ పెట్టెతీసి, దాంట్లో ఒక సిగరెట్ నోటిలో ఉంచుకుని అగ్గిపుల్ల వెలిగించాడు.

మిగతా ముగ్గురూ అతని దగ్గర సిగరెట్లని అందుకుని వాటిని ముట్టించి తలలూపేరు.

"సరిగ్గా రెండు నెలలు కూడా లేవు. ఈనాయాల మంచి మేస్టరుని కుదిర్చి మనల్ని పరీక్షలకి తయారుచేయకపోతే, ఈమారు మానాన్న నా మీద విరుచుకుపడతాడు'' అన్నాడు మొదటి వ్యక్తి సిగరెట్ పొగని బైటకి వదులుతూ.

"గురూ, మాకంటే తప్పదు. నీకు ఈ డిగ్రీ ఎందుకు? మీ నాన్నని ఏదో వ్యాపారంలో ఇరికించమనకూడదూ?"

"నువ్వు చెప్పింది నిజమే, వ్యాపారంలో పెట్టగలడు. కాని మా నాన్నకి నన్ను అమెరికా పంపుదామని ఉంది. ఈ పదవుల సంగతి ఎవరు చెప్పగలరు? డబ్బు తినేశాడు, ఇతను మా కులానికి నాయకుడు కాదంటే వెంటనే పదవి ఊడుతుంది. ఇన్‌కంటాక్స్ ఉద్యోగులు వెంటపడితే, ఎవడికి వాడు తప్పుకుంటే తట్టుకోగలగాలి. 'ఎవరికీ తెలియకుండా డబ్బు దాచుకోవడం అంత సులభం కాదు' అన్నాడు మా నాన్న ఒకసారి.

"మీ నాన్నకి అంత పరపతి ఉందికదా, డైరెక్టుగా మార్కులు వేయించుకోకూడదూ?"

"కోడింగ్, డీకోడింగ్‌లు మొదలుపెట్టాక ఎవడో ఒక త్రాష్టుడు సైంధవునిలా అడ్డుపడతాడు. పని జరుగుతుందన్న నమ్మకం లేదు అంటూ మా నాన్న నీళ్ళు కార్చబట్టే ఈ బాధంతా'' అంటూ ఉంగరాలు ఉంగరాలుగా సిగరెట్ పొగని బైటకి వదిలాడు.

సర్వర్ తెచ్చిన టీని అందుకున్నారు నలుగురూ.

"ఏందిబే దీంట్లో చక్కెర వేయకుండా తెచ్చేవ్'' అనరిచాడు ఆ నలుగురిలో ఒకడు. సర్వర్ గాభరాగా పరిగెత్తుకు వచ్చి చక్కెరతో నిండి ఉన్న కప్పుని వాళ్ళముందర ఉంచాడు.

బిల్ డబ్బులు మేనేజర్‌కి అందిచ్చి ఎదురుగా ఉన్న ట్యుటోరియల్ స్కూల్‌లో ప్రవేశించాను.

ఆ ఇరానీ హోటల్ నా అదృష్టాన్ని మార్చింది.

అంతవరకు లెఖ్ఖలు చెబుతున్న లెక్చరర్, ఈ కుర్రాళ్ల బాధ భరించలేక అర్ధాంతరంగా వదిలేసి పారిపోవడంతో, ఐదుగురి గురించి వెతికే వ్యవధిలేక ఒక ఛాన్స్ ఇప్పించమని ప్రాధేయపడుతున్న నాకు ఒక నెల్లాళ్ళ కాంట్రాక్ట్‌మీద ఉద్యోగం ఇచ్చాడు.

ఆకలి మనుష్యులని ఎంత దీనావస్థకి తీసుకెళ్తుందో, ఆకలిబాధ తీరడానికి తమల్ని తాము ఎందుకు అమ్ముకుంటారో ఆ దశ అనుభవించిన వాళ్ళకే తెలుస్తుంది.

"అదృష్టం మాస్టారూ, అదృష్టం. వేల మంది నాలాంటివాళ్లు ఉన్నా ఆ అవకాశం నాకు లభించడం నా పూర్వజన్మ సుకృతం" అంటూ ఆనందంగా గతాన్ని నెమరు వేసుకున్నాడు సాయి.

"నీ నమ్మకాలు నీవనుకో. అయినప్పటికీ, నీ అదృష్టంకీ, పూర్వజన్మ సుకృతంకీ ఏమీ లంకె లేదంటాను. సరి అయిన సమ

యంలో, సరిఅయిన ప్రదేశంలో నువ్వు ఉన్నావు. రోడ్డుమీద రూపాయి నాణెం పడి ఉండడంలాంటిది. అది నీ కంటపడితే వడుపుగా దానిని నువ్వు అందుకున్నట్లే ఇదీను. లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవడానికి నీ కృషి బాగా ఉపకరించింది'' అన్నాడు కర్మసిద్ధాంతం అంటే నమ్మకంలేని జగన్నాథం. తిరిగి సాయి అందుకున్నాడు.

"ఒకనెల గడిచాక నా జీతం పెరిగింది. అక్కడే పనిచేస్తూ సాయంకాలం కంప్యూటర్ కోర్సులలో సర్టిఫికెట్లు సంపాదించాను. అతి జాగ్రత్తగా డబ్బుని నిలవచేసి, రెండేళ్ళ తరువాత ఎన్ఐఐటి సంస్థలో చేరి కంప్యూటర్ కోర్సులో డిప్లొమా అందుకున్నాను. అది దాదాపు ఎనిమిదేళ్ళ క్రితం. పాత స్కూల్ యజమాని "ఎప్పుడు కావాలంటే అప్పుడు ఈ ఉద్యోగం నీకుంది'' అని ఇచ్చిన వాగ్దానం నాకు చెప్పలేనంత ధైర్యాన్ని ఇస్తుంటే, అప్పుడే వెలిసిన ఒక చిన్న కంప్యూటర్ కంపెనీలో కాంట్రాక్ట్ పద్ధతిమీద సాఫ్ట్‌వేర్ రాయడానికి కుదిరేను. విద్య పట్టుపడింది. మరోసారి జీవితం మలుపు తిరిగింది. నేపనిచేసే సాఫ్ట్‌వేర్ కంపెనీ యజమాని బావమరిదికి అమెరికాలో కన్సల్టెన్సీ ఉంది. అతనికి ఒక పెద్ద ప్రాజెక్ట్ కాంట్రాక్ట్ రావడంతో నాకు ఈ దేశం రావడానికి అవకాశం వచ్చింది. జీతం తక్కువ ఇచ్చినా ఆ కంపెనీలో రెండేళ్ళు పనిచేశాను. అప్పుడే చంద్రికతో పరిచయం అయింది. నాకు ఆకలిగా ఉంది, కాస్త లంచ్ తిని మళ్ళీ ప్రయాణం మొదలుపెడదాం. మనం రాత్రికి ఆగవలసిన ఊరు ఇంకొక రెండు వందల మైళ్ల దూరంలో ఉంది'' అంటూ విశ్రాంతి ప్రదేశం కనిపించగానే కారుని ఆపాడు సాయి. లంచ్ ముగించి, కారుకి కావలసిన పెట్రోల్ నింపుకుని ఒకగంట తరువాత హైవే మీదకి వచ్చారు.

"ఈమధ్యన మనం టోల్ ఏమీ కట్టలేదే?" అనడిగాడు జగన్నాథం.

"హైవే వదిలి బైటకి వెళ్ళేటప్పుడు ఒకేసారి గుంజుతాడు'' అంటూ కారువేగం హెచ్చించేడు సాయి. గంటకి డెబ్భైమైళ్ల వేగంతో పరిగెడ్తున్నా కుదుపులు లేకుండా ప్రయాణం హాయిగా ఉందని జగన్నాథం అనుకుంటుంటే, "చంద్రిక ఒక ఏజెన్సీలో మేనేజరు'' అంటూ మళ్ళీ మొదలుపెట్టాడు సాయి.

"వివిధ కంపెనీలు ఉద్యోగాలు ఖాళీలు ఉన్నాయని ఈ ఏజెన్సీకి తెలియపరిస్తే ఈ ఏజెన్సీ తమ దగ్గర ఉన్న దరఖాస్తుదారులని పరిశీలించి, సరి అయిన అభ్యర్థులని రికమెండ్ చేస్తుంది. అలా సహాయం చేసినందుకు వాళ్ళ దగ్గర తృణమో, పణమో పుచ్చుకుంటుంది. నేపనిచేసే కంపెనీకి ఉద్యోగులని వెతకడానికి వెళ్ళినప్పుడు చంద్రికని మొదటిసారి కలిశాను. చంద్రికది సమ్మోహితుల్ని చేసే అందం కాదు. కొట్టొచ్చినట్లు, మిరుమిట్లుగొలిపే తేజస్సు ఆమెలో లేదు. కాని ఆమెతో మాటాలాడడం మొదలుపెడితే, ఇంకాస్సేపు మాటలాడదామనిపించేలా ఉంటుంది ఆమెతో సంభాషణ. మెత్తగా, మృదుమధురంగా, కీచులేకుండా ఉంటుంది ఆమె గొంతు. స్పష్టంగా పదాలని ఒత్తిపలుకుతూ సరదాగా ఉంటుంది ఆమె పలుకు. ఉద్యోగాల విషయంలో విభిన్న రకాలైన వ్యక్తులని ఇంటర్వ్యూలు చేయడంవలన కాబోలు, ఆమెకి మనుష్యుల స్వభావాల్ని అంచనా వేయడం పట్టుపడింది.

ఒక సంవత్సరంపాటు అప్పుడప్పుడు కలిసి సినిమాలకి, డిన్నర్‌లకి వెళ్ళాక పెళ్లి చేసుకుందామన్న నిర్ణయానికి వచ్చాం. నాకు ముందూ, వెనకా ఎవ్వరూ లేరు. ఆర్థికంగా, కులంపరంగా సమన్వయం కుదరని మేం, ఆమె తల్లిదండ్రుల అభ్యంతరాల్ని పట్టించుకోకుండా పెళ్ళిచేసుకున్నాం. గత ఆరేళ్లలో "నేను తప్పు చేశానా?" అన్న ప్రశ్న నాలో ఎప్పుడూ ఉదయించలేదు. చంద్రిక నా జీవితంలో ప్రవేశించడం నా మూడవ

అదృష్టం. పెళ్ళయ్యాక ఒక చిన్న ఇల్లు కొనుక్కొని స్థిరపడ్డాం. నుదుటని రాసిపెట్టిన దానిని ఎవ్వరూ మార్చలేరు మాస్టారూ'' అంటూ తన జీవితచరిత్రని వివరించాడు సాయి.

"నుదుటని రాయడం" అంటూ ఏమీలే దని, అలాంటి వాటిలో తనకి నమ్మకంలేదని మరోసారి చెబుదామనిపించినా, దానివల్ల ఏమిటి ఉపయోగం? ఎవరి నమ్మకాలు వాళ్ళకి ఉండడంలో తప్పేమిటి? అను కుంటూ సాయి భుజంమీద తట్టాడు జగ న్నాథం.

హాలీడే ఇన్‌లో సామాన్లు ఉంచి, మొహం కడుక్కొని ఒక అరగంట గడిచాక జగ న్నాథం, సాయి కారెక్కారు. ఊరువదిలి, రోడ్డుకి ఇరువైపులా చెట్లు ఎక్కువగా ఉన్న చిన్నచిన్న రోడ్లమీద మూడు నాలుగుమైళ్ళు ప్రయాణించేక, చెట్లమధ్య దాక్కొని ఉన్న ఒకపెద్ద ఇంటిముందు ఆగింది కారు.

సాయి, జగన్నాథం కారుదిగి ద్వారంవేపు నడిచి, కాలింగ్‌బెల్ నొక్కారు. తలుపు తెర చుకుంది.

"ఈయన డాక్టర్ సీతారాం. ఈయన మా మాస్టారు జగన్నాథంగారు'' అంటూ తలుపు తెరిచిన వ్యక్తిని జగన్నాథం గారికి సాయి పరిచయం చేశాడు.

"ప్లీజ్డ్ టు మీట్ యు'' అంటూ జగ న్నాథం చేయిని అందుకున్నాడు సీతారాం.

"రండి'' అంటూ వెనక్కి జరిగాడు డాక్టర్ సీతారాం.

ముప్పయ్ ముప్పయ్ రెండు అడుగుల చతురస్రాకారం గదిలోనికి అడుగుపెట్టి, వె ల్వెట్‌లాంటి తివాసీమీద అడుగులు వేస్తూ గదిలో ఉన్న లెదర్ సోఫాలలో ముగ్గురూ సర్దుకున్నారు. కారుమేఘం సోఫాలరంగు కింద ఉన్న తివాసీ రంగుతో చీరకి మేచింగ్ జాకెట్టులా కలిసిపోయింది. జగన్నాథం సోఫాలో కూర్చుంటుంటే, సౌమ్యంగా, ఆప్యాయంగా, ఆహ్వానిస్తున్నట్లు సోఫా లోప లికి ముడుచుకుని స్థానాన్ని కల్పించింది. అన్ని సోఫాలు ఒక్కలాంటివి కావు అన్నదా నికి నిదర్శనంగా సోఫా తొడలని, పిర్రలని, వీపుని మెత్తని ప్రియురాలు కౌగిలించుకున్న ట్టు హత్తుకుని శరీరంలో ఉన్న నొప్పిని హరించ ప్రయత్నిస్తుంటే, దాదాపు ఎనిమిది తొమ్మిదిగంటల కారుప్రయాణంలో కలిగిన అలసట, మెల్లిగా మాయమవడం మొదల యింది. గోడలమీద నాలుగడుగుల వెడల్పు, మూడడుగుల పొడవుగల మోడరన్ ఆర్ట్ పెయింటింగులు, రాజస్థాన్ ప్రాంతపు జీవన విధానాన్ని ప్రదర్శిస్తున్న బతిక్ చిత్రాలు, పఠం కట్టిన విఘ్నేశ్వరస్వామి చిత్రం వేలా డతీసి ఉన్నాయి. బైటకి కనీ కనిపించకుండా వెలువడుతున్న వెలుతురు, బద్ధకంగా ఆ పెయింటింగుల మీదపడి అలసిపోయి, ఇక ఎక్కడకీ వెళ్లనని అక్కడే ఉండిపోయిన ట్లుంది. సోఫాలకి ఆనుకుని ఇరువైపులా షడ్భుజాకారంలో రెండడుగుల వెడల్పుతో ఉన్న టేబిళ్ళమీద లాంతర్లు అమర్చబడి ఉన్నాయి. గది మూలలో ఒక పెద్ద చేపలతొ ట్టి మీదకి ప్రసారమవుతున్న వెలుతురు, తొట్టిలో కదులుతున్న రెండు రంగుచేపల అందాన్ని ఇనుమడింపచేసింది.

"వెలుతురు తక్కువగా ఉంది. చీకటిలో నడుస్తూ ఎవరైనా పడిపోగలరు. పడిపోయి నవాళ్ళు మీమీద దావా వేస్తే తరువాత గింజుకుంటారు'' అంది ఒక స్త్రీ గదిలోనికి వస్తూ.

సీతారాంగారు చటుక్కున లేచి ఒక స్విచ్ నొక్కారు. గోడమీదున్న మరికొన్ని లైట్లు వెలిగి, వరదవచ్చినట్లు హాలంతా వెలుతు రులో మునిగిపోయింది. జగన్నాథం దృష్టి గదిలోనికి ప్రవేశించిన స్త్రీమీద నిలిచింది. హాలులోనికి వచ్చిన స్త్రీ వయస్సు బహుశా నలభైఏళ్ళు ఉంటాయేమో. కట్టిన చీర తీరు సరిగ్గా లేదు, కంటికి వేసుకున్న కాటుక, రెప్పలమీదకి అస్తవ్యస్తంగా చెదరి ఉంది. బండముక్కు, బండపెదిమలు, ఐదడుగుల రెండు అంగుళాల పొడవు, సుమారు నూట

ఏభై పౌన్ల బరువుతో గుమ్మటంలా ఉంది. చెవులకి ఉన్న దుద్దులు, మెడలో రవ్వల నెక్లెస్ మెరుస్తున్నాయి. అంత వెలుతురు మీద పడుతున్నా మొహం చామనచాయ రంగునే చూపిస్తోంది. ఎనిమిది సైజు జోళ్ళలోనికి బలవంతంగా పదవ సైజు కాళ్లని తోసినట్లు, ఏ క్షణమైనా జాకెట్ పిట్లిపోయేలా ఉంది. సినిమాలలో సరిగ్గా మేకప్‌లేని ఎక్స్ట్రా వేషం వేసే వ్యక్తిలా ఉందామె. ఆ శరీర ఆకృతికి తోడు, మార్దవంలేని ఆమె వాక్కు అనుకున్నాడు జగన్నాథం.

డాక్టర్ సీతారాం తన భార్య సరళని పరిచయం చేశాడు జగన్నాథంకి. పరిచయం పూర్తయ్యేక,

"ఇప్పుడే వస్తానని'' సరళ లోపలికి వెళ్ళి, ఒక్కనిమిషం తరువాత ట్రేలో నాలుగు కాఫీ కప్పులతో తిరిగివచ్చింది.

"ఇది మీది'' అంటూ భర్తకి ఒక కప్పు అందించి, "కాఫీలో నే వేసిన పంచదార సరిపోతుందో, లేదో అని పంచదార తెచ్చాను. అవసరమనిపిస్తే కలుపుకోండి'' అంటూ ట్రేని టీపాయ్‌మీద ఉంచింది. అందరూ కాఫీ కప్పులని అందుకున్నారు.

కాఫీ అంటే ఇష్టపడే జగన్నాథంకి, ఆవిడ ఆ కాఫీని ఎలా తయారుచేసిందో అర్థమవలేదు. మరిగిపోతున్న ఉష్ణోగ్రత ఉంది ఆ కాఫీకి. కాఫీ తాగబోతున్న జగన్నాథం నాలిక చురుక్కుమంది.

"మీరు అనవసరంగా హాలీడే ఇన్‌లో దిగారు. లంకంత ఇల్లు, మేమిద్దరమే. ఇక్కడికి వచ్చేస్తే బాగుండేది'' అంది సరళ రవ్వంత నిందాపూర్వకంగా. ఆ నిందలో నిజాయితీ కొరవడిందనిపించింది జగన్నాథంకి.

"పిల్లలు తరచూ వస్తుంటారా?" అనడిగాడు సాయి.

"డబ్బుకి అవసరం వచ్చినప్పుడే అబ్బాయి ఫోన్ చేస్తాడు. కాలేజీ రెండవ సంవత్సరం. స్నేహితులు వగైరా అక్కడే బిజీగా ఉంటాడు. మా అమ్మాయికి ఇల్లు వదిలి ఉండడం ఇదే మొదటి సంవత్సరం కాబట్టి, ప్రతీవారం ఫోన్ చేస్తుంది'' అన్నాడు సీతారాం నవ్వుతూ.

"పిల్లలు దేనిలో మేజర్ చేస్తున్నారు?"

"మా అబ్బాయి సైకాలజీ, అమ్మాయి ఆర్ట్ మేజర్'

"అదేమిటి ఈ దేశంలో భారతదేశస్తుల పిల్లలు డాక్టర్లకి, కంప్యూటర్ కోర్సులకి వెళుతున్నారని విన్నానే?" అన్నాడు సాయి.

"ఈయన పట్టించుకోరు. నేను ఏదైనా చెప్పబోతే, "మమ్మీ నీకేమీ తెలియదు. ఇదేమీ మొగలిరాజపురంలో వంకాయలు కొనడంకాదు అని దబాయించేస్తారు'' అంది సరళ.

సీతారాం, సరళలకి తమ పిల్లలు డాక్టరు చదువుకి కాని, కంప్యూటర్ చదువుకి కానీ వెళ్ళలేదన్న నిరాశ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

"ఈ దేశంలో పిల్లలు మనం చెప్పినట్లు వినరు. వాళ్ళకి ఎలా తోచితే అదే చేస్తారు. నాకిష్టంలేని చదువు ఎలా చదవగలను డాడీ? మనస్సు దానిమీద లగ్నమవదు'' అంటారు. "అది సరే అనుకో, కాని డిగ్రీ చేతికి వచ్చాక ఉద్యోగాల సంగతి కూడా ఆలోచించాలి కదా?" అంటే, "దాని సంగతి అప్పుడు చూద్దాం. నువ్వు అనవసరంగా వర్రీ అవకు అంటారు''! అన్నాడు సీతారాం. ఒక్క నిమిషం ఆగి,

"మనదేశంలో ఉంటే ఇలా ఎదురు తిరిగేవారు కాదు'' అన్నాడు సీతారాం.

"ఈ దేశంలోనే కాదు, మనదేశంలోనూ అంతే. అయితే అక్కడ గిరాకీ ఉన్న ఉద్యోగాలు కంప్యూటర్, డాక్టర్లకి కాబట్టి ఆ డిగ్రీల కోసం పిల్లల చదువులమీద, మధ్యతరగతి కుటుంబీకులు తమదగ్గర ఉన్నా లేకపోయినా, అప్పో సొప్పో చేసి పెడుతున్నారు. ఇతర డిగ్రీలకి విలువలేదు. రెండేసి లక్షలు డొనేష

న్లు కట్టి చదివించడం నాకు తెలుసు. తల్లి తండ్రులు డబ్బులేదంటే, మంచి చదువులు చెప్పించలేకపోతే, ఈలోకంలోనికి పిల్లల్ని ఎందుకు తీసుకువచ్చినట్లు? అని నిలదీస్తు న్నారు'' అన్నాడు సాయి.

"మీరు రాత్రి భోజనం ఏ సమయానికి చేస్తారు? పదార్థాలన్నీ తయారుగా ఉన్నాయి. ఒక అరగంట ముందుగా చెబితే పదార్థాలని కాస్త వేడిచేస్తాను. ఈవేళ శనివారం కదా, నీచు తినం. అంతా వెజిటేరియనే'' అంది సరళ.

"నాకు ఏ టైమయినా పరవాలేదు. మా స్టారుకి సాయంకాలం ఏడుగంటలకి భోజనం అలవాటు'' అంటూ సమాధానమి చ్చాడు సాయి. జగన్నాథం తల ఊపాడు. సరళ లోపలికి వెళ్ళింది.

"ఈవేళ శనివారం నీచు తినం" అంది సరళ. ఆ వాక్యం విన్నప్పుడల్లా జగన్నా థంకి నవ్వు వస్తుంది శనివారంనాడు మాంసం తినకూడదని ఎక్కడైనా రాసిపెట్టి ఉందా? ఇతిహాసాలలో ఒక బోయవాడు వేటాడి తెచ్చిన మాంసాన్ని దేవునికి నైవే ద్యంగా పెట్టేడని చదివాడు తను. అది అంగీకరిస్తే శనివారంకి, మాంసం తినడాని కి ఏమీ సంబంధం ఉండకూడదు. అది కాదనుకుంటే, భగవంతునికి మాంసం పని కిరాదు. ఒక్క శనివారం విసర్జించి, తతిమ్మా రోజులలో మాంసం తినడం ఎలా సమర్థ నీయం? భగవంతునికీ, మాంసానికీ ఏమీ సంబంధం లేదనుకుంటే శనివారం ఎందుకు మానేయడం? అనుకుంటూ నవ్వు కున్నాడు జగన్నాథం.

సరళ భోజనానికి రమ్మనగానే ముగ్గురూ లోపలికి నడిచారు. భోజనం కానిస్తూ, సాయి, సీతారాంలు కబుర్లలో పడ్డారు.

సరళ వండిన వంటకాలలో రుచి కని పించక, ప్లేటులో వడ్డించిన అన్నాన్ని అతిక ష్టంమీద మింగుతున్నాడు జగన్నాథం. బంగాళాదుంపల వేపుడుని, కొబ్బరికాయ పచ్చడిని ఎవ్వరూ పాడుచేయలేరు అన్న నానుడిని నమ్ముతూ జీవితం గడిపిన జగన్నాథంకి, సరళ పళ్ళెంలో వేసిన దుంప లవేపుడు, కొబ్బరిపచ్చడి ఆ నమ్మకాన్ని కూకటివేళ్ళతో పెళ్లగించింది. సంవత్సరాల తరబడి, ఇలాంటి సరళ వంట తింటూ ఇంకా బతికివున్న సీతారాంని చూసి జాలివేసింది జగన్నాథంకి.

పెరుగు వేసుకుని, దానిలో ఆవకాయ కలిపి అన్నం తినడం అయిందని ఊపిరి పీల్చుకోబోతుంటే, ఒక గిన్నెమీదున్న మూ తని తొలగించి దానిలోంచి రెండేసి గులాబ్ జామ్‌లని చిన్న చిన్న గాజుకప్పులలోనికి వేసి కప్పులని సాయి, జగన్నాథంల పళ్ళాల దగ్గరగా ఉంచింది సరళ. జగన్నాథంకి భయం పట్టుకుంది. చక్కెరవ్యాధి ఉందని తప్పించుకుందామన్నా, ఒకగంట క్రితం చక్కెరతో ఉన్న కాఫీ తాగి ఆ అవకాశం జారవిడుచుకున్నందుకు చిరాకు వేసింది. భగవంతుడిని తలచుకోవడం అలవాటు లేని జగన్నాథం మదిలో భగవంతుడు మెదిలా డు. గులాబ్‌జామ్‌ని రెండు ముక్కలు చేసి, చెంచాతో ఒక ముక్కని నోటిలో ఉంచుకున్నా డు. వెంటనే భానుమతి అత్తగారి కథలు జ్ఞాపకానికి వచ్చాయి. గుండ్రాయిలా ఉన్న గులాబ్‌జామ్ లోపలికి పాకం వ్యాపించక లోపలిభాగం పాలరాయిలా గట్టిగా తగి లింది. అతికష్టంమీద రెండు గులాబ్‌జామ్ లని తిని, గ్లాసుడు నీళ్లు తాగేడు జగన్నాథం. తొందరగా తినేయడం కనిపెట్టి మరొక గులా బ్‌జామ్ వేసి సరళ ఇబ్బంది పెడుతుందేమో నని భయపడిన జగన్నాథంని, ఆ మంచిపని చేయకుండా వదిలేసింది సరళ. డైనింగ్‌టే బిల్ దగ్గరనుంచి నలుగురూ హాలులోనికి వచ్చి సోఫాలలో సర్దుకున్నాక,

"సాయిగారూ, నాకు మీరు ఒక చిన్న సహాయం చేయాలి'' అంటూ సీతారాం మొ దలుపెట్టాడు.

"నాకున్న ముగ్గురు బావమరదులలో

ఇద్దరు ఇండియాలో ఉన్నారు. పెద్ద బావమరది వ్యవసాయం చేసుకుంటూ అక్కడే స్థిరపడ్డాడు. రెండవ బావమరది, ఇండియాలో డిగ్రీ పూర్తిచేసి, ఎమ్.బి.ఏ. చేయడానికి ఈ దేశం వచ్చి మూడు సంవత్సరాలైంది. ప్రీరిక్విజిట్ కోర్సులు వగైరా అంటూ, ఎలాగోలాగ డేకుకుంటూ డిగ్రీ రేపు డిసెంబర్‌లో పూర్తి చేయబోతున్నాడు. ఇక్కడే ఉన్నాడు కాబట్టి లాయర్ల సహాయంతో మెల్లిగా గ్రీన్‌కార్డ్ సంపాదించవచ్చు. మా మూడవ బావమరదికి మీ సహాయం కావాలి''



"ఏం చేస్తున్నాడు?" అనడిగాడు సాయి.

"బికాం డిగ్రీ పుచ్చుకున్నాక, ఏవో కంప్యూటర్ కోర్సులు చేస్తున్నాడు. కోర్సులు కష్టంగా ఉన్నాయంటాడు. మీరు రిక్రూటింగ్‌లో ఉన్నారు కాబట్టి ఒక చెయ్యి అందిస్తే ఇక్కడకి తీసుకురావచ్చు"

"ఉండండి, అతని వివరాలు తెస్తాను" అంటూ సరళ లోపలికి వెళ్ళింది.

సీతారాం లేచి, ఒక ప్లేస్టిక్‌సంచీ మూత ఊడతీసి దానిలో ఉన్న పదార్థాలని చేపతొట్టె లోనికి ఒంచేడు. ఆరేడు చిన్న చేపలు బిలబి



లా కదులుతూ, తొట్టెలోనికి చేరగానే ఈదడం మొదలుపెట్టాయి. తొట్టిలో ఉన్న చేప, వాటివేపు పరిగెత్తి ఒకటి తరువాత ఇంకొకటిని కబళించేసింది. దూరంనుంచి అది చూస్తున్న జగన్నాథం గుండె జలదరించింది.

"చేప ఆవురావురంటూ ఉన్నట్లుంది'' అన్నాడు సీతారాం.

మడతలు పడిన రెండు కాగితాలని తీసుకువచ్చి సరళ వాటిని భర్తకి అందచేయగా వాటిని అతను సాయికి అందిచ్చాడు.

"ఎలాగోలాగ వాడిని ఇక్కడికి తీసుకువస్తే జీవితాంతం మీ పేరు చెప్పుకుంటాడు'' అంది సరళ.

"ఇదివరలో నేను ఇండియానుంచి కంప్యూటర్ డిగ్రీలున్నవాళ్ళని రిక్రూట్ చేశాను. కాని దానిలో ఉన్న ఇబ్బందులకి తట్టుకోలేక ఇప్పుడు ఈ దేశంలో కంప్యూటర్స్‌లో డిగ్రీ ఉన్నవాళ్ళమీదే కేంద్రీకరిస్తున్నాను'' అన్నాడు సాయి.

"అలా అంటే ఎలాగ? మనవాళ్ళే మనకి సహాయం చేయకపోతే ఇంకెవరు చేస్తారు?" అనడిగాడు సీతారాం.

"నేను ప్రయత్నిద్దామన్నా, మీ బావమరది క్వాలిఫికేషన్‌కి ఇక్కడ ఉద్యోగం కష్టం"

"క్వాలిఫికేషన్‌కేముంది? మీరు ఏది చెబితే అది. నాలుగు నెలలలో సర్టిఫికెట్లు సంపాదిస్తాడు. అది నాకు వదిలేయండి'' అన్నాడు సీతారాం.

ఇరకాటంలో పడ్డ సాయిని చూసి జాలివేసింది జగన్నాథంకి.

"ఈరోజుల్లో ఆరకల్, జావా వచ్చిన వాళ్ళకి, శాప్ ప్రోగ్రాంలో అనుభవం ఉన్న అభ్యర్థులకి మంచి గిరాకీ ఉంది. ఇక్కడికి వచ్చేక పనిచేయడం తెలియకపోతే కథ మొదటికి వస్తుంది. అలాంటి వ్యక్తులని ఈ దేశం తీసుకువచ్చి రికమెండ్ చేసిన కంపెనీ ప్రతిష్ఠ దెబ్బతింటుంది. ఇతర అభ్యర్థులకి తరువాత అవకాశాలు ఇవ్వరు. అందుచేత మీ బావమరిదిని పని బాగా నేర్చుకోమని గట్టిగా చెప్పండి. అవకాశాలు వాటంతట అవే వస్తాయి'' అంటూ అర్హతల గురించి వివరించాడు సాయి.

"మీరు కావాలనుకోవాలే కాని ఏదైనా సాధ్యమౌతుంది'' అంది సరళ మరోసారి.

"ఆరకల్, జావా చేయమనండి. అవి ముగించాక ప్రయత్నిద్దాం" అంటూ ఆ టాపిక్‌మీద చర్చని తుంచాడు సాయి.

"మీరు మరచిపోకుండా ఆయన మీకు మళ్ళీ ఫోన్ చేస్తారు'' అంది సరళ.

మరొక అరగంట గడిచాక సరళ, సీతారాంల దగ్గర సెలవు తీసుకుని కారులో ఎక్కారు సాయి, జగన్నాథం. కారు మెల్లిగా వేగం పుంజుకుంది.

"ఇది ఒక పెద్ద బిజినెస్. ఇక్కడ ఉన్న ఏజెంట్, ఇండియాలో ఉన్న అభ్యర్థికి సంవత్సరానికి ఏభైవేల డాలర్లు ఇస్తానని వీసా తెప్పిస్తాడు. అభ్యర్థి ఈ దేశం వచ్చాక అతని అప్లికేషన్‌ని నాలుగుచోట్లకి పంపి ఇంటర్వ్యూ ఏర్పాటుచేసి అతనిని ఉద్యోగంలో ఇరికించేంతవరకు అతనికి జీతం ఈ ఏజెంట్ ఇచ్చుకోవాలి. ఏమీ చేతకాని వాళ్ళని తెస్తే వాళ్ళకి ఉద్యోగాలు రావు. అథవా వచ్చినా రెండురోజుల్లో పనిచేతకాదని ఉద్వాసన చెబుతారు. అప్పుడు వాళ్ళు ఈ ఏజెంట్ మెడకి చుట్టుకుంటారు. ఈ బాధలు పడలేకే ఆ దారి వదిలేశాను'' అన్నాడు సాయి. తల ఊపాడు జగన్నాథం.

"ఆవిడకి ఇండియాలో బాగా ఆస్థి ఉంది. వృత్తిలో సీతారాంకి మంచి పేరున్నా, అర్థణాకి ఆమడ దూరం పరిగెడ్తాడంటారు. అది కిట్టని అసూయాపరులు పుట్టించిన పుకారు కావచ్చు. నిజం ఎంతో మనకి తెలియదు. అయితే ఆమె చెప్పినట్లే సీతారాం చేస్తాడన్నది నిర్వివాదాంశం. పెత్తనమంతా ఆవిడదే. క్వాలిఫికేషన్లు లేని తమ్ముడిని ఈ దేశం తీసుకువచ్చి ఎందుకు ఇబ్బంది పెట్టడం? మీరు అస్సలు నోరు విప్పనేలేదు'' అన్నాడు

సాయి.

"ఏమిటో నాకు మాటలాడాలనిపించలేదు. సీతారాంగారు చిన్న చేపల్ని, పెద్ద చేపకి ఆహారంగా వేయడం చూశాక, మనస్సు కుంచించుకుపోయి నోరు విప్పాలనిపించలేదు'' అన్నాడు జగన్నాథం.

సాయి మాటలాడలేదు.

"ఇంటిలో చిన్న పిల్లలు లేరు. మరి చేపలతొట్టె ఎందుకో?" అని ఆశ్చర్యపడ్డాడు.

"ఈ చేపలతొట్టి డాక్టర్ల ఆఫీసులకి ఆభరణం లాంటిది. దీనిని కొని ఆఫీసులో రెండు మూడు నెలలు ఉంచిన తరువాత ఇంటికి రవాణా చేస్తారు. ఆ తొట్టి ఖర్చుని ఆదాయంలోంచి మినహాయించి టాక్స్ తగ్గించుకుంటారు. ఈ తొట్టిలాగే టెలివిజన్, వి.సి.ఆర్.లు. ఇది అందరూ చేసేపనే'' అన్నాడు సాయి.

సాయి, జగన్నాథం ఎవరి ఆలోచనల్లో వాళ్ళు నిమగ్నులయ్యారు.

ప్రకృతిలో పెద్ద చేప చిన్న చేపల్ని కబళించడం సామాన్యమైనా, పనికట్టుకుని సీతారాం చిన్న చేపపిల్లల్ని 'తిను' అంటూ పెద్దచేప నోటికి అందించడం జగన్నాథంని కలచివేసింది. చెరువులో, నదిలో, సముద్రంలో ఉన్న చిన్న చేపలు అటూ ఇటూ పరిగెత్తి, పెద్దచేప బారినుంచి తప్పించుకోవడానికి రవ్వంత అయినా ఆస్కారం ఉంది. ఇరుకుతొట్టిలో అలాంటి ఆస్కారమేదీ? పెద్ద చేపకి ఆహారంగా చిన్న చేపని డాక్టరైన సీతారాం వేయడం మరింత బాధించింది జగన్నాథంని.

ఇంటికి అందం పెంచడానికి అలాంటి క్రూరమైన చేపల్ని పెంచడం ఎంతవరకూ సమంజసం? అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు జగన్నాథం.

★ ★ ★

పెరటి ఆవరణలో ఒక మూల సుమారు నూరు చదరపు అడుగుల జాగాలో కూరలపాదుల్ని, పూలమొక్కల్ని సరిదిద్దుతోంది చంద్రిక. సెప్టెంబర్ మాసం, సాయంకాలం ఐదయింది. రైలు అర్థాంతరంగా దిగవలసివచ్చి సామాన్లు ఆదరాబాదరాగా సర్దుకున్నట్లు సూర్యుడు తొందరపడుతూ కిందకి ఒరగబోతున్నాడు. చలికాలంకి నాందిగా, గతవారం రోజులలో అన్ని చెట్లు తమ ఆకులను దాదాపు పూర్తిగా రాల్చేయి. పళ్లు ఊడిన ముదుసలి నోరులా చెట్లన్నీ ఖాళీ. తల్లిని కరచిపట్టుకున్న కోతిపిల్లలా, అక్కడా ఇక్కడా కాసిన్ని ఆకులు మాత్రం చెట్లని వదలనంటున్నాయి. పూర్తిగా మోడువారబోతున్న చెట్లు.

బలంగా వీచిన గాలికెరటం తాకిడికి చెట్లమీద మిగిలిన ఆకులు శబ్దం చేయకుండా కదిలేయి. చెట్లమీద నుంచి రాలి భూమిమీదున్న ఎండుటాకులు గలగలా శబ్దంచేసుకుంటూ కాస్త దూరం గాలితోపాటు పరిగెత్తి అలిసిపోయి ఆగిపోయినట్లనిపించింది జగన్నాథంకి.

"ఒకటో అరో అయితే ఫరవాలేదు, కాని గుట్టలు గుట్టలుగా ఆకులు గడ్డిమీద నిలిచిపోతే కష్టం. త్వరలో మంచు కురుస్తుంది. ఆ మంచు ఆకుల గుట్టల మీద నిలిచి పేరుకుపోతే క్రిందన ఉన్న లాన్ చచ్చిపోతుంది. వ్యక్తిగతంగా మన ఊహలు ఎలాంటివైనా ఇలాంటి వాటి గురించి మనం పట్టించుకోకపోతే, ఇరుగూ పొరుగూ దుఃఖపడతారు. సరి అయిన సంరక్షణ లేకుండా ఉన్న ఇంటి దరిదాపులలో ఉన్న ఇళ్ళ ధరలు పడిపోతాయి'' అంటూ రాలిపోయిన ఆకులని ప్లాస్టిక్ సంచులలోనికి కూరడం మొదలుపెట్టింది చంద్రిక. సముద్ర కెరటాలలా, ఆరార గాలి కెరటాలు వచ్చినపుడు, రోడ్లమీద దొర్లుతున్న ఆకుల గలగల ఉధృతంగా పెరిగేక, తిరిగి నిశ్శబ్దత చోటుచేసుకుంటోంది. రోడ్లమీద కార్లు వెళ్తుంటే, దారీతెన్నూ లేని ఆకులు కొన్ని కార్లచక్రాల క్రిందపడి నలిగిపోగా, కొన్ని రోడ్డు ఒడ్డుకు కొట్టుకువచ్చి, తాత్కాలికంగా కార్ల బెడద తప్పిందని

ఊపిరి పీల్చుకుంటున్నట్లు అనుభూతి కలిగింది జగన్నాధంకి.

"పెద్దపెద్ద మెషీన్లతో రోడ్లమీద చేరిన ఆకుల్ని, పిండిపిండి చేసి, మూటకట్టి, ఊరికి దూరంగానిర్ణీతమైన ప్రదేశాలలో వాటిని గిరవాటేస్తారు. చెత్త ఎక్కడ పారవేయాలి? అన్నది ఇక్కడ పెద్ద సమస్యే. ఈనాటి గురించేకాక రాబోయే రోజులమాటేమిటి? మన పిల్లలు బాధపడతారేమో! అని ఆలోచిస్తారు ఇక్కడ ప్రజ" అంది చంద్రిక.

ఇతరుల గురించి, భావితరం గురించి ఆలోచిస్తున్న చంద్రికని చూసి ముచ్చటేసింది జగన్నాధంకి.

"మీరు ఎప్పుడూ ఏదో ఆలోచనలో మునిగి ఉంటారు. దేని గురించి అంత తీవ్రాలోచన?" అనడిగింది చంద్రిక జగన్నాధం వేపు చూస్తూ.

జగన్నాధం సమాధానమీయకుండా చిరునవ్వు నవ్వేడు.

ఆకులని సంచులలోనికి ఎక్కించేక, టొమాటో, వంగ మొక్కల మీదున్న కుక్కమూతి పిందెల్ని కత్తెరతో కోసి ఒక వారగా ఉంచి, పక్కనే ఉన్న జాగాని పారలాంటి గరిటతో తవ్వడం మొదలు పెట్టింది చంద్రిక.

"ఇప్పుడు ఆ జాగాని ఎందుకు తవ్వుతున్నావు చంద్రికా?" అనడిగేడు జగన్నాధం.

"మరొక వారం పది రోజులలో పూలమొక్కల దుంపలు తెచ్చి నాటుతాను. ఏప్రిల్‌లో మంచు కురవడం ఆగి, ఉష్ణోగ్రత పెరుగుతుంటే వసంతకాలంలో ఆ దుంపలు ఆటోమేటిక్‌గా మొలకరిస్తాయి'' అంది చంద్రిక.

"విభిన్న దృక్పధాలు, విభిన్న మతాలు, విభిన్న తెగలు ఉన్నప్పటికీ రెండు వందల ఏళ్లలో అమెరికా ప్రజలు తమ జీవన విధానాన్ని క్రమబద్ధం చేసుకున్నారు'' అనుకుంటూ శబ్దం చేయకుండా గాలికి ఊగిసలాడుతున్న చెట్ల వేపు చూస్తూ ఆలోచనల్లోకి ఒరిగేడు జగన్నాధం.

"మానవ జీవితపు ఆఖరి దశని రాలబోతున్న ఆకుతో పోలుస్తారు కొందరు. అందుకేనేమో, కారు చక్రాల కింద ఆకులుపడి నలిగిపోయినపుడు బాధ, తప్పించుకుని ఒడ్డుకు చేరినపుడు వాటిని చూసి తనకి ఆనందం కలిగింది. రాలబోతున్న ఆకుకి, మానవ జీవితపు ఆఖరిదశకీ చాలా పోలికలున్నా, ఆకులు ఎవరినీ ఏమీ కోరవు, ఇతరులని బాధించవు. మట్టిలో కలవకముందు మానవజీవితం, ఇంకొకరిమీద ఆధారపడి, ఇబ్బందిపెట్టి, నికృష్ట దశలో పయనిస్తేగాని ముగియదు'' అన్న ఆలోచన రాగానే గుండె బరువెక్కింది జగన్నాధంకి.

"గాలిలో చల్లదనం ఎక్కువవుతోంది. రండి లోపలికి వెళ్దాం", అంటూ పనిముట్లని అందుకుంది చంద్రిక.

"ఇప్పుడే వస్తాను, నువ్వు లోపలికి వెళ్లు'' అన్నాడు జగన్నాధం.

చంద్రిక లోపలికి వెళ్లేక, కాస్సేపు పచార్లు చేసి కింద రాలిన ఆకుల్ని ప్రేమతో నిమిరి, మెల్లిగా ఇంటిలోకి నడిచేడు జగన్నాధం.



**"మాస్టారూ,** ఈవేళ సాయంకాలం చంద్రికకి, అనుకోకుండా సీమంతం లాంటి ఫంక్షన్‌కి వెళ్లాల్సిన పరిస్థితి వచ్చిందిట. అందుచేత మన రాత్రి భోజనానికి బైటకి వెళ్దాం"

అంటూ ఆఫీసునుంచి సాయి ఫోన్ చేశాడు.

"బైటకి వెళ్లి తినడమెందుకు? నేను కాస్త ఉడకేసి పడేస్తాను. బైటకి వెళ్లకుండా ఇంటి లోనే తిందాం. నువ్వేమీ సంకోచించకు'' అన్నాడు జగన్నాధం.

"అలా సరిపెట్టుకోవాలంటే ఫ్రిజ్‌లో ఏవో పదార్థాలు ఉంచుతుంది చంద్రిక. తిండి ముఖ్యంకాదు. మనం ఇల్లు వదిలి బైటపడ దాం. నేను ఇంటికి ఐదు గంటలకి వస్తాను. నేను వచ్చేంతవరకు మీరు వంటకి పూనుకో కండి'' అంటూ సంభాషణని ఆపేడు సాయి.

కాస్సేపు నిద్రపోయి, తరువాత టెలివి జన్ మీద వస్తున్న సోప్ ఆపెరాలని చూ స్తుంటే,

"సారీ కాస్త ఆలస్యమైంది'' అంటూ ఐదున్నరకి తలుపుతోసుకుంటూ లోపలికి వచ్చేడు సాయి. జగన్నాధం ఏదో చెప్పబో తుంటే.

"నేను మొహం కడుక్కుని వస్తాను, మరొక అరగంటలో బయలుదేరదాం. మా ల్‌లో ఒక చిన్న పని ఉంది. అది ముగించి డిన్నర్‌కి వెళదాం. మీరేమీ అభ్యంతరం చెప్పకండి'' అంటూ బాత్రూం లోనికి వెళ్లి తలుపువేసుకున్నాడు సాయి.

సాయంకాలం ఆరుంపావయింది. టొయాటో కారు శబ్దం చేయకుండా గంటకి అరవై ఐదు మైళ్లవేగంతో పరుగెడుతూంటే పది నిమిషాలు ప్రయాణం చేసేక, హైవే దిగి, రోడ్డుకి దగ్గరగా ఆనుకుని ఉన్న మాల్ పార్కింగ్ ప్రదేశంలో కారుని నిలిపాడు సాయి. జగన్నాధం, సాయి మాల్‌లోకి ప్రవే శించేరు. మాల్ జనంతో క్రిక్కిరిసిలాడు తోంది.

"నాకు గ్రీటింగ్ కార్డులు కొనడానికి పది నిమిషాలుపడ్తుంది. మీరు నాతో దుకాణంలో కి వచ్చినా సరే, లేదంటే. ఆ బల్లలమీద కూర్చుని ప్రజలని గమనిస్తుంటే పది నిమి షాలు ఇట్టే గడిచిపోతాయి'' అంటూ హెరాలీ యార్క్ దుకాణం ముందు ఆగేడు సాయి.

"తొందరేమీ లేదు, సావకాశంగా పని పూర్తిచేసుకునిరా. నేను ఇక్కడ కూర్చుంటా ను'' అంటూ ఒక ఖాళీ జాగాఎన్నుకుని, దానిలో జగన్నాధం సర్దుకుని కూర్చున్నాడు.

జగన్నాధంలాగే చాలామంది మాల్ ప్రాంగణంలో ఉన్న బల్లలమీద కూర్చుని ఉన్నారు. జగన్నాధం కూర్చున్న ప్రదేశానికి దగ్గరగా ఒక ఫౌంటేన్ నీళ్లు చిమ్ముతోంది. ఫౌంటేన్ వెదజల్లిన నీళ్లు కిందకి చేరి నిలిచి ఉన్న ప్రదేశంలో ప్రజలు విసిరిన నాణేలు తళతళా మెరుస్తున్నాయి. ఫౌంటెన్ దగ్గరగా దాని చుట్టూ పూల మొక్కలని అమర్చడం వలన ఆ ప్రదేశం వింత సోయగాన్ని ప్రదర్శి స్తోంది.

"నీళ్లలోకి నాణేలు విసిరే అలవాటు ఇక్కడ కూడా ఉందన్నమాట" అనుకుంటూ మాల్‌లో నడుస్తున్న ప్రజలని గమనించసాగే డు. ప్రతీ అరనిమిషానికీ ఒక భారతీయుడు జగన్నాధంని దాటి వెళ్తుంటే సాయి వచ్చేలో పల ఎంతమంది భారతీయులు కనిపిస్తారో అని లెఖ్ఖ పెట్టడం మొదలుపెట్టేడు. కని పించిన భారతీయులలో చాలామంది వయ స్సు ముప్పయి కంటే ఎక్కువలేదు. కొత్తగా పెళ్లయిన భార్యా, భర్తల జంటలు, తోపుడు బండీలో పాపతో తిరిగేవాళ్లు కేరింతలు కొడుతూ నడుస్తున్న యువకులు ఎక్కువ. అంతమంది భారతీయులు ఒక మాల్‌లో కనిపించేసరికి జగన్నాధంకి ఉత్సాహం పెరి గింది. పది నిమిషాల తరువాత సాయి హెరాలీయార్క్ దుకాణంలోంచి బైటకి వచ్చే సరికి, జగన్నాధంని ఇరవై ఎనిమిది మంది భారతీయులు దాటి వెళ్లేరు.

"ఈ ప్రాంతంలో చాలా ఎక్కువ భారతీ యులు ఉన్నారా?" అనడిగేడు.

ఒక రాయి బలంగా విసిరితే, అది ము గ్గురు భారతీయులకి తగులుతుందని ఎవరో చమత్కరించే న్యూజెర్సీ, న్యూయార్క్ రా ష్ట్రాలలో భారతీయులు పుష్కలంగా ఉన్నా రు. ఈ ప్రాంతంలో సుమారు రెండు-రెండు

న్నర లక్షలమంది భారతీయులు ఉంటారేమో ఈ ప్రదేశంలో ఉన్న గేస్ స్టేషన్లు, న్యూస్ పేపరు దుకాణాలు, డంకన్ డోనట్ కాఫీ అంగడులు, చిన్నచిన్న మొటేల్స్ భారతీయులే నడుపుతారు. చాలామటుకు బిజినెస్ గుజరాతీయులదే. ఈ ప్రాంతంలో కంప్యూటర్ కంపెనీలలో తెలుగు వాళ్ళు ఎక్కువగా కనిపిస్తారు. హిందూ దేశస్థులు ఎక్కువగా ఏ మాల్‌లో అయినా కనిపిస్తే ఆ మాల్ చవకరకం వస్తువుల్ని అమ్ముతుందన్న అపఖ్యాతి ఉంది. పదండి వెళదాం" అంటూ కారు వేపు దారితీశాడు సాయి.

కారుని హైవేమీదకి మళ్ళించి

"మీరు రోజూ సాంబారు, కూరలు, అన్నం తింటున్నారు. ఈవేళ పీజా తిందాం" అంటూ కాస్సేపు కారుని నడిపి, 'పీజాహట్' అన్న బోర్డ్ కనిపించగా, దానివేపు కారుని తిప్పాడు సాయి.

"మీరు అతి తక్కువగా మాట్లాడతారు. మీ ఊహలు ఇతరులతో పంచుకోరు. ఇలా అయితే ఎలా మాస్టారూ'' అంటూ పీజాహట్ రెస్టారెంట్‌లో చతికిలపడ్డాడు సాయి.

యథాప్రకారం చిరునవ్వు నవ్వాడు జగన్నాథం.

గుజరాతీ వెయిటరెస్ వచ్చి సాయికి కావలసిన ఆర్డరు కాగితంమీద రాసుకుని వెళ్ళింది. నలువేపులా చూశాడు జగన్నాథం. ఒక వ్యక్తితప్ప పీజా హట్‌లో పనిచేస్తున్న వాళ్లందరూ భారతీయులే. మిగతా బల్లలమీద కూర్చుని పీజా తింటున్న ఎనిమిది కుటుంబాలలో, ఒకే ఒక నలుపు రంగు అమెరికన్ కుటుంబం. తతిమ్మా ప్రజానీకం అంతా భారతీయులే.

"ఈ పీజా ప్రదేశానికి మన దేశస్థులు తెగ వస్తారు'' అన్నాడు సాయి.

సాయి, జగన్నాథం కూర్చున్న ప్రదేశానికి, రెస్టారెంట్ మేనేజర్ నిలుచున్న ప్రదేశానికి మధ్య పదడుగుల దూరం ఉంది. మేనేజర్ దగ్గర ఏదో ఘర్షణ మొదలయితే సాయి, జగన్నాథంలు అటువేపు చూశారు. ఘర్షణ మేనేజర్‌కి ఇంకొక వ్యక్తికి మధ్యజరుగుతోంది. మూడవవ్యక్తి ప్రేక్షకునిలా అక్కడే నిలుచున్నాడు.

"నేను ఇచ్చిన కూపన్ ఎందుకు తీసుకోవు?" అనడిగాడు ఖాతాదారు. ఖాతాదారుని కంఠంలో సౌమ్యతలేదు, దురుసుతనం స్పష్టంగా కనిపిస్తోంది. సుమారు ఇరవై ఐదు, ఇరవై ఎనిమిదేళ్ళ వయస్సు, అయిదడుగుల పదంగుళాల పొడవు, నూట అరవై పౌన్లబరువు, చంద్రుపట్టి తైలసంస్కారంలేని జుత్తు, తెలుపు ఛాయ తక్కువైన మొహం. ఒకసారి ఆ మనిషిని చూస్తే రెండవసారి చూడాలనిపించే మొహం కాదది. విజయవాడ సెంటర్లో కాని, విశాఖపట్నం జగదాంబా టాకీస్ దగ్గర కాని రోడ్డు మీద నడిచి వెళ్ళే లక్షలమందిలో ఒక వ్యక్తిలా, ఏ ప్రత్యేకతా లేకుండా ఉన్నాడు.

"ఒక ఆర్డరుకి ఒకే ఒక కూపన్ తీసుకుంటాం. మీ ఆర్డరుకి ఒక కూపన్ తీసుకున్నాను. మరో కూపన్ తీసుకునే మార్గంలేదు'' అన్నాడు మేనేజర్.

మేనేజర్ గుమ్మటంలా ఉన్నాడు. బహుశా నలభై ఏళ్ళ వయస్సు ఉండవచ్చు. మాటలాడేతీరులో ఎక్కడా నమ్రతలేదు. సరి కదా ఖాతాదారుని దురుసుతనంకి రెండింతల దురుసుతనం ఉంది. దానికి తోడు మాటలో చెప్పలేనంత యాస ఉంది.

"మేం రెండు పీజాలకి ఆర్డరిచ్చాం. ఒకొక్క పీజాకి ఒక కూపన్ తీసుకోవాల్సిందే'' అన్నాడు ఖాతాదారు పట్టు వదలకుండా.

"మీ స్నేహితుడు ఆర్డరిచ్చినప్పుడు ఒక కూపన్ తీసుకున్నాను. మరొకటి తీసుకోవడానికి వీలులేదని ఎన్నిసార్లు చెప్పాలి?" అన్నాడు మేనేజర్.

"మేమిద్దరమూ ఒకే బిల్డింగ్‌లో ఉంటున్నాం. నువ్వు నన్ను అవమానపరిచావు. నీ రెస్టారెంట్‌లో తినను. నా ఆర్డర్ కేన్సిల్ చేసేయి. నీ పై అధికారికి రిపోర్ట్ చేస్తాను.

ఏమనుకుంటున్నావో?" అంటూ గొంతు హెచ్చించాడు ఖాతాదారుడు.

"నో ప్రోబ్లెమ్'' అంటూ ఖాతాదారు ఇచ్చిన డబ్బు వాపసు చేసి ఇస్తూ,

"పెపరోనీ పీజా కేన్సిల్' అంటూ గట్టిగా అరిచాడు మేనేజర్. చిటపటలాడుతూ బైటకి కదిలివెళ్ళాడు ఖాతాదారుడు. సద్దుమణిగింది.

ఇంతలో వెయిటరెస్ వచ్చి పీజాని టేబిల్ మీద అమర్చివెళ్ళింది. సాయి, జగన్నాథం ప్లేటులో రెండు ముక్కల్ని, తన ప్లేటులో రెండుముక్కల్ని ఉంచాడు.

"వేడిగా ఉంటుంది, జాగ్రత్త' అంటూ పీజా ముక్కని కొరికాడు సాయి.

"ఒక పెసరట్. అల్లం, మిరపకాయలు ఎక్కువ" అంటూ చిన్న కాకాహెూటల్లో సర్వరు లోపల ఉన్న వంటవానికి వినిపించేలా అరిచినట్లు, మేనేజర్ "పీజా కేన్సిల్' అని అరిచినట్లు అనిపించింది జగన్నాథంకి. ఒక్కసారి,

"ఇది విజయనగరం కాదుకదా'' అని ఆశ్చర్యపడుతుంటే,

"ఆ ఖాతాదారు నాకు తెలుసు'' అన్నాడు సాయి. జగన్నాథం ప్రశ్నార్థకంగా సాయి వేపు చూశాడు. పీజా ముక్కలమీద మిరప పొడిని మరికొంత జల్లుతూ,

"అతను ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో ప్రోగ్రామర్. ఈ దేశం ఒక సంవత్సరం కింద వచ్చాడు. ఆంధ్రప్రదేశ్‌లో ఒక ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీలో కంప్యూటర్ సైన్స్ డిగ్రీ పుచ్చుకుని, ఒక సంవత్సరం హైదరాబాద్‌లో అవీ ఇవీ చేసి, ఒక ఏజెంట్ సహాయంతో ఈ దేశంచేరి కన్సల్టెంట్‌గా పనిచేస్తున్నాడు'' అంటూ సాయి ఆగాడు.

"ఏమాత్రం జీతం వస్తుందేమిటి?" అనడిగాడు జగన్నాథం.

"ఈ దేశంలో అతి అరుదుగా వేసే ప్రశ్నలలో అది ఒకటి. మనదేశంలో వేసే మొదటి ప్రశ్న అది. మీరు అతితక్కువగా మాటలాడినా, అసంకల్పితంగా ఆ ప్రశ్న మీ నోటినుంచి వెలువడింది. సంవత్సరానికి ఏభై, అరవై వేల డాలర్లు ఉంటుంది. ఈ దేశంలో రాణించాలంటే చొరవ అవసరమే. కాని చొరవకి, దురుసుతనానికి తేడా ఉంది. ఇందాక వ్యక్తి, మరొక పీజా హెూటల్‌లో, అమెరికన్ మేనేజర్ దగ్గర ఘర్షణ పెంచడానికి వెనుదీస్తాడు. ఇక్కడ అలా భయపడడు. ఏమాత్రం సంకోచించడు'' అన్నాడు సాయి.

"మనం, మన దేశస్థుని కంటే, పై దేశస్తునికి ఎక్కువ విలువనిస్తాం. మనదేశంలో దబాయింపు పద్ధతి సామాన్యం కాబట్టి అలా ఉంటే కాని జరగదన్న సిద్ధాంతాన్ని మనదేశస్తులమీద వాడప్రయత్నిస్తాం. ఇది చాలా విచారకరం" అన్నాడు జగన్నాథం.

మౌనంగా తల ఊపాడు సాయి.

"కాలంతోపాటు, నాగరికతతోపాటు మన ప్రవర్తన మారడంలో ఆశ్చర్యంలేదు. గత ఇరవై ఐదు , ముప్ఫయ్ ఏళ్ళలో సాటిమనిషిమీద సానుభూతి, ఆలోచన మనదేశంలో బాగా తగ్గింది. పాశ్చాత్యుల సినిమాలు చూసి, పేపర్లలో రాసినది చదివి మారడంపోయి, ఇంకా అసహనాన్ని పెంచుకుంటున్నాం" అన్నాడు జగన్నాథం.

"అమెరికాలో ప్రబలి ఉన్న చెడునే మనం అనుకరిస్తున్నాం కాని మంచిని నేర్చుకోవడంలేదు. ఈ దేశంలో సగటు మనిషికి సంఘమన్నా, ఎదుటివ్యక్తి అన్నా గౌరవముంది. మనకి వీలయినంత చేసి సంఘాన్ని బాగుచేద్దామన్న ఉత్సాహం ఉంది. ప్రభుత్వ సౌకర్యాలు ప్రజల ఉపయోగానికని, దానిని దుర్వినియోగించకూడదన్న సంగతి మరిచిపోరు. సంఘమంటే గౌరవం గురించి, ప్రభుత్వ సౌకర్యం వినియోగించడం గురించి నాకు తటస్థపడ్డ రెండు సంఘటనలు చెబుతాను.

ఒకరోజు మధ్యాహ్నం ఒంటిగంటకి చికాగోలో సిటీబస్‌లో ప్రయాణం చేస్తున్నాను. బస్‌లో ఐదుగురు మాత్రమే ప్రయాణం చేస్తు

న్నారు. డ్రైవరు తన దగ్గరగా కూర్చున్న వ్యక్తితో మాటలాడుతూ, బస్‌స్టాప్‌లలో ఎవరైనా బస్ గురించి నిరీక్షిస్తుంటే బస్‌ని ఆపి, వాళ్ళని ఎక్కించుకుంటూ ఎవ్వరూ బస్‌స్టాప్‌లో కనిపించకపోతే లాఘవంగా ముందుకు దూసుకుపోతున్నాడు. ఒక బస్‌స్టాప్‌లో పోస్ట్ డబ్బా వెనకాతల నిరీక్షిస్తున్న ప్రయాణీకుని చూడకుండా ముందుకు వెళ్తుంటే, బస్‌స్టాప్‌లో బస్‌కోసం ఒకవ్యక్తి నిలుచున్నాడని బస్‌లో ప్రయాణీకులు అరిచారు. బ్రేక్‌వేసిన బస్, బస్‌స్టాప్‌కి నూరడుగుల దూరంలో ఆగింది. బస్‌కోసం నిరీక్షిస్తున్న ప్రయాణీకుడు ఒగరుస్తూ పరిగెత్తి బస్‌లోపలికి ప్రవేశించి, కిరాయికి సుంకాన్ని మెషీన్‌లో వేయబోతుంటే,

"నిన్ను నేను చూడలేదు. అలా నిన్ను మరచిపోయి, బస్‌స్టాప్ దాటి వెళ్ళిపోవడం అనుకోకుండా జరిగింది. సారీ... అందుకు పరిహారంగా నీ ప్రయాణం ఫ్రీ. డబ్బులెందుకు'' అన్నాడు డ్రైవరు.

హైదరాబాదులో బస్‌డ్రైవరు కావాలని బస్‌స్టాపుని దాటి, నిర్ణీతప్రదేశానికి దూరంగా బస్‌ని నిలపడం చాలాసార్లు చూశాను. బస్‌లో ప్రయాణం చేస్తున్న ఇతర ప్రయాణీకులకు కాని, కండక్టర్‌కి కాని చీమకుట్టినట్టయినా అనిపించలేదు. బస్‌లు నడుస్తున్నాయి. నేను దానిని నడుపుతున్నాను. అది ప్రజలకి ఒక వరంలాంటిదే అనుకునే డ్రైవరు ధోరణి ఇక్కడ మచ్చుకి కూడా కనపడదు. నేచూసిన మరో సంఘటనలో ఇంకొకరకమైన నీతి కనిపించింది. నీతి అనకూడదేమో. అమెరికాలో పెంపుడు జంతువులు చాలా ఎక్కువకదా! ఒకరోజు సాయంకాలం మసకచీకటిలో మంచు కురుస్తుంటే పగలంతా ఇంట్లో కూర్చుని విసుగేసి నాలుగు అడుగులు బైటకెళ్దామని ఉన్ని దుస్తులు ధరించి బైటకి వచ్చాను. కాస్త దూరం నడిచేక, కుక్కతో సమానంగా పరిగెడుతూ నాకు ఎదురుపడి,

"హలో'' అంటూ పలకరించింది ఒక స్త్రీ.

"హలో'' అంటూ తలపంకించేను నేను.

ఎవరిమానాన వాళ్లం వెళ్తున్నాం. మరో పది సెకన్లు తరువాత,

"కమాన్ టిమ్మీ, కమాన్ టిమ్మీ'' అంటూ ఆమె కుక్కని అదిలిస్తున్న మాటలు విని వెనక్కి తిరిగి ఆమె దిశగా చూశాను. ఆమెతో పరిగెడ్తున్న కుక్క పరుగుని ఆపి దీర్ఘశంకని గడ్డిమీద తీర్చుకుంది. ఆ స్త్రీ జేబులోంచి ఒక ప్లేస్టిక్‌సంచీ బైటకి తీసి దానిలో కుక్క విసర్జించిన పదార్థాన్ని ఎత్తి కుక్కతోపాటు పరిగెత్తివెళ్లింది. పోల్చడానికి కాకపోయినా కొన్నాళ్ళక్రితం విశాఖపట్నం బీచిలో జరిగిన సన్నివేశం జ్ఞాపకానికి వచ్చింది.

నా క్లాస్‌మేట్ ఒకతను, ఆర్మీలో లెఫ్టినెంట్ కల్నల్ పదవినుంచి రిటైరయి విశాఖపట్నంలో స్థిరపడ్డాడు. అతనికి ఉన్న ఇద్దరు పిల్లలు ఉద్యోగాల రీత్యా పై ఊర్లకి వెళ్ళారు. ఒంటరితనం పోగొట్టుకోడానికో ఇంకే కారణమో కాని అతను ఒక కుక్కని పెంచుతున్నాడు. నేనూ, అతనూ ఒకరోజు సాయంకాలం నడకకి బీచ్‌వేపు వెళ్ళాం. మాతోపాటు ఆ కుక్క కూడా నడుస్తోంది. ఉన్నట్టుండి ఆ కుక్క నడకని ఆపుచేసి బీచ్‌లో ఒక మంచి ప్రదేశంలో దొడ్డికి వెళ్ళింది.మేమూ ఆగేం. దాని పని అది పూర్తి చేసుకుని తోక ఆడించుకుంటూ అతని దగ్గరకి రాగానే అది వదిలిన దాని గురించి పట్టించుకోకుండా ముందరకి వెళ్ళబోతుంటే,

"అది అంతేనా?" అన్నాను.

"లేకపోతే దానిని ఎత్తుతానేమిటి? ఒకవేళ ఎత్తేనే అనుకో, దానిని ఎక్కడకి తీసుకెళ్లి పారవేస్తాను? వానపడి కొట్టుకుపోతుంది'' అని సమాధానమిచ్చాడు.

నాకు విచారమేయలేదు. ఆశ్చర్యం వేసింది.

బీచ్‌లో చెత్తా, చెదారం పారేసి బీచ్‌ని పాడు చేస్తున్నారని అతను గతంలో వాపో

వడం చూశాను.

ఆ దేశంలో జనాభా ఎక్కువ. దానితోపాటు సమస్యలు ఎక్కువే ఒప్పుకుంటాను.

"ప్రభుత్వం ఏమీ చేయలేదు, చేయడంలేదు'' అంటూ నీరసపడడం కనిపిస్తుంది. సమస్యలకి పరిష్కారం గురించి పూనుకోవడం చాలా తక్కువ" అన్నాడు జగన్నాథం.

"ఏకబిగిన మీరు ఇంతగా మాటలాడడం నేను మొదటిసారి చూశాను. ఇండియాలో మనుష్యుల సాంద్రత అమెరికాలో మనుష్యుల సాంద్రతకి పదిరెట్లు. మీ వాదనలో నిజమున్నా ఆ దేశంలో నెలకొన్న పరిస్థితులు, సమస్యల తీవ్రత ఇక్కడికన్నా చాలా ఎక్కువ" అన్నాడు సాయి.

"నువ్వు చెప్పినది ఒప్పుకున్నా వీటి గురించి కనీసం ఆలోచన ఎంతమందికి వస్తుందంటావ్?"

"ఆలోచించేవాళ్ళు లేకపోలేదు. కాని ఆలోచనలవల్ల ఏమీ ఒరగదని గ్రహించేక రాజీపడి మెల్లిగా వాటి జోలికి వెళ్ళడం తగ్గించేస్తారు. ఆవేశం అనర్థానికి కారణం అంటూ శాంతపడతారు'' అన్నాడు సాయి.

"అవును నిజమే. హైదరాబాద్ బస్‌లో ప్రయాణం చేస్తున్నప్పుడు తను ఎప్పుడైనా అరిచేడా? ఆ దేశం గురించి అక్కడ ఉన్నప్పుడు అంతగా పట్టించుకోకుండా ఈ దేశం వచ్చాక ఆ దేశంలో జరుగుతున్నదానిమీద ఎందుకు ఆరాటం? ఆ దేశంలో పరిస్థితులు, మనుష్యుల ధోరణిని శల్యపరీక్షచేసి తను ఈ దేశంలో ఉండడాన్ని సమర్థించుకుంటున్నాడా? ఇవేవీకాక భారతీయునిగా, అక్కడ పరిస్థితులు మెరుగవటం లేదని బాధపడుతున్నాడా? అనుకుంటూ దీర్ఘాలోచనలో మునిగాడు జగన్నాథం.

"మీ పీజా చల్లారిపోయింది మేష్టారూ'' అంటూ సాయి హెచ్చరిస్తే వాస్తవంలోనికి వచ్చి పడ్డాడు జగన్నాథం.

"వీలుంటే వచ్చే శనివారం నన్ను ఒకసారి న్యూయార్క్ తీసుకెళ్ళగలవా? నా స్నేహితుడు రామస్వామి టెక్సాస్‌నుంచి న్యూయార్క్ వస్తున్నాడు'' అనడిగాడు జగన్నాథం.

"ఇంటికి వెళ్ళాక వాళ్ళతో మాటలాడి ఎక్కడికి ఎలా వెళ్ళాలో వివరాలు కనుక్కుందాం. న్యూయార్క్‌లో నాకు తెలిసిన వ్యక్తులు చాలామంది ఉన్నారు. ఈ దేశం చూడడానికి వచ్చేరా మీ స్నేహితుడు?" అనడిగాడు సాయి. జగన్నాథం రామస్వామి కథ చెప్పాడు. అంతా విన్నాక

"కూతురి వయస్సెంత? పెళ్ళయిందా?" అనడిగాడు సాయి.

"ఆమె వయస్సు ఇరవైఏడు, పెళ్ళయింది''

"పెళ్ళికాని ఆడపిల్లలని, వాళ్ళ వయసు ఇరవైఆరుకి లోపయితేనే ఈ దేశంలోనికి రానిస్తారు''

"పాపం రామస్వామి చాలా నిరాశపడతాడు'' అంటూ విచారించాడు జగన్నాథం.



**న్యూ**యార్క్ క్వీన్స్‌లో కారు పార్క్ చేయడానికి ఖాళీ జాగా దొరకక అరగంటసేపు అటూ ఇటూ కారుని తిప్పాడు సాయి. ఒక ఫర్లాంగు నడిచి రామస్వామి ఎడ్రసు ఇచ్చిన ఫ్లాట్ కాలింగ్‌బెల్ నొక్కాడు సాయి. తలుపు తెరుచుకుంది.

సాయి వెనకాతలే గదిలోనికి నడిచాడు జగన్నాథం. సుమారు పదిమంది కుర్చీ లలో, సోఫాలలో కూర్చుని కబుర్లు చెప్పు కుంటున్నారు. ఒకళ్ళో ఇద్దరో తప్ప మిగతా అందరి చేతులలో డ్రింక్స్ ఉన్నాయి. తలుపు తెరవగానే అందరి కళ్ళూ కొత్తగా లోపలికి వస్తున్న సాయి, జగన్నాథంల మీద పడ్డాయి.

"ఏమిటి ఐదుగంటలకి వస్తానన్నావు, ఇప్పుడు ఆరయింది'' అంటూ ఒక నల భైఏళ్ళ వ్యక్తి సాయిని పలకరించాడు.

"లింకన్ టనల్‌లో బ్రేక్‌డౌన్ వచ్చి ఒక కారు ఆగిపోయింది. ట్రాఫిక్‌జామ్. దానికితో డు న్యూయార్క్‌లో పార్కింగ్ దొరికిచావ దు. ఈయన మా మేష్టారు జగన్నాథంగారు. ఈయన పేరు కృష్ణమూర్తి'' అంటూ పరి చయం చేశాడు సాయి. కృష్ణమూర్తి చాచిన చేతిని అందుకున్నాడు జగన్నాథం. జగ న్నాథం కళ్ళు పరిచయమున్న వ్యక్తులకోసం వెతికాయి. ఎవ్వరూ కనిపించలేదు. బా త్రూం తలుపు తెరచుకుని బైటకి వచ్చిన వ్యక్తి

"జగన్నాథం ఎలా ఉన్నావు?" అంటూ దగ్గరగా వచ్చి జగన్నాథం భుజాల్ని కుదిపా డు.

"జగన్నాథం, నేనూ ఇంటర్మీడియట్ కలిసి చదువుకున్నాం" అంటూ తననితాను పరిచయం చేసుకున్నాడు రామస్వామి. సోఫాలలో కూర్చున్న వ్యక్తులు దగ్గరగా జరిగి, సాయి, జగన్నాథంలకి స్థానం కల్పించారు. కృష్ణమూర్తి పరిచయాలు పూర్తి చేశాడు. సాయి లేచి జగన్నాథంకి ఆరెంజ్ జ్యూస్ తెచ్చి అందిచ్చాడు. కబుర్లు తిరిగి మొదలయ్యాయి.

ఒక అరగంట గడిచేసరికి ఇద్దరూ, ముగ్గు రూ గుంపులుగా చేరి వేర్వేరు టాపిక్‌లమీద చర్చిస్తున్నారు. రామస్వామి, జగన్నాథం తమకి తెలిసిన వ్యక్తుల గురించి, ప్రదేశాల గురించి మాట్లాడుకున్నాక ఉన్నట్టుండి,

"నీ ఉద్దేశంలో మన దేశంనుంచి భారతీ యులు ఎంతమంది ఈ దేశం వలస వచ్చి ఉంటారంటావ్?" అనడిగాడు రామస్వామి.

"ఏమో, నాకు తెలియదు''

"దాదాపు పధ్నాలుగు-పదిహేను లక్షల భారతీయులు ఈ దేశంలో ఉన్నారు''

"ఎంతమంది వస్తే మనకేం?"

"ఈ దేశానికి ప్రజలు వలస రావడానికి ముఖ్యకారణం ఏమిటి?"

"రైల్వేలో ఉద్యోగం చేసినప్పుడు, ఇంట ర్వ్యూలు చేసి చేసి ప్రశ్నలు వేయడం నీకు అలవాటయింది. ఇప్పుడు రిటైర్ అయ్యాక నేను దొరికినట్లున్నాను. నన్ను ప్రశ్నలు వేసి తిరిగి సమాధానం నువ్వు ఇచ్చేకంటే నీ మనస్సులో ఉన్నది బైటకి కక్కేయడం మంచిది'' అన్నాడు జగన్నాథం నవ్వుతూ.

"ఇప్పుడు అమెరికాలో ఉన్నవాళ్లు చాలా మంది, వాళ్ళ పూర్వీకులు ఈ దేశం వలస వచ్చినవాళ్ళే. ఇంగ్లాండ్‌లో, ఇతర దేశాలలో ఆంక్షలు భరించలేక పరిగెత్తుకు వచ్చారు. కాని మనదేశంనుంచి ఈ దేశానికి వలస రావడం దాదాపు ముప్ఫయి-నలభై ఏళ్ళ క్రితం మొదలయింది. మనదేశంలో ఉద్యోగ అవకాశాలు రాక ఉన్న కాసిన్ని ఉద్యోగాలని రాజకీయ నాయకులు తమకి కావలసిన వాళ్ళకి ఇప్పించడంవలన అర్హతలున్నా ఉద్యోగాలు రాక ఇబ్బందిపడుతూ ఏమాత్రం అవకాశం లభించినా ఈ దేశంకి తరలివ చ్చారు. ఆర్థిక ఇబ్బందులు ముఖ్య కారణం. అవునా?" అనడిగాడు రామస్వామి.

"నా అభిప్రాయమెందుకు? నువ్వు చెప్ప వలసినదేదో చెప్పు"

"అలా వచ్చినవాళ్ళు ఇప్పుడిప్పుడే ఇండియానుంచి ఈ దేశం వస్తున్న ప్రజలని చూసి ఎందుకు భయపడుతున్నారంటావ్?" అనడిగాడు రామస్వామి.

"భయపడడమా? నాకేమీ కనిపించలేదే. మనదేశంనుంచి ఎక్కువమంది ఈ దేశం వచ్చి స్థిరపడితే పిల్లల పెళ్ళిళ్లకి ఇండియా

పరుగు పెట్టనవసరంలేదు. ఇక్కడ గుడులు, గోపురాలు కట్టించడానికి అవసరమైన డాలర్లని సంపాదించడం సుగమం అవుతుంది. వాళ్ళు వస్తున్నందుకు ఆనందించాలి కాని భయమెందుకు?" అని తిరుగుప్రశ్న వేశాడు జగన్నాథం.

"భయమంటే భయంకాదు. నాకు తెలిసింది తక్కువే అని ఒప్పుకుంటాను. కాని ఒక పార్టీలో జరిగిన సంభాషణ నీకు వినిపిస్తాను. అప్పుడు చెప్పు, నీ అభిప్రాయం. రెండు నెలలక్రితం నేను టెక్సాస్ వచ్చిన కొత్తలో నన్ను ఒక పార్టీకి తీసుకెళ్ళింది మా చెల్లి నీరజ. రైళ్లలో విశాఖపట్నం-విజయవాడ పేసింజర్‌కి ఎంత విలువ ఉందో ఇంటిలో అంతే విలువ మా బావ డేనియల్‌కి ఉంది. గంటలు క్రితం లూప్‌లైన్‌లోనికి తోసేసిన బండిలా ఎవ్వరూ పట్టించుకోకుండా అతను ఒకవారగా కూర్చుంటే అతని పక్కనే ఖాళీ జాగా ఉంటే అక్కడకి వెళ్ళి కూర్చున్నాను. ఆ గురుడుకి రెండు బీర్లు పట్టించాక నేనంటే అభిమానం పెరిగింది కాబోలు. నాతో సంభాషణ మొదలుపెట్టాడు. అతను మన ఈడువాడే. అయినప్పటికీ నాతో మాట్లాడాలంటే సంకోచించేవాడు. మందు మనిషికి నిజాయితీని, లేని ధైర్యాన్ని ఇస్తుంది.

"రామస్వామిగారూ, వాళ్ళ సంభాషణ కాస్త జాగ్రత్తగా వినండి. ఏపిల్‌పండు బైట ఉన్న తొక్కకి లోపల ఉన్న గుజ్జుకి తేడా ఉన్నట్లే వీళ్లు బయటకి ప్రదర్శించే ఉదారత్వానికి, లోపల దాగుకుని ఉన్న ఊహలకి తేడా తెలుస్తుంది. ఇది నాకు పాత కథే. మీరు కొత్తగా ఈ దేశం వచ్చారు. దానికితోడు కంప్యూటర్ కంపెనీలలో ఉద్యోగాలకి ప్రయత్నిస్తున్నారు కాబట్టి మీకు జ్ఞానోదయం అవుతుంది'' అంటూ మరికొంత బీరుని గడగడా పట్టించాడు. నిజం చెప్పకేం గతంలో డేనియల్ అంటే నాకు మంచి అభిప్రాయం లేదు. మెతక మనిషని చొరవ లేని వాడని నాకు అనుమానం. కాని ఆ మనిషిలో నిశితమైన పరిశీలనాదృష్టి ఉందని గ్రహించి ఆశ్చర్యపడ్డాను. అతనిని తక్కువగా అంచనా వేసినందుకు విచారించాను. ఆడా, మగా కలిపి పార్టీలో దాదాపు ఇరవై మంది ఉన్నారు. ఆరుబైట కూర్చుని రకరకాల పానీయాలని సేవిస్తూ మగాళ్ళంతా ఒకచోట, ఇంకొక గుంపుగా ఆడవాళ్లు మరొక చోట కూర్చుని తమతమ కష్టాలని, నష్టాలని ఒలకపోసుకుంటున్నారు. నాకు పేర్లు జ్ఞాపకం ఉండవు. అందులో చాలామందిని మొదటిసారి కలిశాను. చర్చలో మునిగిన వాళ్ళ వయస్సు దరిదాపు నలభైఏళ్ళు ఉంటాయి. ఎండాకాలంకదా, టీ షర్ట్‌లలో ఆరోగ్యంగా చూడముచ్చటగా ఉన్నారు. చాలాకాలంగా ఈ దేశంలో ఉండడంవలన ఇంగ్లీషు మాట్లాడేటప్పుడు భారతీయ యాస కన్పించడంలేదు. ప్రతీ వాక్యానికీ ముందరో, చివర్నో 'యా' ఖచ్చితంగా అంటుకుని ప్రతీ నిమిషానికి బయటపడుతోంది. మనదేశంనుంచి వచ్చినవాళ్ళు తొందరగా మాట్లాడితే అమెరికన్లు అర్థం చేసుకోరని, నెమ్మదిగా మాట్లాడడం అలవాటు చేసుకుని ఇంగ్లీషు వాక్యాలని మెల్లగా తూచి తూచి పలుకుతున్నారు. ఎదుట వ్యక్తి ఏమాత్రం పరధ్యానం ప్రకటించినా అర్థమవనట్లు మొహం పెట్టినా, 'యునో', ఇన్ జనరల్ అంటూ మరోసారి వివరిస్తున్నారు. ఇదంతా నాకు కొత్తకదా భలేగా ఉందిలే. అదేదో సినిమాలో అమాంతం అంతర్ధానమై ఎవరికీ కనిపించకుండా ఎక్కడ పడితే అక్కడకి వెళ్ళి హీరోలా, నాకూ అన్ని గుంపుల దగ్గర కనబడకుండా కూర్చుని వాళ్ళ మాటలు వినాలని ఎంతో అనిపించింది. ఒకపక్క ఆడవాళ్ళ మాటలు, రెండోపక్క మగాళ్ళ అరుపులు కలగాపులగంగా నా చెవులలో జొరపడుతుంటే ఒక సంభాషణ వేపే కేంద్రీకరించడానికి సమయం పట్టింది.

"ఏమిటి గురువుగారు, నిన్న మీ స్టాక్ ఆరుపాయింట్లు పెరిగిందే, ఫెంటాస్టిక్"

"ఏం పెరగడమో ఏమో. ఇండోనేషియా, రష్యన్ ఎకానమీలు బాగుపడితే కాని ఇక్కడ

స్టాక్ మార్కెట్ నిజంగా మీదకి వెళ్ళదు. వీళ్ళు శుంఠలలండీ, లేకపోతే అంతేసి అప్పులు ఏమీ చూడకుండా ఇచ్చేయడమేమిటి?"

"మనదేశాన్ని చూడండి. వ్యాపారం చేయడానికి అమెరికన్ కంపెనీలని రానిస్తాయని ఒకసారి, రానివ్వం అంటూ మర్నాడు ప్రకటిస్తారు. బుర్రల్లేవు, ఒక పాలసీలేదు, ఓ పాడూలేదు. అదృష్టవశాత్తూ సాఫ్ట్‌వేర్ బిజినెస్ వచ్చింది కాబట్టి డాలర్లు వస్తున్నాయి"

"మనదేశంలో వీధికొక ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీ వెలిసింది. దానిలో కంప్యూటర్ కోర్సులు అంటూ రెండో, మూడో పి.సి.లు పెట్టి డిగ్రీలు ఇచ్చేస్తున్నారు. ఇలా డిగ్రీ చేతికి రావడమేమిటి, కాళ్లలో చక్రాలు వేసుకుని ఈ దేశం రావడానికి ప్రయత్నం మొదలవుతుంది"

"ఇక్కడ ఎలా ఉందో ఏమోకాని మా టెక్సాస్ రాష్ట్రంలో రోకలిబండ ఈనితే బైటపడ్డ పిల్లలులా ఎక్కడ చూసినా మన దేశస్థులే. ఇరవై ఐదు ఇరవై ఆరేళ్ల వయస్సు కుర్రాళ్లు క్యేమ్రీ, హోండా కార్లని కొనేసి తోలేస్తున్నారు. మాల్‌కి వెళ్లినా వీళ్లే, మెక్డోనాల్డ్‌కి కాఫీకి వెళ్లినా వీళ్లే. ఇదివరలో మనదేశస్థులు కనిపిస్తే చాలా ఆనందం కలిగేది. చిరునవ్వో, కుశల ప్రశ్నలు వేయడమో చేసేవాళ్లం. మన రాష్ట్రం నుంచి అయితే మరో నిమిషం ఎక్స్‌ట్రా మాటలాడేవాళ్లం. ఇప్పుడు ఇంతమంది గుంటూరు బ్రాడీపేట సెంటరులో కనిపించినట్లు, తంబలుతంబలుగా కనిపిస్తుంటే ఎవరినీ ప్రత్యేకంగా పలకరించాలనిపించదు. ఐ యామ్ సర్‌ప్రైయిజ్‌డ్ ఎండ్ డిస్సప్పాయింటెడ్, జె.సి. పెన్నీలో కొన్న పోలోషర్ట్‌ని పేంట్‌లోకి తోసి మంచి నిగారింపుతో ఉన్న వ్యక్తి అన్నాడు.

"రోలువచ్చి మద్దెలతో మొరపెట్టుకున్నట్లు, మనదేశంనుంచి వచ్చిన జనాభా గురించి మాకు చెబుతారేం? న్యూజెర్సీలో కొన్ని కొన్ని ప్రదేశాలలో గుజరాతీ, తెలుగు ప్రాంతీయ భాష. బట్టలు ఉతుక్కోవడానికి లాండ్రీకి వెళ్తేసంభాషణ అంతా తెలుగులోనే సాగుతుందిట"

"నిజం?"

"నీ మీద ఒట్టు"

"జీసస్, నేను ఈ దేశం చదువుకి వచ్చి పద్దెనిమిదేళ్లయింది. నెలకి ఆరు వందల డాలర్ల స్కాలర్‌షిప్‌తో మొదలుపెట్టి, గ్రీన్ కార్డు వచ్చి ఉద్యోగంలో స్థిరపడడానికి నాలుగేళ్లు పట్టింది. ఇంజనీరింగ్ కంపెనీలో చేరి అదే కంపెనీలో ఉండిపోవడం వలన పధ్నాలుగేళ్లలో కంపెనీలో హోదా, పరపతీ పెరిగేయి. కాని జీతం అమెరికన్ డిగ్రీ అయినా లేని ఈ సాఫ్ట్‌వేర్ కుర్రాళ్ల కంటే పెద్ద ఎక్కువ లేదు. అగనంపూడి కాలేజీలో రెండు పి.సి.ల మీద చదువంతా వెలిగించి ప్యాంట్‌లోకి చొక్కా సరిగ్గా దోపడమైనా రాని వీళ్లకి హైద్రాబాదునుంచి ఇక్కడకి దిగగానే సంవత్సరానికి అరవై వేల డాలర్ల జీతం"

"ఏమిటీ అగనంపూడిలో ఇంజనీరింగ్ కాలేజీపెట్టేరా?" అనడిగేడు ఇంకో వ్యక్తి బీరుసీసాని నోట్లోంచి తీస్తూ.

"అగనంపూడి కాకపోతే అప్పలాపురం. పేరులో ఏముంది? అన్ని కాలేజీలు ఒక్కలాగే ఉన్నాయి కదా!"

"ఒక స్టేండర్డ్ కాని చట్టుబండలు కాని లేవు. ఆ కాలేజీలలో పాఠాలు చెప్పే మాస్టర్లకి వచ్చి చస్తేకదా!"

"నాకు ఇంకో భయంపట్టుకుంది"

"ఏమిటది?"

"ఈ రెండు వేల సంవత్సరం సంఖ్య మార్చడం ధర్మమా అని బిలబిలా మనదేశంనుంచి దిగినవాళ్లు ఆ రెండు వేల సంవత్సరం వచ్చేక ఏమవుతారో! వీళ్లందరికీ గ్రీన్‌కార్డు రావడం అసంభవం. కాంట్రాక్ట్ పద్ధతిమీద ఉద్యోగాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నా, గ్రీన్‌కార్డు తెప్పించడానికి చాలా కంపెనీలు సుముఖంగా లేవు. అలాంటప్పుడు వీళ్లంతా రోడ్డుమీద పడతారు"

"అలా రోడ్డుమీద పడడంవలనే

ఇంగ్లండ్‌లో, కెనడాలో ఇండియన్లంటే చిన్న చూపు, నిరసన ఉంది. ఇంతవరకు ఇండియా నుంచి అమెరికాకి డాక్టర్లు, ఇంజనీర్లు ఎక్కువగా వచ్చేరు. గత మూడు, నాలుగు సంవత్సరాలలో ఇదిగో ఈ సాఫ్ట్‌వేర్ ప్రోగ్రామర్లు ఎక్కువయ్యేరు. మంచి క్వాలిఫికేషన్లు లేక పోతే సాఫ్ట్‌వేర్ ప్రజలు మరీ ఎక్కువైతే చాలాకాలంగా మనకి ఉన్న మంచి పేరు ధ్వంసం అవడం తథ్యం" అంటూ వాపోయేడు ఒక వ్యక్తి.

"అయితే గురువుగారూ వీళ్లు రావడంలో ఒక సుగుణం ఉంది'' అంటూ పొటాటో చిప్‌ని కొంకేడు ఓసి పెన్నీ పోలోషర్ట్.

"ఏమిటిట?"

"ఇదివరలో ఇండియాలో ఉన్న ఆడపిల్లలకి పెళ్లి సంబంధాలు చూస్తున్నప్పుడు 'అబ్బాయికి గ్రీన్ కార్డు ఉందా?' అన్న ప్రశ్న పెళ్లికొడుకు గురించి చేసే వాకబులో దొర్లేది. ఇప్పుడు గ్రీన్‌కార్డు ఉన్న వ్యక్తంటే వెనుదీస్తున్నారు. పెళ్లయినా ఆడపిల్ల మూడు మూడున్నర సంవత్సరాలు ఇండియాలో అలమటిస్తేకాని ఆమెకి అమెరికా రావడం సాధ్యపడడంలేదు. ఈ ప్రోగ్రామర్లకి ఇచ్చే హెచ్1వీసా వ్యక్తి తనతో భార్యని వెంటనే తీసుకురావచ్చు. మూడు సంవత్సరాలు, తిండి, ఖర్చు, బాధ్యత తప్పుతాయికదా!"

"మీరు మరీ ఇంత సినికల్‌గా మాటలాడడం ఏమీ బాగులేదు'' అన్నాడు జీడిపప్పుని నంజుకుంటున్న వ్యక్తి.

"తొందరగా తోలేయవచ్చని హెచ్ వీసా వ్యక్తికిచ్చి పెళ్లి చేస్తే మరొక రకమైన ఇబ్బంది ఉందండోయ్''

"ఆ! ఒకసారి ఈ దేశం వచ్చిపడితే ఇక్కడే తిష్టవేయవచ్చు''

"అమ్మమ్మ! డోంట్ జంప్ టు కంక్లూషన్స్. హెచ్ వీసా ఆరు సంవత్సరాలకి మాత్రమే ఇస్తారు. నాకు నూటికి నూరుశాతం తెలియదుకాని, గ్రీన్ కార్డుకి ఏదైనా కంపెనీ నడుము కడితే మరొక సంవత్సరం ఉండనిస్తారు కాబోలు. ఇది మీరు విన్నారో, లేదో నాకు తెలియదు. ఈ కొత్తగా వచ్చిన శాల్తీలకి కంపెనీల ద్వారా గ్రీన్‌కార్డు రావడానికి ఆరేళ్ల కంటే ఎక్కువే పడుతుందిట. అనగా ఆరేళ్లు గడిచేక ఈ నవ్యనటులలో చాలామంది ఇండియా వెళ్లి మళ్లీ హెచ్1వీసామీద ఈ దేశం రావాల్సిన అగత్యం ఎంతైనా ఉంది. అప్పటికి ఈ దేశంలో పరిస్థితులు మారేయనుకోండి హుష్‌కాకి అయిపోతాయి హెచ్1వీసాలు''

"శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలు. శాన్‌ఫ్రాన్సిస్కో ఏరియాలో డేటా బ్యాంక్‌లలో వీళ్ల క్వాలిఫికేషన్లు నమోదు చేసుకుంటున్నారు. ఈ దేశంలో ఉన్న ఆడపిల్లల పెళ్లిళ్లకి అది బాగా ఉపయోగపడుతోందిట"

"ఏదిఏమైనా మనదేశంనుంచి ఒక్కసారి ఇంతమంది ప్రజలు రావడంలో చిక్కులు ఉత్పన్నమవుతాయి. బీరు సీసా ఖాళీగా ఉంది, మరొకటి తెచ్చేదా?" అంటూ కుర్చీ లోంచి లేచాడు ఆ మనిషి.

"నిన్ను అనవసరంగా శ్రమ పెడుతున్నానేమో'' అన్నాడు బీరు ఖాళీచేసి సీసాని చప్పరిస్తున్న వ్యక్తి.

"డోంట్ వర్రీ''

నాకు దగ్గరగా ఉన్న మగాళ్ళ గ్రూప్ చర్చ ఇంకేదో ఇతర అంశాలమీదకి మారింది. నా చెవులలో ఆడవాళ్ళ మాటలు పడనారంభించాయి.

"మూడు నెలలక్రితం మా మేనకోడలు పెళ్ళికి ఇండియా వెళ్లాను. పెళ్లిపందిరిలో కూర్చున్న ప్రతీ కుటుంబంనుంచి కనీసం ఒక వ్యక్తయినా అమెరికాలో ఉన్నాడు. "మావాడు శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్నాడు'' "మావాడు డల్లాస్‌లో పనిచేస్తున్నాడు'' అంటూ ఒకరికి పోటీగా ఇంకొకరు చెబుతున్నారు. "అమెరికా మరీ చవకయిపోయింది'' అంటూ స్త్రీలు కూడా ఇలా అభిప్రాయపడడం చూసి ఆశ్చర్యమేసింది'' అంటూ ఆగాడు రామస్వామి.

"ఇందులో పెద్ద ఆశ్చర్యమేముంది?

తొండ ముదిరితే ఊసరవిల్లి అవుతుందిగాని మొసలి అవదుకదా అన్నాడు వెనకటికెవరో. అమెరికా వచ్చినా, ఆస్ట్రేలియా పరిగెత్తినా, మన ఊహలు, సంప్రదాయాలు మన జీన్స్‌లో ఉన్నవి ఎక్కడకి పోతాయి? ఆరు తరాలు వెళితేకాని వాటి ప్రభావం పోదంటారు పెద్దలు. వాటిలో నిజమెంతో నాకు తెలియదు. నీ పిట్టకథలో పాత్రలు, అమెరికా వెళ్ళడమంటే చాలా కష్టమన్న దశలో చదువుకి ఈ దేశం వచ్చి, కష్టపడి ఇక్కడ నిలదొక్కుకున్నారు. ఏమీ కష్టపడకుండా ఈ దేశం వచ్చేస్తున్నవాళ్ళని చూసి కాస్త బాధ వేసి ఉండవచ్చు. అమెరికాలో ఉన్నవాళ్లు ఇండియా వెళ్తే ఒకానొకరోజుల్లో, రాజకుమారుడిని, రాజకుమార్తెని చూసినట్లు ప్రాముఖ్యత, ఎక్కువ మర్యాద కనపరిచేవారు. ఇప్పుడు ముక్కుచీదడం వచ్చిన ప్రతీ వ్యక్తీ అమెరికా వెళ్ళివస్తుంటే వాళ్ళ ప్రాముఖ్యతకి గండి పడిపోలేదా? సరిఅయిన ఉద్యోగాలు లభించక కెనాడాలో రోడ్లమీదపడిన ఇండియన్లని అసహ్యించుకున్నట్లు మంది ఎక్కువై తమకీ అలాంటి పరిస్థితి ఎదురవుతుందేమోనని గాభరా! రామస్వామీ అహం నాయనా అహం. మానవ సహజం. అహంలేని మనిషి లేడు. నిజానికి అహం లేని మనిషి ఇండియాలో కనిపిస్తే మొట్టికాయలు పెడతారు. అది వదిలేయ్. నీ సంగతి ఏమిటి? ఈ దేశం వచ్చి దాదాపు మూడు నెలలయింది, ఏమైనా ఉద్యోగ అవకాశం కనిపిస్తోందా? లేదా?" అనడిగాడు జగన్నాథం.

"లేదు. నాకు ఉద్యోగం రాకపోవడానికి కారణాలు కొన్ని తెలిశాయి. అందులో మొదటిది వయస్సు. అరవైఏళ్ళు ఉన్న నన్ను తీసుకోవడంకంటే, ఇరవైఅయిదేళ్ళ వ్యక్తికి అవకాశం ఇస్తారని కనుక్కున్నాను. ఇక్కడ ఏళ్ళు తగ్గించడానికి జుత్తుకి రంగువేస్తారు. అదీ చేశాను. రెండవది, నాకు అమెరికన్ డిగ్రీ కాని, అనుభవం కాని లేవు. నన్ను కన్సల్టెంట్‌గా తీసుకున్న మరుక్షణంనుంచి వాళ్ళకి నేను ఉపయోగపడేలా ఉండాలి. ఇక్కడ పరిస్థితులు తెలియని నాకు అది ఎలా సాధ్యం?" అన్నాడు రామస్వామి.

"అంతేనంటావా?"

మౌనంగా తల ఊపాడు రామస్వామి. జగన్నాథం ఆలోచనలో పడ్డాడు. రామస్వామి గతం కళ్ళముందర నిలుచుంది. ఇంజనీరింగ్ ముగించాక, కాంపిటీటివ్ పరీక్షలలో మంచి రాంక్‌రాక, రైల్వేలో చేరిన రామస్వామికి ఇద్దరు కూతుళ్ళూ అందమైనవాళ్ళే. చిన్న అల్లుడు ఇంజనీరింగ్ డిగ్రీ పుచ్చుకుని ఇంగ్లండ్‌లో స్థిరపడ్డాడు. పెద్ద అల్లుడు కూడా డాక్టరు. అతనికి అమెరికా వెళ్దామన్న కోరిక బలంగా ఉంది. పెద్ద కూతురు పుట్టాక తనకి మంచి రోజులు వచ్చేయన్న దృఢ నమ్మకం ఏర్పరుచుకున్న రామస్వామికి పెద్ద కూతురంటే అమితమైన వాత్సల్యం. ఆమె కావాలంటే కొండమీద కోతిని తెచ్చే ప్రయత్నం చేస్తాడు రామస్వామి. ఆమెకోసం ఎలాంటి పరుగుపెట్టడానికైనా తయారే!

"అందరూ అమెరికా వెళ్ళిపోతున్నారు. అక్కడకి వెళ్తే దేశాలనే కొనివేయవచ్చు. మీ అత్త మావయ్యలు ఇద్దరూ డాక్టర్లు. ఎలాగైనా మనల్ని అమెరికా పంపే ఏర్పాటు చేయమని మీ నాన్నకి చెప్పు" అంటూ పదేపదే అల్లుడు, భార్యని కొరికేస్తుంటే కూతురు పడేబాధని చూస్తూ ఊరుకోలేక ఏమీ చేయలేని పరిస్థితులలో చెల్లెలు ద్వారా తనకి అమెరికా వచ్చే అవకాశం రాగానే తను అమెరికా వచ్చి తరువాత కూతురిని తీసుకురావడానికి ఉపయోగపడ్తుందన్న నమ్మకంతో ఈ దేశం వచ్చాడు రామస్వామి. ప్రస్తుత పరిస్థితి చూస్తుంటే అది సాధ్యమయ్యేలా లేదు.

రైల్వే ఉద్యోగంలో చేరాక రామస్వామి చాలా ఘరానాగా బతికాడు. నౌకర్లు, చాకర్లు, రైలులో ఫస్ట్‌క్లాసులో ప్రయాణం, అడుగులకి మడుగులు ఒత్తే ఆఫీసు సిబ్బంది అన్నీ జతఅయి క్రమేణ రామస్వామిలో అహాన్ని

పెంచింది. తను గొప్పవాడినన్న ఊహ కడుపులో బాగా నాటుకుంది. రామస్వామికి చెల్లెలంటే మంచి అభిప్రాయం ఉండేది కాదు. అలాంటి రామస్వామి ఆ చెల్లెలి సహాయంతో ఈ దేశం వచ్చి కూతుర్ని ఈ దేశం రప్పించడానికి ఇబ్బందులకి గురవుతూ చేసిన ప్రయత్నం విఫలమవుతుంటే విచారమేసింది జగన్నాథంకి. ఉద్యోగ ప్రయత్నాలు చేసి అవేమీ కలిసిరాక విసుగేసి పరాజితుడై రామస్వామి ఇండియా తిరిగివేళ్తే అక్కడకి వెళ్ళాక పెద్ద అల్లుని సూటిపోటి మాటలు విన్నప్పుడు ఖిన్నుడవుతాడు. పిల్లల గురించి తపన, పిల్లల గురించి తల్లిదండ్రులు అవస్థపడటం సామాన్యమే అయినా దానికి ఒక అంతు లేదా? అని ఆశ్చర్యపడుతూ కళ్లు మూసుకున్నాడు జగన్నాథం.

రామస్వామి పరిస్థితితో లెఖ్కవేసి చూస్తే తనకి ఇబ్బందులు లేవనే అనుకోవాలి. రిటైర్ అయ్యాక ఉన్న ఒక కొడుకు దగ్గర శేషజీవితం గడుపుతున్నాడు. అది అందరూ ఇండియాలో చేసేపనే. నరేంద్ర బొంబాయిలో పనిచేస్తుంటే తను బొంబాయి వెళ్ళేవా



డు. నరేంద్ర అమెరికాలో ఉన్నాడు కాబట్టి తను అమెరికా తరలివచ్చాడు. అని సమాధా నపడబోయాడు జగన్నాథం. కాని ఆ వ్యా ఖ్యానం సరిగ్గా తృప్తినివ్వలేదు జగన్నా థంకి. ఇండియాలో తనకంటూ ఒక ప్ర పంచం ఉండేది, దానికి వేళ్ళు భూమిలో బలంగా పాతుకుని ఉండేవి. ఇక్కడ తన ప్రపంచం అతిచిన్నది. ప్రత్యేకత లేనిది. దానికి వేళ్లు ఉన్నాయా? లేదా? అన్నది అనుమానమే. వేళ్లు మొలవడానికి చాలా కాలం పడుతుంది. అంతకాలం తన దగ్గర లేదు.

అయితే తన జీవితానికి అర్థం ఏమిటి? చాలామందిని బాధపెట్టినట్లే, తన దగ్గర దానికి సరిఅయిన సమాధానం లేక ఆ ప్రశ్న వచ్చినప్పుడు చిరాకు బైటపడ్తుంది అను కుంటుంటే,

"జగన్నాథం, హరనాథ్ నీకు ఉత్తరం రాస్తే నువ్వు దానికి జవాబు రాయలేదుట. నిజమేనా? నిన్ను ఉత్తరం రాయమన్నాడు'' అంటూ జగన్నాథం భుజాన్ని తట్టాడు రామ స్వామి.

"నాకు హరనాథ్ దగ్గరనుంచి ఉత్తర మేమీ రాలేదే. నీకు హరనాథ్ బాగా తె లుసా?" అనడిగాడు జగన్నాథం.

"అప్పట్లో నాకు పాస్‌పోర్ట్ రావడం ఆల శ్యమైతే హైదరాబాదు వెళ్ళాను. అక్కడే హరనాథ్‌గారితో పరిచయం అయింది. విశా ఖపట్నంనుంచి వచ్చిన ఇద్దరు వ్యక్తులు కలిస్తే ఏం చేస్తారు? గతం గురించి కబుర్లలో పడ్డాం. "పాస్‌పోర్ట్ ఎందుకు?" అనడిగాడు. అమెరికా వెళ్ళే ఉద్దేశం ఉందని చెప్పాను. ఇది ఆరేడునెలల కిందటిమాట. దాదాపు రెండేళ్ళు సర్వీసు ఉందని రిటైరయ్యేలోపల కూతురి పెళ్ళి చేసేద్దామనుకుంటుంటే, కూతురు అమెరికా వెళ్ళే పరుగులో ఉందని చెప్పాడు. నీ పేరు మాటల్లో దొర్లింది. జగ న్నాథంగారు నాకు బాగా తెలుసు. ఆయనకి ఉత్తరం రాద్దామనుకుంటున్నాను'' అంటూ డైరీతీసి నీ ఎడ్రసు, ఫోన్ నెంబర్ నా దగ్గర ఉన్నదానితో చెక్ చేసుకున్నాడు. నేను ఈదేశం వస్తూ హైదరాబాదులో ఆగినప్పు డు ఆయనకి ఫోన్ చేస్తే "జగన్నాథంగారికి ఉత్తరం రాశాను, కాని ఆయన దగ్గరనుంచి జవాబు రాలేదు. ఫోన్‌చేస్తే ఆయనకి నా నమస్కారాలు అందచెయ్యండి అన్నాడు'' అంటూ చరిత్రని తిరగతోడాడు రామస్వామి.

"ఇండియానుంచి అమెరికావచ్చే ఉత్తరా లకి పదకొండు రూపాయలు అంటించడం చూసి ఎవరైనా ఆ స్టాంపులని ఊడపెరికి, ఉత్తరాన్ని గిరవాటేసేరేమో హరనాథ్ దగ్గర నుంచి నాకు ఉత్తరం రాలేదు. బహుశా పోస్ట్‌లో పోయిందేమో'' అన్నాడు జగ న్నాథం.

జగన్నాథం ఆలోచన హరనాథ్‌మీదకి వె ళ్ళింది.

హరనాథ్ తనకి నాలుగేళ్ళు జూనియర్. అతని పూర్వీకుల జన్మస్థలం బొబ్బిలి. ఆస్థి బాగా ఉన్న జమీందార్ల వంశం. హరనాథ్ తండ్రికి పేకాట వ్యసనం. ఆస్థంతా దానిలో పెట్టి కర్పూరహారతి అయ్యే దశలో గుండెజ బ్బుతో మరణిస్తూ భార్యని, కొడుకుని దా దాపు బికారులుగా వదిలివెళ్ళాడు. భూముల మీద తనఖాలు, ఇళ్ళమీద తెచ్చిన అప్పులు, వడ్డీలతో కలిపి కొండంతయాయి. హరనాథ్ కుటుంబస్థితి చూసి జాలిపడి, ఒక కుర్రలా యరు నడుము కట్టి పొలాలు, ఇళ్ళు అమ్మి వాటిమీదున్న అప్పులు తీర్చి, మిగతా పై కంని ఆమె పేర్న బ్యాంక్ ఖాతాలో వేశాడు. బీదరికం పొలిమేర్లలో ఉన్న హరనాథ్ కుటుంబం గురించి డబ్బున్న ఇతర బంధు వులు పట్టించుకోలేదు. ఆ బ్యాంక్‌లో నిలవచే సిన డబ్బుతోనే హరనాథ్ చదువు వెళ్ళింది. చాలా అందంగా ఉన్న హరనాథ్ తల్లి క్లుప్తంగా అతి సమర్థవంతంగా ఇల్లు నడి పేది. వీళ్ళ వ్యవహారాలు చక్కపెట్టిన లా యరు అప్పుడప్పుడు క్షేమసమాచారాలు కనుక్కోవడానికి వచ్చి కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పి వేళ్ళేవాడు. దానిని వింతగా

చెప్పుకున్నా అద్దెకి వచ్చినవాళ్ళు తరచూ పోర్షన్‌లు ఖాళీ చేసి వెళ్ళడంతో ఏ అవాంఛనీయమైన సంఘటనా జరగకుండా రోజులు గడిచాయి. అర్థంలేని అనుమానాలతో, అరవు తెచ్చుకున్న నీతులతో చెవులు కొరుక్కుంటున్న ప్రజలని చూసి అసహ్యమేసింది.

హరనాథ్‌కి ఇంగ్లీష్ అంటే భయం. తనని సాయం కోరినపుడు, తన చదువుతో కుస్తీపడుతూ, అప్పుడప్పుడు హరనాథ్‌కి సహాయం చేసేవాడు.

తను ఎమ్.ఏ. పరీక్షలు రాసి, ఫలితాల కోసం ఎదురుచూస్తున్నాడు. జూలైమాసం, మృగశిర వచ్చి మబ్బులని తెచ్చింది. తనని ఆశ్చర్యపరిచిన ఆ రోజుని తనెప్పుడూ మరిచిపోలేదు.

"మా అమ్మ మిమ్మల్ని ఒకసారి తీసుకు రమ్మంది'' అంటూ హరనాథ్ తన దగ్గరగా నిలబడ్డాడు.

"ఎందుకు?" అనడిగాడు.

"ఏమో, నాకు తెలియదు'' అన్నాడు హరనాథ్ కదలకుండా. తను ఆలోచనలో పడడం కనిపెట్టి

"ఒకే ఒక నిమిషం. ఇప్పుడే తిరిగి వచ్చేద్దురుగాని'' అంటూ చెయ్యిపట్టుకు లాగాడు.

హరనాథ్‌ని అనుసరించి వాళ్ళ పోర్షన్‌లోనికి అడుగుపెట్టాడు.

"కూర్చోండి'' అంది హరనాథ్ తల్లి కుర్చీ వేపు చూపిస్తూ, అతి జాగ్రత్తగా కూర్చున్నా, కీలు సరిగ్గాలేక కూర్చుంటుంటే 'కిర్' మంటూ కుర్చీ మూలిగింది.

"మా అబ్బాయికి మీరు ఇంగ్లీషులో సాయం చేశారు. దానివల్లే మావాడు పాసయ్యాడు. ఇవ్వరా'' అంది హరనాథ్ వేపు తిరిగి. ఒక చొక్కా, పేంట్‌లకి సరిపడ్డ బట్టలని హరనాథ్ నాకు అందివ్వబోయాడు.

"వద్దు, వద్దు. నేను చేసినదేమీలేదు. ఇది అనవసరం" అంటూ గాభరాగా కుర్చీలోంచి లేవబోయాడు తను.

"ఇది మీరుచేసిన సహాయానికి ప్రతిఫలం కాదు. నిజానికి ఆ బట్టలు చాలా చవకరకం బట్టలు. అయితే అంతకన్నా ఎక్కువ భరించే తాహతు నాకులేదు. ప్రతిఫలం ఉంటే కాని ఏ పనీ చేయని మనుష్యులని చూసి చూసి విసుగెత్తింది. నువ్వు నాకు తమ్ముడిలాంటివాడివి. తీసుకోబాబూ'' అంది.

ఆమె వేపు చూశాను. బైట వాతావరణంలాగే ఆమెకళ్ళు వర్షించేలా ఉన్నాయి.

ఆమె కంటిలో తిరుగుతున్న నీరుని చూసి, నా గొంతు గద్గదమయింది. నోట మాట రాలేదు.

ఒక మనిషి ఇంకోమనిషిని స్వలాభంకోసం ఉపయోగించుకోకుండా తనలాగే ఎదుటవ్యక్తిని ఆదరించే సంస్కారం డబ్బువలన కాని చదువువలన కాని రాదు.

నవ్వుదామన్నా నవ్వు రాక, కృత్రిమమైన చిరునవ్వొకటి పేలవంగా మొహంమీద పులుముకుని, బట్టలని అందుకుని బైటపడ్డాడు తను.

'భర్తలేదు. జీవితం వెళ్ళదీయడానికి అవసరమైన డబ్బులేదు. బంధువులచేత త్యజించబడ్డ ఆమెకి మర్నాడు అగమ్యగోచరం. ఆమె జీవితంలో చేదే చూస్తున్నా ఆమెలో చేదులేదు. కళ్ళలో నీళ్ళు తిరిగిన ఆమె మొహం ఈనాటికీ తన జ్ఞాపకాలలో దాగుకొని ఉంది' అనుకుంటుంటే,

"జగన్నాథం! హరనాథ్‌కి ఒక ఉత్తరం రాసిపడేయ్. వాళ్ళ అమ్మాయి గురించి రాస్తాడేమో'' అన్నాడు రామస్వామి రాత్రి నిద్రపోయేముందు. మళ్ళీ హరనాథ్ ఆలోచనల్లోనికి వచ్చాడు.

హరనాథ్ రాసిన ఉత్తరం ఏమై ఉంటుందబ్బా అని ఆలోచిస్తూంటే, ఐదారు నెలల క్రితం,

"నాన్నా, మీకు ఏదో ఉత్తరం వచ్చింది'', అంటూ నరేంద్ర ఒక ప్లాస్టిక్ సంచీ అంది

వ్వడం జ్ఞాపకానికి వచ్చింది. ప్లాస్టిక్ సంచీలో అంచులు చిరిగిపోయి, తన ఎడ్రసు ఉన్న కవరుమాత్రం కనిపిస్తోంది. పైన ప్లాస్టిక్ సంచీమీద, "ఇలాంటి శిధిలావస్థలో మీకు వచ్చిన ఉత్తరం ఇస్తున్నందుకు చాలా చాలా చింతిస్తున్నాం" అని రాసి ఉంది.

ఈ దేశంలో అవసరమైనా, కాకపోయినా "సారీ'' అంటూ ప్రజలు నాలికని తెగ కరిచేసుకున్నట్లు కనిపిస్తారు. చిరిగిపోయిన ఉత్తరాలని పోస్టాఫీస్ వాళ్ళు అలా పంపడం ఇక్కడ మామూలే. మనదేశంలో తయారుచేసే కవర్లు అతి నాజూకుగా ఉండడంతో, ఆటోమేటిక్ మెషీన్లలోంచి వెళ్ళేటప్పుడు అవి చిరిగిపోతాయి. "కవరులోపల ఉన్న ఉత్తరం దిక్కూ తెన్నూ తోచక ఎక్కడో తిరుగుతోంది. కవరుమాత్రం వచ్చింది'' అన్నాడు నరేంద్ర నవ్వుతూ. తను పరీక్షగా ప్లాస్టిక్ సంచీవేపు చూస్తుంటే,

"కవరు మీద చేతి రాతని చూడండి, ఆనవాళ్ళు తెలియవచ్చు'' అన్నాడు నరేంద్ర. కాస్సేపు పరీక్షగా చూసినా, ఆ చేతిరాత ఎవరిదో తెలియలేదు.

"బహుశా ఆ ఉత్తరం హరనాధ్ రాసిందేమో, రేపు మరచిపోకుండా హరనాధ్‌కి ఉత్తరం రాయాలి'' అనుకుంటూ జగన్నాధం నిద్రలోనీకి ఒరిగాడు

★ ★ ★

చంద్రిక ఆఫీసుకి వెళ్తూ జగన్నాధంని లైబ్రరీ దగ్గర వదిలి వెళ్ళి ఒక గంటయింది. ఆ గంటలో ఆవేళ్టి పేపర్లన్నీ చదివేక కుర్చీలో చారపడి నలువైపులా చూసేడు జగన్నాధం. లైబ్రరీలో పేపర్లు చదువుతున్న వ్యక్తి ఒక్క జగన్నాధమే. ఎయిర్‌కండిషనర్ చేస్తున్న శబ్దం తప్ప ఇంకేవిధమైన శబ్దంలేదు. తోపుడు బండీ మీదున్న పుస్తకాలని షెల్ఫ్‌లలో సరైన ప్రదేశాలలో సర్దుతోంది ఒక స్త్రీ. కళ్ళద్దాల్లోంచి మసకమసకగా అగుపిస్తున్న ఆ స్త్రీ వయస్సు అంచనా కట్టలేక దృష్టిని మరల్చేడు జగన్నాధం. సుమారు నూరు అడుగుల చతురస్రంలో అరవై, డెబ్బై అడుగుల మేరకు పుస్తకాల షెల్ఫ్‌లు ఉన్నాయి. మిగతా భాగంలో న్యూస్‌పేపర్లు, జీరాక్స్‌మెషిన్, వీడియోకేసెట్లు, అప్పుడే మార్కెట్‌లోకి విక్రయానికి వచ్చిన తాజా పుస్తకాలు పేర్చి ఉన్నాయి. పుస్తకాల రేక్‌ల దగ్గరగా, గోడలకి ఆనుకుని చదువుకోడానికి సోఫాలు ఒక పద్ధతిలో అమర్చబడి ఉన్నాయి. ఇద్దరు లైబ్రేరియన్లు కూర్చోవడానికి అనువుగా రెండు బల్లలు, రెండు కంప్యూటర్లు, టెలిఫోన్లు ఉన్నాయి. ఎంతలేదన్నా ఒక లక్ష పుస్తకాలు ఉండవచ్చు అనుకుంటూ కుర్చీలోంచి లేచి పుస్తకాల షెల్ఫ్ దగ్గిరకి నడిచేడు. కాల్‌నెంబర్ల ప్రకారం, వరుస తప్పకుండా పుస్తకాలు పేర్చి ఉంటే నచ్చిన ఒక పుస్తకాన్ని బైటకి లాగేడు జగన్నాధం. లేత ఆకులా తళతళా మెరిసిపోతోంది పుస్తకం. పుస్తకంమీద దుమ్ముగాని, ధూళిగాని లేవు. పుస్తకాన్ని తీసుకుని లైబ్రేరియన్ అన్న బోర్డు దగ్గర నిలబడ్డాడు జగన్నాధం. అంతవరకు షెల్ఫ్‌లలో పుస్తకాలని సర్దుతున్న స్త్రీ, ఆ పనిని ఆపుచేసి జగన్నాధం దగ్గరకి వచ్చి "వాట్ కెన్ ఐ డు ఫర్‌యు?" అనడిగింది.

"నా దగ్గర లైబ్రరీ కార్డులేదు. ఈ పుస్తకం నేను ఇంటికి తీసుకెళ్ళడం వీలవుతుందా?" అన్నాడు జగన్నాధం.

"నీ దగ్గర ఏదైనా ఐడెంటిటీ కార్డు ఉంటే లైబ్రరీ కార్డు తయారుచేయగలను. ఏదైనా ఉందా?" అంది సన్నగా, తీగలా ఉన్న ఆ స్త్రీ.

పర్సులోంచి సోషల్ సెక్యూరిటీ కార్డు అందిచ్చేడు జగన్నాధం.

సరిగ్గా ఐదు నిమిషాలలో లైబ్రరీ కార్డు తయారుచేసి పుస్తకాన్ని అందిచ్చింది ఆ స్త్రీ.

"ఈ లైబ్రరీలో ఎన్ని పుస్తకాలు ఉన్నాయి? నాకు ఒక పుస్తకం కావాలి. అది ఇక్కడ ఉందేమో చెప్పగలరా?"

"లక్షా ఏభై వేల పుస్తకాలు ఉన్నాయి. ఈ సంవత్సరం మరో ముప్పయి వేల పుస్తకాలు కొనబోతున్నాం. మీకు కావలసిన పుస్తకం

పేరు చెప్పండి'' అంది లైబ్రేరియన్.

పుస్తకం పేరు చెప్పేడు జగన్నాథం. ముప్ఫయి సెకన్లు గడిచేయి.

"సారీ ఆ పుస్తకం ఈ లైబ్రరీలో లేదు. మరో లైబ్రరీలో ఉంది. కావాలంటే తెప్పించి పెడతాను. కాని రెండు రోజులు పడుతుంది, కావాలా?" అంది రివటలా ఉన్న లైబ్రేరియన్.

"ష్యూర్, థ్యాంక్ యు వెరీమచ్" అన్నాడు జగన్నాథం.

"యు ఆర్ వెల్‌కమ్'' అంది ఆ లైబ్రేరియన్. తిరిగి పుస్తకాలు సర్దడానికి ఆమె కదలి వెళ్లింది.

ఆ నమ్రత, సహాయం చేయాలన్న ఉత్సాహం ఆమెలో చూసి ముచ్చటేసింది జగన్నాథంకి.

నమ్రత!

అవి తను కొత్తగా అమెరికాకి వచ్చినరోజులు. అమెరికాలో స్కూళ్లు ఎలా ఉంటాయో చూద్దామని ఇంటికిదగ్గరగా ఉన్న స్కూలుకి వెళ్లేడు. ఉదయం తొమ్మిది గంటలయింది.

నడిచే కాలిబాటకి ఇరువైపులా విద్యార్థుల క్లాస్‌రూములు, నిశ్శబ్దంగా ఉంది కారిడార్. దాదాపు ముప్ఫయి నలభై అడుగులు నడిచేక వెనకాల మెత్తని అడుగుల చప్పుడైతే వెనక్కి తిరిగేడు. ఎదురుగా ఎనిమిది, తొమ్మిదేళ్ల ఆడపిల్ల.

"మీరు ఎవరి గురించైనా వెతుకుతున్నారా? నేను మీకేమైనా సహాయం చేయగలనా?" అనడిగింది.

"నో! స్కూలు ఎలా ఉందో చూస్తున్నాను. థాంక్స్... నాకేమీ సహాయమక్ఖరలేదు'' అంటూ ముందుకు కదలివెళ్లేడు.

నమ్రతతో ఆ పిల్ల అడిగిన ప్రశ్న తీరు చాలాకాలం జ్ఞాపకం ఉంది తనకి.

జ్ఞాపకాలు విచిత్రమైనవి. అవి ఎందుకు జ్ఞాపకం ఉంటాయో!

తను రిటైర్ అయేక మొదటి పెన్షన్ ఖాతాలో జమ అయిందో, లేదో తెలుసుకుందామని బ్యాంక్‌కి వెళ్లిన రోజు తనకి ఇంకా జ్ఞాపకం ఉంది.

ఉదయం పదిన్నరయింది. అప్పటికి బ్యాంక్ తెరిచి అరగంటయింది.

పెళ్లి కొడుకు తోటలో దిగినట్లు ఆఫీసు సిబ్బంది మెల్లిగా హంసనడకలతో తమతమ స్థానాలలో చేరడానికి మొహమాటపడుతున్నారు. పెన్షన్ చూసే వ్యక్తి స్థానంలో ఎవరూలేరు. తను కాస్సేపు అక్కడే నిలబడి ఎవ్వరూ పట్టించుకోకపోతే ఆశ్చర్యపడ్డాడు. పక్క సీట్ వ్యక్తి లెడ్జర్లని, కాగితాలని, పిన్నులని అటూఇటూ కదుపుతూ చాలా బిజీగా ఉన్నట్లు కనిపించేడు. ఆయన సర్దుడు పది నిమిషాల తరువాత కూడా ఏమీ తగ్గకుండా అంతే ఉద్ధృతంగా ఉండడంచూసి,

"ఏమండీ ఈయన ఈ రోజు సెలవా?" అనడిగేడు.

సర్దుడురావు, సర్దుడుని ఆపి, తనవేపు గుర్రుగా చూసి "ఏమోనండి, ఎవరికి తెలుసూ, అంతగా తెలుసుకోవాలంటే మేనేజర్‌ని అడగండి, చెబుతారు'' అంటూ సీట్లో సర్దుకుని పేపరు విప్పేడు. ఎంత తేడా! పనిచేసే ధోరణిలో ఎంతతేడా! నమ్రతలో ఎంతతేడా?

నిరాశగా కళ్లు మూసుకున్నాడు జగన్నాథం. కాస్సేపటికి కళ్లు తెరిచి లైబ్రరీ పుస్తకాన్ని విప్పేడు.

★ ★ ★

"థాంక్స్ గివింగ్ రోజు'' దగ్గర పడుతుంటే ఎక్కడ చూసినా కోలాహలమే. షాపింగ్ మాల్‌లలో ఉన్న పెద్ద దుకాణాలలోనే కాకుండా, సాధారణ అంగళ్ళలో కూడా గ్రీటింగ్ కార్డులు అమ్మడం చూస్తున్న జగన్నాథంకి ఉదయం రామస్వామితో జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది.

"థాంక్స్ గివింగ్ రోగం, 'వేలంటైన్ డే' కార్డులు పంపే అంటురోగం ఇండియాలో కూడ వ్యాపించింది'' అంటూ మొదలుపెట్టా

డు రామస్వామి. పుల్లవిరిచినట్లు మాటలాడే రామస్వామి స్వభావం తెలిసిన జగన్నాథం,

"అదేమిటి రామస్వామీ, ఈదేశం పెరగడానికి, ప్రజలని సంఘటితపరచడానికి 'థేంక్స్ గివింగ్' రోజు ఉపయోగపడుతోంది. ఇక వేలంటైన్ కార్డుల సంగతంటావా? అదొక వేడుక. ధైర్యానికి, సాహసానికి నమూనాగా ఆరోజు తమకిష్టమైన వాళ్ళకి పూలు, చాక్‌లెట్లు తమ శక్త్యానుసారం ఇతర బహుమానాలు పంపి, ఎదుటి వ్యక్తంటే తమకి ప్రత్యేకమైన అభిమానం ఉందని తెలియపరుస్తారు. అది నీకూ, నాకూ ఉపకరించకపోవచ్చు. అదొక ప్రేమ ప్రకటనోయ్, దానికి అమెరికాలో చాలా విలువ ఉంది'' అన్నాడు జగన్నాథం.

"అమెరికాలో ప్రేమ అన్న పదానికి విలువలేదోయ్, సెక్స్ కేవలం సెక్స్. ఇదివరలో నీకున్న ఆలోచనలకి, ఈనాటి నీ ఆలోచనలకి తేడా కనిపిస్తోంది జగన్నాథం. జాగ్రత్త! పాకుడు రాళ్ళమీదపడి జారినట్లు జర్రున కిందకి దిగజారుతావు'' అన్నాడు రామస్వామి.

"టెలివిజన్‌మీద, సినిమాలలో చూపించిన దానిని ఆధారంగా తీసుకుని, సొంతం అర్థంచేసుకోకుండా అలా అనడం సబబుకాదు. ఆ సంగతి వదిలెయ్, అవన్నీ మనం మరోసారి ముఖాముఖిని చర్చిద్దాం. నీ ఉద్యోగం సంగతేమిటి? ఏమైనా పురోగమనం ఉందా? నువ్వు ఈ దేశంవచ్చి నాలుగునెలలు కావస్తోందేమో'' అంటూ సంభాషణని ఇంకోవేపు మళ్ళించాడు జగన్నాథం.

"లేదు. ఉద్యోగం ఇంకారాలేదు. ఈ దేశంలో కేవలం ప్రతిభను బట్టి ఉద్యోగాలు ఇవ్వాలని, ఇంకే ఇతర కారణాలని జమలోనికి తీసుకోకూడదని రాజ్యాంగంలో రాసి ఉన్నా, వయస్సుమీద పడుతున్న వ్యక్తులకి ఉద్యోగావకాశాలు తక్కువ. ఇది నీకు తెలుసా? ఉద్యోగ అప్లికేషన్‌లో పుట్టినతేదీ రాయనవసరంలేదు, వయస్సు చెప్పనక్ఖర లేదు. నేనూ అదే చేశాను. నన్ను ఇంటర్వ్యూ చేసినవ్యక్తి ఇంజనీరింగ్ ఎప్పుడు పూర్తిచేశారు? అనడిగాడు. చెప్పాను. అంతే, వాడికి అర్థమైంది నేను అరవై ఏళ్ళ వాడినని. "రిజల్ట్ త్వరలో తెలియపరుస్తాం" అంటూ ఇంటర్వ్యూ ముగించాడు. ఆ ఉద్యోగావకాశం అలా దెబ్బతింది. ఇంకో రెండు మూడు నెలలు చూసి ఏ ఉద్యోగమూ రాకపోతే ఇండియా వెళ్తాను'' అంటూ తన ఇంటర్వ్యూ అనుభవాన్ని వివరించాడు రామస్వామి.

"నువ్వు ఒక ధ్యేయంతో ఇక్కడికి వచ్చావు. అది నెరవేరితే బాగుండును. వీలు చిక్కితే మళ్ళీ ఫోన్ చెయ్యి'' అంటూ ఫోన్ సంభాషణ ముగించాడు జగన్నాథం.

చాలామంది లాగే బంగారం పండించడానికి ఈదేశం వచ్చాడు రామస్వామి. స్థానిక ఇండియన్ అమెరికన్లని వదిలేస్తే అందరూ అమెరికాకి వలసవచ్చినవాళ్ళే. చాలాకాలం క్రితం, చలి అతి తీవ్రంగా ఉన్నపుడు, వలస వచ్చిన ప్రజలు తమదగ్గర ఉన్న తిండిని, ప్రాంతీయ ఇండియన్లతో పంచుకుని, ఆకలి, మృత్యువు బారినుంచి తప్పించుకున్నారు. ఆ దశ జ్ఞాపకార్థం సంవత్సరంలో ఒక రోజు 'థేంక్స్ గివింగ్' అంటూ పండుగ జరుపుకోవడం ఆనవాయితీ అయింది. 'థేంక్స్ గివింగ్' రోజు అమెరికాలో కుటుంబసభ్యులు అందరూ కలిసి చేసేవిందులో అలనాడు కలిసి చేసిన విందులో ఉదహరించిన వంటకాలని వండడం పరిపాటి. 'థాంక్స్ గివింగ్' రోజునాడు, అమెరికాలో ప్రతీవ్యక్తీ తమ కుటుంబసభ్యులతో కలిసి భుజించడానికి తెగ ఆరాటపడతారు. ఇంటిపెద్ద వండిన 'నిప్పుకోడి'ని కత్తితో కోసి అందరిపళ్ళాలలో ఉంచేముందు తమ బతుకుకు సహాయంచేసిన వ్యక్తులని జ్ఞాపకం తెచ్చుకోవడం సామాన్యం. అమెరికాలో క్రిస్టమస్ పండుగ తరువాత ముఖ్యమైన పండుగ 'థేంక్స్‌గివింగ్' పండుగ. 'థేంక్స్‌గివింగ్'కి అమెరికాలో ఒక చరిత్ర ఉంది, ఒక ఆధారం ఉంది. కాని

ఇండియాలో ఈ వేడుకకి ఆధారమేమిటి? లాంఛనప్రాయంగా గ్రీటింగ్స్ పంపడం మినహా ఏమైనా చేస్తున్నారా? రామస్వామి, "ఇండియాలో ఇది ఒక రోగమైంది'' అని దానిలో నిజం లేకుండా వర్ణించాడా? రామస్వామి చెప్పినది నిజమైతే అది విచిత్రమే. ఏ ఆధారములూ లేకుండా విదేశీయుల పద్ధతిని నకలు చేయవలసిన అవసరం ఏమిటి? అనుకుంటూ ఆలోచనల్లో ఇరుక్కుపోయాడు జగన్నాధం.

ఏమీ తెలియకుండా విదేశీయుల పద్ధతులని నకలు చేయడం సరి అయినది కాదనుకుంటే, మన దినచర్యలలో అలాంటి నకలు ఎంతచేస్తున్నాం. పెళ్ళిళ్ళలో, ఆబ్దికాలు పెట్టే తంతు ఎంతమందికి అర్థమయి చేస్తున్నారు? అన్న ప్రశ్న మెదడులోనికి రాగానే, సన్నని తలనొప్పి మొదలయింది జగన్నాధంకి.

ఆలోచనల్లోంచి తప్పించుకోడానికి టెలివిజన్ ఆన్ చేశాడు జగన్నాధం.

టెలివిజన్ నడుస్తున్నా జగన్నాధం ఆలోచనలు ఆనవాయితీల మీదకి మళ్ళాయి. తను ఇక్కడికి వచ్చి దాదాపు నెల్లాళ్లయింది. ఆర్జిస్తున్న కొడుకుని వదిలి ఇక్కడ ఇలా ఉండిపోవడం ఎంత సమంజసం?" అన్న ప్రశ్న జగన్నాధంని ఉక్కిరిబిక్కిరిచేసింది.



ఈ నెల్లాళ్ళూ ఇక్కడ మీరు ఉండడంతో

మా దినచర్యలో కాస్త మార్పు వచ్చింది సాయి ఊర్లకి వెళ్ళడం తగ్గింది. రేపటినుంచీ మళ్ళీ మామూలే. తను ఊరువెళ్తే ఒంటరితనం నన్ను ఆవహించి ఇబ్బందిపెడుతుంది. మీరు మరికొన్ని రోజులు ఆగితే బాగుండును, కాని మీరు మామాట వినకుండా అనవసరంగా తొందరపడుతున్నారు'' అంది చంద్రిక సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకుంటున్న జగన్నాధంతో.

"నువ్వన్నది అక్షరాలా నిజం, అలవాటు లేకపోతే ఒంటరితనం దుర్భరం. నీమాట విని నేను మరోవారం రోజులు ఆగినా నువ్వు ఉదహరించిన మార్పు కేవలం తాత్కాలికం. నీ ఒంటరితనం సమస్యకి పరిష్కారం నేనుకాదు. ప్రస్తుత పరిస్థితిలో మరో వ్యక్తి మీలోకంలోనికి వస్తే బహుశా ఒంటరితనం అంతరించవచ్చు'' అన్నాడు జగన్నాధం.

"అదే నేనూ, సాయీ అనుకున్నాం కానీ ఇంతవరకు ఏమీ కలిసిరాలేదు'' అంటూ నిట్టూర్చింది చంద్రిక. కాస్సేపాగి "దీనికి మరో తాత్కాలిక పరిష్కారమార్గం ఉంది. నీ తల్లితండ్రులు ఉంటున్న ఊరికి దగ్గరగా నీమకాం మారిస్తే నీ ఒంటరితనం పోతుందేమో'' అన్నాడు జగన్నాధం.

"అది ఇప్పట్లో జరిగేపని కాదు. కాలం వాళ్ళకి మేమంటే ఉన్న కోపాన్ని తగ్గించినపుడు వాళ్ళకి దగ్గరగా వెళ్తే అందరికీ ఆనందంగా ఉంటుంది. అయితే మీరు రేపు ఊరికి వెళ్ళడం ఖాయమా?" అని ప్రశ్నించింది చంద్రిక.

తల ఊపాడు జగన్నాధం. చంద్రిక మొహంలో విచారం జగన్నాధంకి ప్రస్ఫుటంగా కానవచ్చింది.

"చాలా రోజులుగా ఒక చిన్న ప్రశ్నకి సమాధానం దొరకక అదేపనిగా దానిగురించే ఆలోచిస్తున్నాను. నీ దగ్గర బహుశా దానికి సమాధానం ఉందేమో'' అన్నాడు జగ

న్నాధం.

"ఏమిటది?"

"సాయికి నేనంటే ఎందుకు అంత అభిమానం?"

"అతని జీవితం మొగ్గలు తొడగడానికి మీరే కారణం"

"నాకేమీ అర్థమవలేదు"

"నేను వివరించాక అది చాలా చిన్నదని మీరన్నా నేను ఆశ్చర్యపడను. నెలసరి ఆదాయం అంటూ లేని సాయితండ్రికి, సాయి చదువు భారమైనదే. ఎలాగో ఆఖరి సంవత్సరం డిగ్రీకి వచ్చాడు సాయి. వాళ్ళనీ, వీళ్ళనీ అడిగి లేదనిపించుకున్నాక మీదగ్గరికి వస్తే, మీరు అతని పరీక్ష ఫీజుకి ఏభై రూపాయలు ఇచ్చారు. మీరు ఆ డబ్బు ఇస్తున్నపుడు వివరాలు ఏమీ అడగలేదు. అందుచేత మీరు సాయి పరీక్ష ఫీజుకి అతని



తండ్రికి డబ్బు ఇచ్చారని మీకు జ్ఞాపకం లేదు. ఉద్యోగం వచ్చాక ఆ ఏభై రూపాయలు తిరిగి ఇద్దామని సాయికి అనిపించినా, అలా చేస్తే, అది మిమ్మల్ని అవమానించినట్టు అవుతుందేమోనని ఆ ప్రయత్నాన్ని



విరమించాడు. పరీక్ష ఫీజుకి ఏభై రూపాయలు కావాలి అంటే ఎవరైనా సర్దుతారని మీరనవచ్చు. కాని అలా జరగలేదు. ఆ ఏభై రూపాయల విలువ, డబ్బులేక పరీక్షకి వెళ్ళక, కాలాన్ని అవకాశాన్ని వదులుకున్న వ్యక్తిని అడగండి. మెట్లు ఎక్కడానికి మొదటి అర్హతని ప్రసాదించింది ఆ డబ్బు. మెప్పుదలకి, కీర్తి కండూతి కోసం చేసిన సహాయంవేరు, ఇది వేరు. మనకి చేతనై ఉండికూడా, ఇతరులకి సహాయం చేయని బతుకు ఎందుకు మాష్టారూ?" అంది చంద్రిక.

చంద్రికవేపు పరీక్షగా చూసి, "సాయి అదృష్టవంతుడు'' అనుకున్నాడు జగన్నాథం

★ ★ ★

"ఒక రెగ్యులర్ కాఫీ టాల్" అన్న వాక్యం విని అది వచ్చినవేపు చూశాడు జగన్నాథం.

జగన్నాథంకి ముందర ఐదారుగురు క్యూలో నిలబడి ఉండడంవలన కౌంటర్ దగ్గర నిలుచున్నవ్యక్తి మొహం కనిపించలేదు. ఆమె ఎవరో కాని ఫుల్ డ్రెస్‌లో ఉంది. ఒక నిమిషం గడిచింది. కౌంటర్ దగ్గర నిలుచున్న వ్యక్తి కాఫీ అందుకుని "హలో జగన్నాథం, వాటే సర్‌ప్రయిజ్" అంది పెద్ద గొంతుతో చంచల.

స్టార్‌బక్ కాఫీ దుకాణంలో ఉన్నవాళ్ళందరూ చంచలవేపు, జగన్నాథం వేపు తలలు తిప్పారు. జగన్నాథం మొహంమీద చిరునవ్వు పెరిగింది.

"ఇక్కడికి ఎలా వచ్చావు?" అంటూ దగ్గరగా వచ్చింది.

"నాకు స్ట్రాంగ్ కాఫీ ఇష్టమని, స్టార్ బక్ కాఫీ బాగుంటుందని, తన కారుని తనిఖీకి తీసుకెళ్తూ నరేంద్ర నన్ను ఇక్కడ వదిలివెళ్ళాడు. దాదాపు నలభైనిమిషాలలో తిరిగివస్తానన్నాడు'' అన్నాడు జగన్నాథం

"ఇంత కాఫీ నేను ఒక్కర్తినీ తాగలేను. ఇది ఇద్దరికి సరిపోతుంది'' అంటూ జగన్నాథం జబ్బ పుచ్చుకుంది చంచల. పెద్ద గ్లాసులో ఉన్న కాఫీని ఇద్దరికీ సరిసమానంగా పంచి, ఒకటి జగన్నాథంకి అందిచ్చింది. కిటికీలని ఆనుకుని ఉన్న కుర్చీలలో కాఫీ గ్లాసులతో ఆసీనులయ్యారు . జగన్నాథం, చంచల.

"క్రితంసారి కలిసినప్పుడు కుశలప్రశ్నలు వేసుకోవడానికి కూడా సమయం దొరకలేదు. ఇప్పుడు చెప్పు. గత ముప్ఫయిఏళ్ళ జీవిత చరిత్ర" అంటూ సంభాషణని మొదలుపెట్టింది చంచల.

ఆంధ్రా యూనివర్సిటీలో ఇంగ్లీషులో ఎమ్.ఏ., పి.హెచ్.డి.లు పూర్తిచేసి విజయనగరంలో లెక్చరర్‌గా ఉద్యోగంలో చేరి అక్కడే రిటైర్ అయ్యాను. ప్రత్యేకంగా జీవితంలో సాధించినదేమీలేదు''

"నీ భార్య సంగతేమిటి?"

ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక కాస్సేపు మౌనం వహించాడు జగన్నాథం. చంచల ఏమీ తొందరపెట్టలేదు.

"జీవితంలో ఏమికావాలో, దానిని ఎలా సాధించాలో అవగాహన లేని వ్యక్తులు మన జీవితాల్లో తటస్థపడతారు. అలాంటిదే సునంద. పదేళ్ళక్రితం వద్దంటున్నా వినిపించుకోకుండా కార్తీక మాసంలో సముద్రస్నానం అంటూ సముద్రంలోనికి స్నానానికి వెళ్ళి రెండురోజుల తరువాత సగం చేపలు తిన్నాక మిగిలిన శరీరం ఉబ్బిపోయి వడ్డుకు కొట్టుకు వచ్చింది. నాకు ఈత రాదు. దగ్గరలో ఎవ్వరూ లేరు. నేను సముద్రంలోనికి రెండడుగులు వేసేసరికి ఆమె మటుమాయమైంది. తరువాత ఒంటరితనం నన్ను ఇబ్బంది పెట్టకుండా జాగ్రత్తపడ్డాను అంతే. జీవితం గురించి తెల్లకాగితంమీద నాలుగు పంక్తులు రాద్దామన్నా ఏమీ కనపడదు'' అన్నాడు జగన్నాథం.. చంచల కంటిలో నీరు తిరిగింది.

"నేను అమెరికా వచ్చిన కొత్తలో న్యూయార్క్ క్వీన్స్‌లో ఉండేవాళ్ళం. మెడిసిన్

ఇండియాలో ముగించి, రెసిడెన్సీకి అప్పుడే చేరాను. ప్రతీరోజూ మా ఎపార్ట్‌మెంట్‌కి దగ్గరగా ఉన్న మెక్డ్‌నాల్డ్‌లో కాఫీ తాగి, హాస్పిటల్‌కి వెళ్ళేదాన్ని. న్యూయార్క్‌లో చలికాలం! అబ్బ... భరింపరాని చలి. ఎముకలు కొరకడం అంటారు చూసేవా? అలాగే ఉంటుందా చలి. మెక్డ్‌నాల్డ్ లోపలికి వెళ్ళే ద్వారానికి దగ్గరగా, లోపలికి వెళ్లబోయేవాళ్ళని బైటకి వచ్చేవాళ్ళని.

"కెన్ యు స్పేర్ ఎ క్వార్టర్?", "థాంక్ యూ, గాడ్ బ్లెస్‌యూ'' అంటూ చిరుగులున్న దుస్తులతో కన్నాలున్న గ్లవ్స్‌లోంచి బైటకి కనిపిస్తూ చలికి ముడుచుకున్న వేళ్లని చాచి అడిగేవారు. కాని ఒకరోజు,

"మేడమ్ నా గురించి కాదు, ఆ వ్యక్తికి చలి దెబ్బ తగిలినట్లుంది. ఒక క్వార్టర్ ఇస్తే అతనికి కాఫీ కొంటాను'' అన్నాడు ఒక నలుపుమనిషి.

విస్తుపోయాను. అదృష్టవశాత్తూ నా చేతికి క్వార్టర్ తగిలితే, అది ఇచ్చి లోపలికి వెళ్ళాను. కాస్సేపటికి బయటకి వచ్చి కారు ఎక్కుతూ, కళ్ళతో ఆ వ్యక్తిని వెతికాను. నమ్ము, నమ్మకపో. ఆ వ్యక్తి పేవ్‌మెంట్‌మీద, కన్నాలలోంచి వేడినీటి ఆవిరి వస్తున్న ప్రదేశంలో కూర్చున్న ఆమెచేత కాఫీ తాగిస్తున్నాడు.

వాళ్లిద్దరి మధ్యా ఉన్న బాంధవ్యమేమిటో ఏమో. అది అసందర్భం. భార్యకోసం భర్త భర్తకోసం భార్య ముష్టెత్తడంలో ఆశ్చర్యంలేదు. పిల్లల గురించి తల్లిదండ్రులు యాచనకి దిగినా నోరు వెళ్ళబెట్టనవసరంలేదు. ఈ అధునాతన యుగంలో ఒక మనిషి, ఇంకొక మనిషి గురించి ముష్టెత్తడం! ఆమె హీనస్థితిలో ఉంది, ఆమెని కొత్తగా చూస్తున్నాను అక్కడ. ప్రాక్టీస్ పెరిగాక హిందూ దేవాలయానికి వేల డాలర్లు విరాళం ఇచ్చాను. కాని ఆనాడు, అతనికి క్వార్టర్ ఇచ్చినప్పుడు కలిగిన తృప్తి టాక్స్ ఎగేయడానికి విరాళం ఇచ్చినప్పుడు కలగలేదు. మనిషికి మనిషి మతలబులు లేకుండా చేసిన సహాయం చాలా విచిత్రంగా మనల్ని కుదుపుతుంది.

ఇది ఎందుకు చెప్పానంటే చాలాకాలం క్రితం సుమారు రెండేళ్ళపాటు మంచి స్నేహాన్ని నాకు పంచేవు జగన్నాథం. వెలుగు వచ్చేంతవరకు నిశ్చలంగా ఉన్న చెట్టుని పట్టుకుని దానికి ఆనుకుని ఉండకుండా మిణుగురు పురుగులవెంట చీకటిలో నడుస్తారు కొందరు. విశాఖపట్నం వదిలేప్పుడు ఏదేదో అని వెళ్ళాను. అప్పుడప్పుడు నువ్వు జ్ఞాపకానికి వచ్చేవాడివి. ఈ దేశంలో ఎవరికీ క్షణం కూడా తీరిక ఉండదు. ప్రతీ క్షణమూ పరుగే.

మా తాతగారి ఇంటికి ఎదురుగా ఒక కుమ్మరి మట్టిపాత్రలని తయారు చేయడానికి ఉదయమే మన్నుని కలిపి ఒక గుట్టలా ఉంచేవాడు. అది ఎలా పసికట్టేదో ఏమో ఒక కుమ్మరిపురుగు మన్నుని గుండ్రంగా ఉండ చేసి, ఒకచోటనుంచి ఇంకొకచోటకి, మళ్ళీ దానిని పాతచోటకి పదేపదే రోజంతా కష్టపడుతూ దొర్లించేది. చీకటిపడగానే మటుమాయమయ్యేది. తిరిగి ఉదయమే ప్రత్యక్షం. అలాగే ఉంటుంది ఇక్కడ జీవితం. "మనదేశంలో ఇందుకు విరుద్ధంగా ఉంటుందా?" అని నువ్వు అడగవచ్చు. ఉందని నేను అనడంలేదు. అక్కడ కుమ్మరిపురుగు శృంగవరపు కోట మన్నుండల్ని దొర్లిస్తే చికాగో మన్నుండల్ని దొర్లిస్తుంది ఇక్కడ కుమ్మరిపురుగు. అంతే తేడా! ఇక్కడ కుమ్మరిపురుగు పాలు, వెన్న బాగా పట్టిస్తే కాస్త పెద్దసైజు ఉండల్ని దొర్లిస్తుంది."

జగన్నాథం చంచలని పరీక్షగా గమనిస్తుంటే,

"థాంక్‌యూ, మై ఫ్రెండ్ థ్యాంక్‌యూ'' అంటూ జగన్నాథం వేళ్ళని నొక్కి వదిలింది చంచల.

"ఈ దేశం ఎప్పుడు వచ్చావు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించబోతున్న జగన్నాథంని వారించి,

"అదిగో, నరేంద్ర వస్తున్నాడు'' అంది.

"ఏమిటి చంచలగారు ఇంత దూరం వచ్చారు?" అనడిగాడు నరేంద్ర.

"ఇక్కడకి దగ్గరగా ఉన్న సెయింట్ కేథరీన్‌లో పనిమీద వచ్చాను. ఆ పని ముగించి, స్టార్‌బక్ కాఫీకోసం ఆగితే మీ నాన్నగారు కనిపించారు'' అంది చంచల.

"వెళ్దామా నాన్నా?" అన్నాడు నరేంద్ర.

తలవూపుతూ నరేంద్రతో బయటికి నడిచాడు జగన్నాథం.

చంచల ఇంకా అక్కడే నిలుచుందా? కదలి వెళ్లిందా? అని వెనక్కి తిరిగి చూడాలన్న కోరికని అతికష్టంమీద అణిచిపెట్టి, నడక వేగం కాస్త హెచ్చించి, నరేంద్ర పక్కగా నడుస్తూ మాల్లోంచి బయటికి వచ్చాడు జగన్నాథం.

"చంచలగారు అలా అక్కడికే రావడం ఆశ్చర్యంగా ఉందే'' అనుకుంటూ కారుని స్టార్ట్ చేశాడు నరేంద్ర.

జవాబీయడానికి ఏమీలేక బయటికి చూడసాగాడు జగన్నాథం. నరేంద్ర కారు తనిఖీ గురించి ఏదో వివరిస్తున్నా, జగన్నాథం ఆలోచనలు చంచలవేపు మళ్ళాయి.

"మరమరాలు నీకిష్టంకదా అని తెస్తే అలా బెట్టు చేస్తావేం?" అంటూ కసురుతూ తెచ్చుకున్న మరమరాల్లోంచి సగం అందిచ్చింది ఒకరోజు. తను ఇంకా సందేహపడుతుంటే,

"దీనికి బదులుగా నిన్ను ఏమీ తెమ్మననులే' అంటూ నిమ్మకాయ బద్దని మూడువేళ్లతో పిసికి, రసాన్ని తన భాగం మరమరాల మీద పోసింది. అవును, కొంచెం కారంవేసి నిమ్మకాయ దట్టించిన మరమరాలు కనిపిస్తే తనకి నోట్లో నీరు ఊరేది. తన ఇష్టం గురించి పట్టించుకున్న చంచల ఉన్నట్టుండి ఏమేమో అని తనని హతాసుడుని చేసి మాయమై ఇన్నాళ్ళ తరువాత కనిపించి కాఫీని పంచి ఇచ్చింది.

దానికీ, దీనికీ మధ్య నలభైఐదేళ్లు.

అబ్బ! కాళ్ళకి పెట్టుకున్న గోరింటాకుని ప్రదర్శిస్తూ పరికిణీని రవ్వంత ఎత్తులో కట్టి, చంచల కొంటెగా అడుగులు వేసిన ఆ రోజులు వెళ్ళి నలభై అయిదేళ్ళయిందా?

"నాన్నా! ఏమిటి పరధ్యానంలో ఉన్నారు'' అన్న నరేంద్ర సంబోధన జగన్నాథంని వాస్తవంలోనికి తీసుకువచ్చింది.

"నే చెప్పినది వినిపించిందా?" అనడిగాడు నరేంద్ర.

"అబ్బే! ఏదో ఆలోచన వస్తే..." అంటూ జగన్నాథం నసిగాడు. నరేంద్రతో చంచల గురించి గతం గురించి, చర్చించడానికి ఇష్టంలేక ఇంకేమైనా ప్రశ్నిస్తాడేమోనని కళ్లు మూసుకున్నాడు.

★ ★ ★

హాలులో టెలిఫోన్ మోగింది.

జగన్నాథం రిసీవర్‌ని చేతిలోకి తీసుకుని హలో అన్నాడు.

"మిస్టర్ నరేంద్ర కానీ, మిసెస్ నరేంద్ర కాని ఉన్నారా? వాళ్లతో మాటలాడాలి'' అంది అవతలి గొంతు ఆదుర్దాగా.

"ఇద్దరూ పనులకి వెళ్లేరు'' అన్నాడు జగన్నాథం.

"రాధ చదువుతున్న హైస్కూల్‌లో షూటింగ్ అయింది. స్కూల్‌లో ఉన్న విద్యార్థుల తల్లితండ్రులని వచ్చి తమ పిల్లలని ఇళ్లకి తీసుకెళ్లమని అందరికీ ఫోన్ చేస్తున్నాం. నరేంద్ర, మిసెస్ నరేంద్రల ఆఫీసు నెంబర్లు ఇవ్వండి'' అనడిగింది స్కూల్ కౌన్సిలర్. నరేంద్ర, పద్మల ఆఫీసు నెంబర్లు ఇచ్చేడు జగన్నాథం.

"థాంక్స్''

వివరాలు ఏమీ అడగకుండా ఫోన్‌ని కింద ఉంచేసినందుకు తననితాను విసుక్కున్నాడు జగన్నాథం. టెలిఫోన్ మళ్ళీ మోగుతుందేమోనని, దానిదగ్గరగా కూర్చుని, బైట రోడ్డుమీదకి దృష్టిని సారించాడు జగన్నాథం.

ఒకగంట గడిచాక, నరేంద్ర, పద్మలు, రాజు, రాధలతో ఇంటికి వస్తుంటే చూశాక జగన్నాథం మనస్సు కుదుటపడింది. లేచివె

ళ్ళి తలుపు తెరిచాడు జగన్నాథం.

దెయ్యాన్ని చూసి జడుసుకుని, దాని బారినుంచి తప్పించుకువచ్చిన మనిషి ముహంలా, అందరికన్నా ముందర లోపలికి వచ్చిన రాధ మొహం పాలిపోయివుంది. ఆమె వెనకాల రాజు, పద్మ, నరేంద్రలు మాట్లాడకుండా లోపలికి వచ్చారు.

ఒకగంట ఇంట్లో నిశ్శబ్దం రాజ్యం చేశాక, నరేంద్ర తలుపుతెరుచుకుని బైటకి వెళ్ళాడు.

జగన్నాథం కాఫీకప్పుతో సోఫాలో కూర్చుని, టెలివిజన్ ఆన్ చేశాడు.

రాధ, రాజులస్కూల్‌లో జరిగిన సంఘటన గురించి ప్రసారం చేస్తున్నారు. ఇద్దరు విద్యార్థులు మరణించారని, పన్నెండుగురికి గాయాలు తగిలాయని ప్రకటించారు. చనిపోయిన వ్యక్తుల వివరాలు చెప్పలేదు. తోటి కుర్రాళ్ళు గేలిచేశారని, తనతో నెయ్యం కట్టిన ఆడపిల్ల తనని వదిలి వెళ్ళిందని కోపంవచ్చి పదిహేడేళ్ళ విద్యార్థి ఇంట్లో రైఫిల్ పట్టుకువచ్చి వరుసగా ఆ ఆడపిల్ల, తరువాత తనని గేలిచేసిన ఇతరులమీద గురిపెట్టి తుపాకీని పేల్చాడని ఈ సంఘటనకి కారణాలు చెబుతున్నారు. వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

ఒకగంట వ్యవధిలో, తుపాకీ పేల్చిన విద్యార్థి తల్లితండ్రుల గురించి, వాళ్ళ చరిత్ర టెలివిజన్‌లో ప్రసారం అవుతుంటే జగన్నాథం తెగ ఆశ్చర్యపడ్డాడు.

తల్లితండ్రులు విడిపోయారని, అమెరికాలో దేముడంటే భయం సన్నగిల్లిందని, దీనంతటికీ 'లిబరల్స్' కారణమని ఒక క్రిస్టియన్ మతాధికారి అభిప్రాయపడ్డాడు.

తుపాకీలని ఇంటిలో భద్రంగాదాచి ఉంచకుండా అందరికీ అందుబాటులో ఉంచడమే దీనికి కారణమని గన్ కంట్రోల్ ఉండాలని అభిలషించే రాజకీయ నాయకుడు బల్ల గుద్దుతూ చెప్పాడు.

తల్లితండ్రులు కుర్రాడికి చిన్నప్పుడు తగినంత ప్రోత్సాహం ఇవ్వలేదని, కుర్రవాడికి పుష్కలంగా ప్రాముఖ్యత ఇవ్వకపోవడంవలన ఆ కుర్రాడి ఆత్మగౌరవం క్షీణించి, ప్రాముఖ్యతకోసం ఇలా చేశాడని ఒక సైకాలజిస్ట్, తాగుతున్న పైప్‌లోంచి పొగ వదులుతూ శూన్యంలోకి చూస్తూ గొణిగాడు.

తను ఇలాంటి కేసులు చాలా చూశానని, కుర్రవాని పుట్టుకపుడు డాక్టర్లు సరైన శ్రద్ధ తీసుకోకపోతే ఇలాంటివి సంభవిస్తాయని, ఇదికూడా ఆ కోవకి చెందే అవకాశం లేకపోలేదని, డాక్టర్లు ఎలాంటి మందులు వాడారో, వాటివలన ఎలాంటి హాని జరగగలదో పరిశీలించాలని అన్నాడొక లాయరు. కుర్రవాడు కడుపులో ఉండగా, తల్లి సిగరెట్‌గాని, మద్యపానం గాని చేయకూడదని, ఆ తల్లి ఒకవేళ పొగాకుకి బానిస అయి ఉంటే, పొగాకు కంపెనీ సంఘటనకి పరోక్షంగా కారకులయిన వాళ్ళని కోర్టుకి ఈడ్చాలని ఒక ఎన్విరాన్‌మెంటలిస్ట్ తన నమ్మకాలని వెలిబుచ్చింది.

క్షతగాత్రులలో ఇద్దరు యూదులున్నారని, కుర్రవానికి యూదులంటే పడదని, యూదులమీద అత్యాచారాలు జరుగుతున్నా ప్రభుత్వం ఏమీ జరగనట్లు ఊరుకోవడం సామాన్యమైందని ఒక రేబై ఆవేశపడ్డాడు.

అంతా కలగాపులగంగా ఉంది.

మర్నాడు శుక్రవారం స్కూలు మూసేస్తున్నారని, సోమవారంనాడు స్కూలులో భయంతో చలించిపోయిన కుర్రాడికి సలహా ఇవ్వడానికి ఏర్పాట్లు చేస్తారని ప్రకటన వెలువడింది.

చూపించినదే చూపిస్తుంటే టెలివిజన్ ఆఫ్‌చేసి, బట్టలు వేసుకుని నడకకి బైటకి బయలుదేరాడు జగన్నాథం. పోలీసు కార్ల సైరన్లు నిరంతరంగా వినిపిస్తున్నాయి. దూరంగా, సంఘటన జరిగిన దిశలో ఆకాశంనుంచి హెలికాప్టర్లు కిందకి దిగుతున్నాయి. బహుశా అవి టెలివిజన్‌కి సంబంధించినవయి ఉండవచ్చు అనుకున్నాడు జగన్నాథం. ఇలాంటివార్తలు టెలివిజన్‌మీద చూడడం ఇది మొదటిసారికాదు

జగన్నాధంకి. గతంలో ఒక స్కూల్లో ఇలాంటి దుర్ఘటనే జరిగితే, చివరికి దానికి కారణం 'తాత్కాలికంగా వచ్చిన పిచ్చి' అని ఆ కుర్రవాడిని ప్రత్యేక స్కూల్లో పద్దెనిమిదే ళ్ళు వచ్చేంతవరకూ ఉంచి, అప్పుడు మాన సికవేత్తలని సంప్రదించి, ఇంకా కొన్నాళ్ళు నిర్బంధంలో ఉంచాలో, లేక విడుదల చే యాలో నిర్ణయించాలని కోర్టుతీర్పు ఇచ్చింది. ఆశ్చర్యమేమిటంటే పద్దెనిమిదే ళ్ళు నిండి విడుదల అయిన వ్యక్తి పాత రికార్డ్ అంతా చెరిపేస్తారు. గతంలో ఉన్న డాగు మటుమాయమవుతుంది.

తాము చేసిన తప్పుకు, ఇంకెవరో, ఇంకే దో కారణమని, చేసిన తప్పుకి బాధ్యత వహించకుండా ఇతరులకి దానిని ఆపా దించడం, అమెరికాలో సర్వసామాన్యం అనుకున్నాడు జగన్నాధం. ఇలాంటి ధోరణికి లాయర్లు, సైకాలజిస్ట్‌లు ముఖ్య కారణమా? అనుకుంటుంటే జగన్నాధంని దాటి శబ్దంచే స్తూ పోలీసుకారొకటి పరిగెత్తింది. అది చేస్తు న్న హోరు భరించలేక చెవులు మూసుకు న్నాడు.

సహాయానికి హుటాహుటీన శబ్దం చేసు కుంటూ పోలీసులు, ఫైరింజన్లు, అంబులెన్స్ విజయనగరంలో పరిగెత్తడం అతి అరుదు. దీపావళిరోజు తారాజువ్వలు, వెలంకాయలు, తాటాకు ఇళ్ళమీద పడి, పేలి ఇళ్ళు అంటు కున్నప్పుడు కనిపించాయి. అవి ఎల్లప్పుడూ మరమ్మత్తులో ఉండడంవలన, అవి ఉన్నా లేకపోయినా సామాన్య ప్రజానీకానికి ఒక్కటే! పోలీసు కార్లకి సైరన్లు ఉండవు. ఉన్నా పనిచేయవు. ఒకవేళ అవి పనిచేస్తున్నా ఎవ్వరూ పట్టించుకోరు. తమ వాహనాలని ఒడ్డుకుతోలి, ఎమర్జన్సీ వాహనాలకి దారి కల్పించరు. చట్టమంటే అదొకరకమైన నిర సన. లంచాలు ఇచ్చి పోలీసు కేసు మాఫీ చేయించుకోగలరు, కేసు నమోదవకుండా జాగ్రత్తపడతారు. అధవా కేసు నమోదైనా విచారణపూర్తయి కేసు కోర్టుకు వచ్చేసరికి సంవత్సరాలకి సంవత్సరాలు అతి సునాయా సంగా పట్టొచ్చు. ఇక కోర్టులలో జాప్యం సంగతి చెప్పనక్కర్లేదు. చట్టాన్ని పాటించని ప్రజ, ప్రభుత్వం తమకి ఏమీ సౌకర్యాలు కల్పించలేదని వాపోతుంది.

మరొక పోలీసుకారు శబ్దం చేసుకుంటూ, ట్రాఫిక్ లైట్లగురించి పట్టించుకోకుండా, బహుశా అరవై మైళ్ళ వేగంతో ఉరకలు పెడుతూ, మరో రోడ్డంబట అడ్డంగా వస్తున్న కారుని వెంట్రుకవాసిలో తప్పించుకు మాయ మైంది. అదృష్టవశాత్తూ ఏక్సిడెంట్ అవలే దు అని ఊపిరి పీల్చుకుంటూ జగన్నాధం ఇంటివేపు మళ్ళాడు.

ఇల్లు చేరేటప్పటికి నరేంద్ర హాలులో టెలివిజన్ చూస్తున్నాడు.

"అబ్బ! ఎక్కడ చూసినా తెగజోరుగా పరిగెడుతున్న పోలీసు కారులే, రవ్వంతలో ఏక్సిడెంట్ తప్పింది'' అంటూ నరేంద్ర ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు జగ న్నాధం.

"అలా పోలీసుకార్లు పరిగెత్తేటప్పుడు, ఇంకో కారుని కానీ, మనిషిని కానీ గుద్దేస్తే ఆస్తినష్టంకాని, ప్రాణహాని కానీ అయితే దాని కి పోలీసులు ఎంతమాత్రం బాధ్యులు కారు. అది ఇక్కడ చట్టం. కనీసం హాస్పిటల్ ఖర్చులు కూడా భరించదు తెలుసా?" అన్నా డు నరేంద్ర.

"రండి, డిన్నర్ తిందాం" అన్న పద్మ పిలుపు వచ్చేంతవరకు టెలివిజన్‌లో స్కూల్ షూటింగ్‌మీద కొనసాగుతున్న చర్చని మౌనంగా వినసాగారు నరేంద్ర, జగ న్నాధం.

భారంగా సంభాషణ లేకుండా భోజన కార్యక్రమం ముగిసింది.

సాధారణంగా పది గంటలకి నిద్రపోయే జగన్నాధంకి నిద్ర రావడంలేదు. అటూ ఇటూ పక్కమీద కదులుతుంటే, పడక గది లోంచి, నరేంద్ర, పద్మల సంభాషణ లీలగా వినిపిస్తోంది.

"ఎప్పుడు ఏ అవాంతరమౌతుందో చెప్పలేం ఈ వెధవ దేశంలో. వచ్చే సంవత్సరం రాజు చదువుకి పై ఊరికి వెళ్తాడు. అప్పుడు ఇంకోరకమైన బాధ" అంది పద్మ.

"నిజానికి అదే ఉత్తమం. మన ఎదురుగా ప్రతీ క్షణమూ ఉంటే అలాంటివాటి గురించే ఆలోచిస్తాం. దూరంగా ఉంటే ఏమవుతోందో తెలియదు. కాబట్టి మనకి క్లేశం ఉండదు" అన్నాడు నరేంద్ర.

"మీరు యతీ అంటే ప్రతీ అంటారు. అసలింతకీ రాజు కాలేజీకయ్యే ఖర్చు సంగతి ఆలోచించారా? " జగన్నాధంకి నరేంద్ర ఇచ్చిన సమాధానం వినిపించలేదు.

"పై ఊరికివెళ్ళి, మంచి యూనివర్సిటీలో చదివితే సంవత్సరానికి ఇరవైరెండు, ఇరవైనాలుగువేల డాలర్లు అవసరంట. అంటే వాడి నాలుగు సంవత్సరాల కాలేజీ చదువుకి లక్షడాలర్లు కావాలి. దానిలో కొంత ఎయిడ్ వస్తుంది కదూ? " అనడిగింది పద్మ.

"తల్లిదండ్రుల ఆదాయం, ఇంట్లో ఉన్న మనుష్యులను బట్టి ఆర్థిక సహాయం ఇవ్వడమో, మానడమో నిర్ణయిస్తారు. రాజు ఎయిడ్‌కి అనర్హుడు"

"ఎయిడ్ రాకపోతే స్కాలర్‌షిప్ వస్తుందా? "

"ఏమో, రాజు ఎన్నుకున్న కాలేజీని బట్టి ఉంటుంది. ప్రతిష్ట ఉన్న కాలేజీకి వెళ్ళేవాళ్ళు ఎక్కువ. రాజుకంటే ఎక్కువ మార్కులు వచ్చినవాళ్ళు ఉంటే, ఉన్న అతి తక్కువ స్కాలర్‌షిప్‌లు వాళ్ళకి వెళ్తాయి"

"రాజు కాలేజీకి వెళ్ళిన సంవత్సరం తరువాత రాధ కాలేజీ మొదలవుతుంది"

"చూద్దాం. ఇంటిమీద అప్పు తీసుకోవచ్చు. రిటైర్‌మెంట్ ఫండ్‌లోంచి కొంత అప్పుగా లభిస్తుంది"

"అవునుగాని ఇది విన్నారా? రాఘవ స్టాక్ మార్కెట్‌లో బాగా నష్టపోయాడుట" అంది పద్మ.

"నేనూ విన్నాను, ఎంత నష్టపోయినదీ తెలియదు"

"మీరు అనవసరంగా ఫ్రీ సర్వీసులు ఏమీవాళ్ళకి పెట్టకండి" అంది పద్మ.

నరేంద్ర గురక మెల్లిగా వినిపించడంతో సంభాషణ ఆగిపోయిందని అవగాహనైంది జగన్నాధంకి. కొడుకు, కోడలు మథనపడడం విన్నాక జగన్నాధంకి సరిగ్గా నిద్రపట్టక, తెల్లవారుఝామున తెలివివచ్చింది. కాలేజీ చదువుకి సంవత్సరానికి ఇరవై ఐదు వేల డాలర్లు ఖర్చంటే, రాధ, రాజుల చదువులకి రెండు లక్షల డాలర్లు. అంటే దాదాపు కోటి రూపాయలు! నరేంద్ర, పద్మలకి జమిలిగా వచ్చే ఆదాయం గురించి తనకి తెలియకపోయినా రెండు లక్షల డాలర్లు అంటే తన గుండె గుభేల్‌మంది. ఇద్దరిపిల్లల చదువులు పూర్తయేసరికి, ఉన్న నిలవంతా ఇగుర్చుకుపోవడమే కాకుండా, అప్పులు మిగులుతాయేమో! నరేంద్ర, పద్మలు ఇంకా నలభై ఏళ్ళ దరిదాపులలో ఉన్నవారు కాబట్టి వాళ్ళు తేరుకోగలుగుతారు. అమెరికాలో నలుగురున్న కుటుంబానికి సగటు ఆదాయం సంవత్సరానికి దాదాపు ముప్ఫయ్ నాలుగువేల డాలర్లని తను చదివాడు. దానిలోంచి పన్నులు, ఖర్చులు తీసేస్తే, రెండు లక్షల డాలర్లు ఎక్కడనుంచి నిలవచేయగలడు? కాలేజీకి వెళ్తున్న వ్యక్తి వారాంతాల్లో పనిచేసి చిల్లర ఖర్చులకి కావలసినది ఆర్జించుకున్నా, మధ్య తరగతి కుటుంబానికి ఇది తాహతుకి మించినపనే. అందుకే కాబోలు కొందరు పనిచేసుకుంటూ డిగ్రీ తెచ్చుకోవడానికి ఏడెనిమిదేళ్ళు తీసుకుంటారు.

అతి తక్కువ ఖర్చుతో, కాలేజీలకి వెళ్ళకుండా కరెస్పాండెన్స్ కోర్సులలో డిగ్రీలు తెచ్చుకోవడం కారుచవుక!

అయితే బజారులో వాటివిలువ ,కూడా చవుకే. అమెరికాలో మంచి కాలేజీ డిగ్రీకే

విలువ ఉంది. అమెరికాలో యూనివర్సిటీ లలో స్ట్రైక్‌లు, బంద్‌లు అతి అరుదు. ఇండియాలో ఏవేవో కారణాలని అవకాశంగా వాడుకుని చదువు ఎగకొట్టగా, విద్యార్థులు మహా అయితే మూడు నాలుగు నెలలు కాలేజీలకి వెడతారేమో!

"మీరు చెప్పిన చదువెవరికి కావాలి మాస్టారూ? మీరింకా సత్తెకాలపు మనిషిలా ఉన్నారే! మీకు కావలసినది జీతం, మాకు కావలసింది డిగ్రీ. మా బాబాయికి హైదరాబాదులో చాలామంది తెలుసు. ఇంకా ఇతర మార్గాలున్నాయి. నాకు ఉద్యోగం ఖాయం" అన్నాడు ఒక విద్యార్థి నాయకుడు బంద్ రోజున తన దగ్గరికివచ్చి. దేశానికి వెన్నెముక యువతరం. అలాంటి యువత



రానికే అలాంటి ఉద్దేశ్యాలుంటే, విద్యాసంస్థలలోనికి కులం, రాజకీయాలు ప్రవేశిస్తే, విద్యాస్థాయి పడిపోకుండా ఎవరు ఆపగలరు?

చటుక్కున చంచల జ్ఞాపకాలలోనికి దొర్లుకు వచ్చింది.



ఆవేళ తనపుట్టినరోజు. పుట్టినరోజని ప్రత్యేకంగా స్నేహితులని విందుకి ఆహ్వానించడం వీలవదని, అలాంటి ఆనవాయితీలని పాటించడం మానేసి చాలా కాలమైంది. పొద్దున్నుంచి అమ్మ చికాకుగా ఉండడం చూసి, ఆవేళ తన పుట్టినరోజని అమ్మకి జ్ఞాపకానికి తీసుకురావడానికి తను వెనుదీశాడు. యధాప్రకారం సాయంకాలం నాలుగున్నరకి డాబామీదకి వచ్చాడు తను. మరొక ఐదు నిమిషాలు గడిచాక చంచల,

# ఏరిన ముత్యాలు

★ జీవితంలో అన్నిటికంటె మంచి లక్షణం ఏకాగ్రత

–ఎమర్సన్

★ లోపాలులేని మనిషి అంటూ ఉండడు. తక్కువ లోపాలున్నవాడే ఉత్తముడు.

–హోరేస్

★ ఉదయం లేచింది మొదలు పడుకోబోయేదాకా కీటకంలాగా ఎవరి విధి వారు నిర్వర్తించడమే ముక్తికి సరైన మార్గం.

–స్వామి వివేకానంద

★ ఎలాగో జీవించడం కాదు గొప్ప- మన స్వల్పజీవితంలో మనం ఏంసాధించామనేది ముఖ్యం.

–జవహర్‌లాల్ నెహ్రూ

★ నీ ప్రధానమైన దుర్గం నీ మనస్సు. దాన్ని కోల్పోతే పోరాటంలో ఓటమి తప్పదు.

–రాజాజీ

★ నీ వ్యక్తిత్వంలో గుప్తంగా ఉన్న భాగమే నిజమైన నీ స్వభావం.

–డ్వైట్.ఎల్.మూడీ

★ అనిశ్చితమైన దాన్ని నమ్మి నిశ్చితమైన దాన్ని కోల్పోతే రెండూ నీకు దక్కవు

–సంస్కృతం సామెత

★ విసుగు పుట్టించడంకంటె సంగ్రహంగా చెప్పడం ఉత్తమం.

–షేక్స్‌పియర్

★ ఈ క్షణం కూడా అనంతకాలంలో భాగమే

–డన్‌కన్ స్టేవర్

★ ఒక్క సంతోషం వంద విచారాలను తరిమికొడుతుంది

–చైనా సామెత

★ కష్టాలను చాలామంది ఎదుర్కోగలరు కానీ ద్వేషాన్ని ఎక్కువమంది తట్టుకోలేరు.

–ఫుల్లర్

★ గర్వం ఎంతో వైభవంగా గుర్రమెక్కిపోతుంది. కానీ తన దారిని వెతుక్కుంటూ కాలినడకతో వెనుతిరుగుతుంది.

–లాంగ్‌ఫెలో

★ మానవజీవితం పర్వతారోహణవంటిది. ఒక శిఖరం ఎక్కితే మరో శిఖరం కనిపిస్తుంది.

–విన్‌స్టన్ చర్చిల్

సేకరణ: **గురువిందవల్లి కృష్ణమోహన్**

డాబా పైకివచ్చి ఉండచుట్టిన కాగితాన్ని తన మీదకి గిరవాటేసి కిందకి పరిగెత్తి వెళ్ళింది. ఆశ్చర్యంలోంచి తేరుకుని ఉండలు చుట్టిన కాగితం మడతలు విప్పగా, "సాయంకాలం ఆరుగంటలకి రామకృష్ణా మిషన్ బీచ్‌కి రా. నీతోపని ఉంది" అని ఉంది. తనకి ఏమీ అర్థమవలేదు. తొందరగా కిందకి దిగి గడియారం వేపు చూస్తే నాలుగు గంటల ముప్ఫయి ఎనిమిది నిమిషాలు చూపిస్తోంది. రామకృష్ణా మిషన్ బీచ్‌కి వెళ్ళాలంటే పదవ నంబర్ బస్ ఎక్కాలి. అది చచ్చేంత రష్‌గా ఉంటుంది. ఇరవై నిమిషాల కొకసారి వచ్చే ఆ బస్‌ని మధ్యలో పట్టుకోవడం ఎలాగ? రష్‌గా ఉంటే అది కురుపాం మార్కెట్ స్టాప్‌దగ్గర ఆగకుండా వెళ్ళిపోతుంది. అలాంటి పరిస్థితి కల్పించినందుకు చంచలమీద విసుక్కుంటూ చెప్పులు వేసుకుంటుంటే,

"మళ్ళీ ఎక్కడికిరా?" అనడిగింది అమ్మ.

"తొందరగా వచ్చేస్తాను" అంటూ రోడ్డుమీదకి వచ్చాడు. వడివడిగా అడుగులు వేసుకుంటూ ఆతృతతో బస్టాప్ రోడ్డువేపు మళ్ళాడు.

ఒక పదవ నెంబర్ బస్ ఆగకుండా దుమ్ము రేపుకుంటూ ముందరికి దూసుకుపోయింది. మళ్ళీ ఇరవై నిమిషాలకి కాని పదవనెంబర్ బస్ రాదు. వచ్చినా దానిలో దూరలేనేమోనని అనుమానపడి, పదవ నెంబర్ బయలుదేరే మొదటి బస్‌స్టాప్‌కి ఉరకలు పెడుతూ పరిగెత్తినట్లు నడిచాడు. తరువాత పదవ నెంబర్ బస్ అందుకుని రామకృష్ణా మిషన్ బీచ్‌లో బస్ దిగాడు. సూర్యుడు ఇంకా కిందకి దిగలేదు.

"టైమెంతయింది?" అనడిగాడు ఒక వాచీధారిని.

"ఐదున్నర" అన్నాడు వాచీధారి.

అక్టోబరు మాసమైనా కిక్కిరిసిన బస్‌లో ఆరాటపడుతూ ప్రయాణం చేసేసరికి బనియన్‌లో చమట ఉబికింది. సముద్రం మీద నుండి వస్తున్న చల్లగాలి శరీరాన్ని తాకగానే హాయి అనిపించి, సముద్రంవేపు చూస్తూ చంచలకోసం ఎదురు చూడసాగాడు.

తరువాత పదవనెంబర్ బస్‌వచ్చి ప్రయాణీకులని వదిలి వెళ్ళినవాళ్ళలో చంచల లేదు. చంచల రాసిన దానిని తను తప్పుగా చదివాడేమోనన్న అనుమానం మొదలయింది. చంచల తనని ఇలాంటి ఇబ్బంది లోనికి ఇరికించినందుకు కోపమొచ్చింది. వెన్వెంటనే "చంచల ఏదైనా చిక్కులలో ఇరుక్కుందేమో?" అన్న భయం కాస్సేపు తనని సందిగ్ధంలో ఉంచింది. ఆలోచనల్లో పడిన తను, తరువాత పదవనెంబర్ బస్ వచ్చిందని గమనించలేదు.

దగ్గరగా గాజుల శబ్దం అయ్యాక అటు వేపు చూస్తే చంచల.

"ఇప్పుడు టైమెంతయిందో తెలుసా?" అనడిగాడు దురుసుగా.

"ఆరుంపావు. సారీ, నీలా మనుష్యులని తోసుకుంటూ బస్‌లోనికి ఎక్కగలనేమిటి?" అంటూ యుద్ధానికి వచ్చింది. తను కిమ్మన లేదు. చంచలతో వాదనలో తనది ఎప్పుడూ కింద చేయే.

"ఈవేళ నీ పుట్టినరోజటగా. స్వీట్లు ఏవైనా ఇస్తావేమోనని కనుక్కోవడానికి పిలిచాను" అంది చంచల.

"ఈవేళ నా పుట్టినరోజని నీకెలా తెలుసు?" అనడిగాడు తను ఆశ్చర్యపడుతూ.

"ఎలా తెలిస్తే ఏం? స్వీట్లు కొంటావా, లేదా?" అని రెట్టించింది.

"సారీ. కారణాలు మాత్రం ఉన్నాయి. తిరిగి ఇంటికి వెళ్ళడానికి బస్‌కి పావలా కావాలి"

"పోనీలే. స్వీట్లు మాటకేం... కురుపాం మార్కెట్ ఎదురుగా గుల్ల పకోడీల గురించి నువ్వు చాలాసార్లు ప్రస్తావించావు. అవి

తెచ్చాను" అంటూ బాగ్‌లోంచి పకోడీల పొట్లాన్ని విప్పింది.

రెండు పకోడీలు అందుకుని నోటిలో ఉంచుకోగానే గుల్లగా ఉన్న ఉల్లిపాయ పకోడీలు నాలికకి కమ్మగా తగిలాయి.

"నా బాగ్‌లోంచి పకోడీల వాసన వస్తుంటే బస్‌లో ప్రతీవాడూ నావేపు చూడడమే. సిగ్గుతో చచ్చాననుకో" అంటూ గునుస్తూ, మొహంమీద పడ్డ జుత్తుని వెనక్కి తోసి, పకోడీలని కొరికింది చంచల.

చంచల ఆలస్యంగా వచ్చినందుకు వచ్చిన కోపం మాయమై, దాని స్థానంలో విచిత్రమైన భావం చోటు చేసుకుంది. ఇద్దరూ కబుర్లలోపడ్డారు. కాస్సేపయాక,

"మనం బయలుదేరుదాం. బస్ దొరికి ఇల్లు చేరేటప్పటికి టైమ్ పడుతుంది" అంటూ చంచలని తొందరపెట్టాడు తను. బస్‌స్టాపులో ఇంకెవరూ లేరు. చీకటిపడింది.

"జగన్నాథం ఈ వెధవ కులాల పట్టింపులు ఎప్పుడు పోతాయంటావ్? మరో ఐదేళ్ళలో, ఆరేళ్ళలో పోతాయో లేదో" అనడిగింది చంచల ఏదో ఆలోచిస్తూ.

"ఏమో" అని సమాధానమిచ్చాడు తను.

"నువ్వు ఎప్పుడూ ఆలోచిస్తుంటావ్. ఎందుకూ పనికిరాని ఆలోచనలు" అంది భుజంమీద కొడుతూ,

నవ్వాడు తను. కురుపాం మార్కెట్ బస్‌స్టాపులో బస్ ఇద్దరూ దిగినా, ఎవరిమానాన వాళ్ళు ఇల్లు చేరేటప్పటికి ఎదురైన అమ్మ "ఇప్పుడే వస్తానని మూడు గంటలు తరువాతా రావడం. కాళ్ళు కడుక్కుని రా అన్నం వడ్డించేస్తాను" అంది. గబగబా కాళ్ళు తడుపుకుని, ఏలకులు, జీడిపప్పు, కిస్‌మిస్‌లతో ఉన్న పరమాన్నంని జుర్రాడు తను. పుట్టినరోజు గడిచాక, రాత్రి పది గంటలకి పరుపుమీదకి చేరాడు. ఐదేళ్ళలో కులాల పట్టింపులు పోతాయా? అనడిగింది చంచల ఆనాడు. అది జరిగిన నలభై ఐదేళ్ళ తరువాత కులాల కుమ్ములాట ప్రతీ రోజుకీ పెరుగుతోందే కాని తరగడంలేదు, అనుకుంటుంటే కళ్ళు మూతలు పడ్డాయి.



"హలో నేను చంచలని. హాస్పిటల్లో పని వుండి మీ ఊరికి వచ్చాను. పది నిమిషాలలో తయారయి ఉండు, నేను వస్తున్నాను. లంచ్‌కి వెళ్దాం" అంటూ ఫోన్ కట్ చేసింది చంచల. "అయితే చంచల మారలేదన్నమాట" అనుకుంటూ సోఫాలోంచి లేచి బట్టలు మార్చుకుని, తను బైటకి వెళ్తున్నట్లు ఒక చిన్న చీటీ రాసి ఫ్రిజ్‌మీద దానిని ఉంచి తలుపులు వేసి బైటకి వస్తుంటే టొయోటా లెక్సెస్ కారు డ్రైవ్‌వేలో ఆగింది. చంచల కారు కిటికీలని తెరచి "హలో, ఏమైనా ఆలస్యముందా?" అనడిగింది.

"లేదు'' అంటూ చంచల పక్కన కారు సీట్లో సర్దుకుని సేఫ్టీబెల్ట్ తగిలించుకున్నాడు. డ్రైవ్ వేలోంచి కారుని రోడ్డుమీదకి మళ్ళించి కారు వేగం పెంచింది చంచల.

"ఆలోచించుకోవడానికి కూడా వీలులేకుండా నీదంతా తొందర వ్యవహారం" అన్నాడు జగన్నాథం.

"దీనిలో ఆలోచించుకోవడానికి ఏముంది? నువ్వు ఏదేశానికైనా ముఖ్య

మంత్రివా? లేక పెద్ద కంపెనీకి వైస్‌ప్రె సిడెంట్‌వా? ఇంటిలో చాలా పనులున్నా యా? గోళ్లు గిల్లుకుని టెలివిజన్ చూడ డంకంటే నీకు ముఖ్యమైన పనులేవి? ను వ్వు అలా పోజు కొట్టకు'' అంటూ నవ్వింది. మీదకి లేచిన చెక్కిళ్లమీద అమావాస్య వెళ్ళి న పాడ్యమినాటి చంద్రుని ఆకృతిలా లీలగా బుగ్గమీద లొత్త ఏర్పడింది.

"కాని అలనాడు లొత్తలో ఉన్న లోతు ఈనాడు లేదు'' అనుకున్నాడు జగన్నాథం. ఒకపక్క రోడ్డుమీద దృష్టిని నిలుపుతూ, కనుకొలకులలోంచి జగన్నాథంవేపు చూస్తూ.

"ఏమిటి అంత పరీక్షగా చూస్తున్నావు?" అనడిగింది చంచల.

"ఆనాటి చంచల పోలికలకోసం వెతుకు తున్నాను''

"కనిపించాయా?"

"లీలగా కనిపిస్తున్నాయి''

"ఇక్కడకి దగ్గరగా 'బోడీన్' అన్న ఫ్రెంచ్ కాఫీ హౌస్ ఉంది. కాఫీ బాగుంటుంది. దానితోపాటు అల్పాహారం రుచికరంగా ఉంటుంది. నేను చాలా లైట్‌గా లంచ్ తింటా ను. ఖాళీగా ఉంటుంది. కబుర్లు చెప్పుకోవ చ్చు''

"నేను లంచ్ తినేశాను. నువ్వు అన్నట్లు నాకు పని లేకపోవడంతో అదే నాకు ఉదయం పెద్దపని''

"డోంట్‌బాదర్. కాఫీ తాగుదువుగాని. ను వ్వు ఎప్పుడైనా బిస్కోట్ తిన్నావా? కరకరా శబ్దం చేస్తూ బాగుంటుంది'' అంటూ కారుని పార్క్ చేసింది చంచల. ఆమె వెనకాతలే కాఫీ హౌస్‌లోనికి ప్రవేశించాడు జగన్నాథం.

"అమెరికా వచ్చినా, నా చిల్లర ఖర్చు నువ్వు భరించడం మానలేదు'' అన్నాడు జగన్నాథం. చంచల డబ్బు ఇస్తుంటే ఆ వాక్యంలో దాగివున్న నిస్సహాయత పసిక ట్టిన చంచల.

"నాకు ఆర్థిక స్వాతంత్ర్యం ఉంది ఈ దేశంలో. నువ్వు అంతగా నొచ్చుకోవడానికి దీనిలో ఏమీలేదు. ఈమారు నువ్వు ఇద్దువుగా నిలే' అంది.

"గత నలభై ఏళ్ళలో ఏం జరిగినదీ ఈ మారైనా చెప్పు. నీతో రెండు వాక్యాలు మాట్లాడేసరికి ... విఘ్నం రావడం మామూ లయింది'' అన్నాడు జగన్నాథం.

"విశాఖపట్నం వదిలేక బెంగుళూరులో మెడిసిన్ వెలిగించాను. మా తాతగారి కుటుంబానికి ఇంకో కుటుంబానికి తరతరా లుగా ఆస్తి వ్యవహారాల తగువులుండేవి. నేను ఇంటర్మీడియట్‌లో ఉన్నప్పుడు డబ్బు కి ఇబ్బంది పడినా మేము ఆ సంవత్సరం గడిచాక, తీర్పు మావైపు రావడంతో ఆస్తి చేతికి వచ్చింది. డొనేషన్ కట్టి మెడిసిన్‌లో చేరాను. తరువాత పాండిచ్చేరిలో పోస్ట్‌గ్రా డ్యుయేషన్ ముగియబోతుంటే ఇండియా వచ్చిన రాఘవ నన్ను చూసి ఇష్టపడి పెళ్ళి చేసుకుంటానని ముందుకు వచ్చాడు. అప్ప ట్లో నా ఉద్దేశాలు నీకు తెలిసినవే. ఒప్పుకు న్నాను. ఈ దేశం వచ్చి అరవైఅయిదుమైళ్ల వేగంతో పరిగెత్తడానికి ప్రయత్నం చేస్తూనే జీవితం వెళ్ళింది. మొదట్లో ఆఫీసుల్లో పనిచే సిన రాఘవ, ఇతరుల కింద పనిచేయడానికి ఇష్టపడక బిజినెస్‌లోనికి దిగాడు. రెండేళ్ళు బాగా నడిచిన బిజినెస్, నాలుగైదేళ్ళయ్యేసరి కి పూర్తిగా క్షీణించడంతో ఆ బిజినెస్‌కి స్వస్తి చెప్పి ఇంకో బిజినెస్‌లో దిగేవాడు. ఇప్పటికి నాలుగు బిజినెస్‌లు అయ్యాయి. ఇప్పుడు స్టాక్‌మార్కెట్‌లోనికి దిగాడు. నాకు వివరాలు తెలియవు కాని ఒకరోజు స్టాక్‌మార్కెట్ ఐదు వందల పాయింట్లు పడినరోజు, ఎనభైవేల డాలర్లు నష్టపోయేడని తరువాత తెలిసింది. ఇంటిని తనఖాపెట్టి అప్పు తెచ్చి ఆ నష్టం భర్తీ చేశాడు. నేను ప్రత్యేకంగా అడగకపోయి నా, పైదేశంనుంచి వచ్చిన తనకి బిజినెస్ ఇవ్వకపోవడంవలన ఇలా జరుగుతోందని కారణం చెబుతాడు. బిజినెస్ బాగా నడవక పోవడంతో బ్లడ్‌ప్రెషర్ పెరిగింది. ఎవరైనా ఏదైనా నిష్కపటంగా సలహా చెబితే అది

తనని కించపరచడానికే అన్న ఆలోచన రాఘవ మెదడులో బాగా నాటుకుపోవడంవలన సలహా ఇచ్చేవాళ్ళు తగ్గుతూ ముఖప్రీతి మాటలు చెప్పి, పార్టీలకోసం ఇంటికి వచ్చేవారు ఎక్కువయ్యారు. బిజినెస్ పేరు చెప్పి పార్టీలు ఎక్కువవడంతో మోతాదుకి మించి డ్రింక్ అలవాటయింది. పాతికేళ్ళక్రితం ఎలాంటి ఆర్థిక పరిస్థితిలో ఉండేవాళ్ళమో ఈరోజు అదే స్థానంలో ఉన్నాం. మనలో చాలామంది తమ లోపాలని కప్పిపుచ్చుకోవడానికి ఇతరులని నిందిస్తారు. అబ్బో! ఈ దేశం జీవన సరళిలో అదొక ముఖ్యభాగం. నువ్వు గమనించే ఉంటావు ఈ భాగోతాన్ని.

"చేపా, చేపా, ఎందుకు ఎండలేదు?" అన్న కథలో సాకులలా, "ఏం నాయనా, నీ చదువు బాగుండకపోవడానికి కారణమేమిటి?" అని ఒక విద్యార్థిని అడిగితే,

"మా నాన్న తాగుబోతనో? మా అమ్మ డ్రగ్స్ తీసుకునేది, మమ్మల్ని సరిగ్గా చూసేది కాదనో' కారణం చెబుతారు. అది బాగా వంట పట్టింది రాఘవకి. ఈ రోజుల్లో ఇంకెవర్నీ నిందించడానికి వీలులేక కాబోలు,

"దీనంతటికీ నువ్వే కారణం చంచలా'' అంటూ మొదలుపెడుతున్నాడు. అలా అన్నాడుకదా అని ఒకరోజు తప్పించుకు తిరిగాను. తనకి ఆవేళ ఇబ్బందవడంతో మర్నాడు నామీద మరింత విరుచుకుపడ్డాడు. పిల్లలు లేరు కాబట్టి సరిపోయింది'' అంటూ కాఫీని చప్పరించింది చంచల.

చంచలవేపు చూస్తుంటే జగన్నాథంకి విశాఖపట్నం రోజులు జ్ఞాపకానికి వచ్చాయి. మొహంమీదకి సన్నని చిరునవ్వు చిందింది. అది చూసి "నా కథ నీకు నవ్వుతాలుగా ఉందా?" అనడిగింది చంచల.

"భలేదానివే అదేమీ కాదు. నాకు ఎందుకో విశాఖపట్నం రోజులు జ్ఞాపకానికొచ్చాయి. నీకు జ్ఞాపకం ఉందా? అతని పేరు చైతన్య కాబోలు. దాదాపు నలభైఏళ్ళ వయస్సు మనిషి, మెడ్రాసులో ఫిల్మ్ కంపెనీ నడిపి ఆస్తి కరిగిపోతే రెండు నెలలపాటు మేడమీద పోర్షనులో ఉన్నాడు. అతను మన ఇంటి యజమానికి దగ్గర బంధువు. అతని గదిలో హెచ్.ఎమ్.వి. కంపెనీ గ్రామ్‌ఫోన్ నిరంతరంగా మోగేది. ఆయనకి భానుమతి పాటలన్నా, కాంచనమాల పాటలన్నా ఇష్టం. అయితే ఆయన దగ్గర ఉన్న గ్రామ్‌ఫోన్ రికార్డులు వందలసార్లు తిరగడంవలనో, ఏమో కాని గ్రామ్‌ఫోన్ పిన్ను ఒకే గాడిలో ఇరుక్కుపోయి 'తెలియవశమా? ఆహాహ' అంటూనో, 'ఓహోహో పావురమా' అంటూనో పదేపదే పలుకుతూ అతను వచ్చి పిన్నుని కదిపేవరకు ఇబ్బంది కలిగించేది. నిజానికి ఆయన దగ్గర ఉన్న ప్రతీ రికార్డ్‌కీ ఇలాంటి ప్రోబ్లెమ్ ఉండేది.

"ఏమండీ, ఆ రికార్డులు అన్నీ అరిగిపోయాయి. మీకు బాగా డబ్బు ఉందికదా, పాతవాటిని పారేసి కొత్త రికార్డులు కొనుక్కోకూడదూ?" అనడిగేను ఉండబట్టలేక.

"అవి ఇష్టపడి నేను కొనుక్కున్న రికార్డ్లు, అవి ఎలా పారేయను?" అని తిరిగి ప్రశ్నించాడు. ఆనాడు అతని సమాధానం నాకు పూర్తిగా అర్థమవలేదు'' అంటూ నవ్వాడు జగన్నాథం.

"ఆ రోజుల్లో నీకు నోటంబడ మాట పెగిలేది కాదు. ఈరోజు పిట్టకథలు చెప్పడం అలవడింది. ఆ సంగతి వదిలేయ్. నీ సంగతేమిటి, తృప్తిగా జీవితం వెళ్తోందా?"

"ఇబ్బందులు పడకుండా రోజులు వెళ్తున్నాయి. ఇహ తృప్తంటావా? పూర్తిగా తృప్తిపడిన మానవుని చూపించు''

"జగన్నాథం! సీతాకోకచిలుక కోసం పరిగెత్తినంతకాలం అది మనల్ని తప్పించుకుని తిరుగుతుంది. దాని గురించి తాపత్రయపడకుండా నిశ్చింతగా కూర్చుంటే అది వచ్చి మనమీద వాలుతుంది. జీవితంలో తృప్తి అన్నది ఆ సీతాకోక చిలుకలాంటిదే''

జగన్నాథం ఏమీ మాట్లాడలేదు.

"నీ దినచర్య ఏమిటి?" అనడిగింది చంచల.

"లైబ్రరీనుంచి పుస్తకాలు తెచ్చి చదవడం, టెలివిజన్, రోజుకి రెండుసార్లు నడక యాంత్రికంగా గడిచిపోతుంది. వలంటీర్ పనిచేద్దామన్నా, అక్కడికి వెళ్ళిరావడానికి నరేంద్ర లేక పద్మల సహాయం కావాలి. అదొక అదనపు పనివాళ్ళకని ఆ ప్రయత్నం విరమించేను''

"ఏమీ పనిలేకుండా కాలం గడపడం కాస్త ఇబ్బందే. ఇక్కడ వయస్సు మళ్ళినవాళ్లకి అదోరకమైన ఇరకాటాలు. నీకు వయసు మళ్ళకపోయినా, నలుగురితో మసలడానికి అలవాటుపడ్డ తరువాత రోజంతా ఒంటరిగా కూర్చుని చదువుకోవడం విసుగే. నీకు ఇక్కడ బోరుగా అనిపిస్తే ఒకసారి ఇండియా వెళ్ళి రాకూడదూ? రెండు కావస్తోంది, నిన్ను ఇంటి దగ్గర వదిలివెళ్తాను'' అంటూ చంచల లేచి నిలబడింది. జగన్నాథం ఖాళీ కప్పులని చెత్తకుండీలోనికి గిరవాటేశాడు.

"నీకు ఈ ఆలోచనలో పడిపోవడం చిన్నప్పటినుంచీ ఉన్న అలవాటు. ఆ ఆలోచనలు ఒంటరిగా ఉన్నప్పుడు చేద్దువుగాని, ఏమైనా కబుర్లు చెప్పు" అంటూ ఆలోచనలోనికి ఒరగబోతున్న జగన్నాథంని హెచ్చరించింది.

రాధ, రాజుల చదువుల గురించి డిగ్రీ తెచ్చుకోవడానికి అవసరమయ్యే డాలర్ల గురించి చెబుతుంటే చంచల కారుని డ్రైవ్ వేలో ఆపి, "మళ్లీ ఈవైపు వస్తే ఫోన్ చేస్తాను'' అంటూ జగన్నాథంని ఇంటి గుమ్మం దగ్గర వదిలి కారుని రోడ్డుమీదకి మళ్లించింది.

★ ★ ★

"మా అమ్మాయి ఛాయ మీ దేశం వచ్చి నాలుగు నెలలైంది. ప్రస్తుతం చికాగోలో డెంప్స్టర్ వీధిలో ఉన్న ఎపార్ట్మెంట్‌లలో ఇతర సాఫ్ట్‌వేర్ సైంటిస్టులతో కలిసి ఉంటోంది. చికాగోలో ఇంకా ఎన్నాళ్లు ఉంటుందో తెలియదు. వీలుంటే ఒకసారి ఆమె ఎలా ఉందో చూడగలరా?" అని హరనాథ్ రాసిన ఉత్తరాన్ని నరేంద్ర చదివి వినిపించాడు.

"వచ్చేవారం వాళ్ళకి వీలయితే మనింటికి పిలుద్దాం" అన్నాడు నరేంద్ర.

★ ★ ★

జగన్నాథం ఛాయని చూసి దాదాపు ఏడెనిమిదేళ్ళయింది. రిటైరవకముందు ఏదో పనిమీద హైదరాబాదు వెళ్ళినపుడు ఛాయ ఊరిలో లేకపోవడంతో ఫొటోమాత్రం చూశాడు. ఏడెనిమిదేళ్ళలో శరీరంలో చాలా మార్పులు సహజం. ఇప్పటి ఛాయకి, ఫొటోలో ఛాయకి చాలా తేడా ఉండవచ్చు అనుకుంటుంటే బి.యమ్.డబ్ల్యు కారు డ్రైవ్ వేలో ఆగింది. ఒక ఆడపిల్ల, ముగ్గురు మగపిల్లలు, పరాచికాలాడుకుంటూ తలుపుని సమీపిస్తుంటే జగన్నాథం తలుపు తెరిచేడు.

"హలో అంకుల్, నేను గుర్తు ఉన్నానా?" అనడుగుతూ లోపలికి ప్రవేశించింది ఛాయ.

"గుర్తుండకపోవడమేమిటి? లోపలికి రండి'' అందర్నీ లోపలికి ఆహ్వానించేడు జగన్నాథం. లోపలికి వచ్చిన నలుగురూ దాదాపు ఇరవై ఐదేళ్ళ వయస్సుకి సమీపంలో ఉన్నవాళ్ళే.

"రవి, శరత్, బాలూ'' అంటూ వాళ్ళని పరిచయంచేస్తూ, "మా డాడీకి ఫ్రెండ్ జగన్నాథంగారు'' అని జగన్నాథం వేపు పరీక్షగా చూసి, "మీలో చాలా మార్పు వచ్చింది అంకుల్'' అంది ఛాయ.

"రాకేం చేస్తుంది? కాలమహిమ" అన్నాడు ఇంకేమనాలో తెలియక.

సోఫాలో కూర్చున్న రవి, శరత్, బాలూ కంప్యూటర్‌కి సంబంధించిన కబుర్లలో పడ్డారు.

"మీ నాన్నకి ఈమధ్యన ఫోన్ చేశావా? ఏమంటాడు?" అంటూ సంభాషణని మొదలుపెట్టబోతుంటే, నరేంద్ర, పద్మ, పిల్లలు తలుపు తెరుచుకుని లోపలికి వచ్చేరు. జగన్నాథం ఒకరికొకర్ని పరిచయం చేసేడు.

సంభాషణలు తిరిగి మొదలయేయి.

"మా నాన్నకి ఫోన్ చేయడం గురించి చెబుతున్నాను కదూ. ఏముంది మామూలే. కార్లు ఎక్కువగా ఉంటాయి, రోడ్లు దాటేటప్పుడు జాగ్రత్త. సాయంకాలం చీకటి పడకుండా గదికి చేరిపో. అమెరికాలో క్రైమ్ చాలా ఎక్కువ. దుండగులు వెనకాలనుంచి వచ్చి క్లోరోఫాం ఉన్న గుడ్డని మొహం మీద అదిమి, తెలివి తప్పించి తీసుకువెళ్ళడం సామాన్యంట. జాగ్రత్త అంటూ ప్రతీసారీ హెచ్చరిస్తూనే ఉంటారు. నువ్వు ఆడపిల్లవి, అందుకే ఇంతగా చెప్పాల్సి వస్తోంది అంటారు అప్పుడప్పుడు'' అంటూ నవ్వింది ఛాయ.

"మనుష్యులకి ఏళ్ళు పైపడుతుంటే చాదస్తం ఎక్కువవుతుంది. అందులో ఆశ్చర్యం ఏముంది? మీనాన్న పేపరులో అమెరికా గురించి రాసినది చదువుతాడు. దాదాపు మూడు వందల మిలియన్ల కార్లు రోడ్లమీద ఉన్నాయని చదివి, దానిని హైదరాబాదు రోడ్లమీద తిరిగే వాహనాలతో లెఖ్ఖవేసి చూసి, అయ్య బాబోయ్! ఇంతకు పదింతల కార్లా? ఛాయ రోడ్డు దాటేటప్పుడు ఎంత కష్టపడుతోందో? అని భయపడతాడు'' అంటూ హరనాథ్ భయాలకి కారణాలని ఆపాదించబోయేడు జగన్నాథం.

"పోనీ, మీరు కార్ల గురించి చెప్పినది సరి అయిన భయమే అని ఒప్పుకుందాం. మరి దీని సంగతేమిటి? నేను డిగ్రీ పుచ్చుకున్నాక ఒకసారి ఢిల్లీకి ఇంటర్వ్యూకి వెళ్తున్నాను. ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్‌లో పక్క బెర్త్ కాకుండా లోపలి బెర్త్ రిజర్వ్ చేయించేరు. నన్ను సాగనంపడానికి స్టేషన్‌కి వచ్చి,

"ఛాయా, చేతులు బైటకి పెట్టకు, దగ్గరగా ఎలక్ట్రిక్ స్థంభాలుంటాయి'' అన్నారు. ఎవరైనా మా మాటలు వింటున్నారేమోనని అటూ ఇటూ చూశాను. ఎవ్వరూ లేరు. ఊపిరి పీల్చుకుంటుంటే మరొక బాంబు పేల్చేరు



అంటూ ఆగింది ఛాయ. ఏమీ పట్టించుకోకుండా గలగలా మాటలాడుతున్న ఛాయని చూసి ముచ్చటేసింది జగన్నాథంకి.

"బాత్రూమ్‌కి వెళ్ళేటప్పుడు జాగ్రత్త. లోపల గొళ్ళెం అప్పుడప్పుడు జామ్ అయిపోతుంది'' అన్నారు. నా బెర్త్‌కి ఎదురుగా ఉన్న బెర్త్‌లు ఆక్రమించబోతున్న కుర్రాళ్ళు నావేపు ఇదిగా చూస్తే ఎంత సిగ్గేసిందో'' అంది పాత జ్ఞాపకం దాని వలన కలిగిన సిగ్గు, ఛాయ మొహంలోనికి రక్తాన్ని చిమ్మేయి. ఛాయ మొహం కందిపోయినట్లు ఎర్రపడింది.

"మనం చూసుకోకుండా పరాకుగా రోడ్డు మీద నడుస్తుంటే రాయి కాలికి తగిలితే, రక్తం కారుతుంది. మర్నాడు అదే రోడ్డంబట వెళ్తున్నపుడు ఆ ప్రదేశానికి రాగానే మనకి ముందటిరోజు కాలికి దెబ్బ తగలడం జ్ఞాపకానికి వచ్చి, మళ్ళీ దెబ్బ తగులుతుందేమోనని జాగ్రత్తపడతామా? లేదా? మీ నాన్నకి వ్యక్తిగతంగా అయిన అనుభవాలు కొన్ని, పరోక్షంగా విన్న దుర్ఘటనలు కొన్ని, వాటిని ఆధారంగా ఉంచుకుని నీకు జాగ్రత్తలు చెబుతున్నాడు'' అన్నాడు జగన్నాథం.

"మా బామ్మ, మానాన్నని కంటికి రెప్పలా కాచి పెంచింది. నన్ను అలాగే పెంచాలని మా నాన్న తాపత్రయం. కాని అంకుల్, ప్రపంచం అప్పటినుంచి చాలా ముందరికి పరిగెత్తింది. అది మనం గ్రహించాలి'' అంది ఛాయ. తల ఊపేడు జగన్నాథం. అతిథులకి ఏమి కావాలో వాకబుచేసి వంటింటిలోకి వెళ్ళేడు నరేంద్ర.

రెండు నిమిషాల తరువాత నరేంద్ర, కాఫీలని ట్రేలో ఉంచి తీసుకురాగానే అందరూ వాటిని అందుకున్నారు.

మరొక గంట కూర్చున్నాక అతిథులు లేచి వెళ్తుంటే,

"మీరు చికాగోనుంచి కొత్త చోటుకి మారేలోగా ఒక శనివారం డిన్నర్‌కి రావాలి. ఫోన్‌చేసి తారీకు చెబుతాను'' అంది పద్మ. నలుగురు అతిథిలూ తలలూపేరు. జగన్నాథం ఆశ్చర్యపడుతుంటే,

"వస్తాను అంకుల్, ఈమారు ఫోన్ చేసిన

పుడు మిమ్మల్ని చూసేనని మా నాన్నకి చెబుతాను'' అంటూ ఛాయ నిష్క్రమించింది. వాన వెలిసినట్లు ఒక్క సారి గదిలో వాతావరణం మారింది.

"ఛాయా ఈజ్ స్మార్ట్, ఐ లైక్ హర్' అంది రాధ. రాజు తల ఊపేడు.

"అందంగానే ఉంది. కాని ఇండియా నుంచి వచ్చిన ఆడపిల్ల, ముగ్గురి మగాళ్ళతో ఒకే ఎపార్ట్‌మెంట్‌లో నివశిస్తుంటే ఏమిటో ఎబ్బెట్టుగా ఉంది'' అంది పద్మ.

"మమ్మీ'' అంది రాధ దానికి అభ్యంతర పెడుతూ. పద్మ వెంటనే ఏమీ జవాబీయలేదు.

"ఈ దేశంలో అపార్ట్‌మెంటులలో, ఇళ్ళలో గదులు పంచుకుంటూ అపరిచితులే ఉంటుంటే, తెలిసినవాళ్ళతో ఒకే అపార్ట్‌మెంట్‌లో ఉండడానికి అభ్యంతరమేమిటి?'' అంది రాధ.

"మన సంప్రదాయాలు వేరుకదా; అదే నేను చెప్పేను?'' అంది వాదనని పెంచుతూ పద్మ.

"మమ్మీ, నాలుగు రోజులక్రితం 'అక్కడ సంప్రదాయం ఇక్కడ పనికిరాదన్న నువ్వే, ఈరోజు ఇలా అంటున్నావేమిటి?'' అంటూ ఫక్కున నవ్వింది రాధ.

గుడ్లురిమి చూసింది పద్మ.

"ఆ అమ్మాయి శరత్‌తో చనువుగా మసలడం చూశాను, పెళ్ళికానిపిల్లకి అంత చనువు పనికిరాదు'' అంది పద్మ కొత్తవాదాన్ని ప్రవేశపెడుతూ.

"పద్మా, చిన్న చిన్న ఊర్లలో, మనం గతంలో మసలినట్లు, ఇప్పుడు, ఇరవై ఏళ్ళ తరువాత, అమెరికా ఉద్యోగానికి వచ్చిన పిల్లలని ఉండమంటే ఎలా? నీకేమైనా ప్రత్యేకంగా కనిపించిందేమోకాని ఆ పిల్ల అందరితో ఒకేలా మాటలాడుతోంది. రాధా, నువ్వు మీ స్కూల్లో మగపిల్లలతో మాటలాడటావా?'' అనడిగేడు నరేంద్ర.

"అఫ్‌కోర్స్. ఎవరితోనూ మాటలాడకుండా ఉంటే మనల్ని వెలివేస్తారు. అసలే మనశరీరపు రంగు వాళ్ళ దానితో కలవదు. దానికితోడు ముంగిలా కూర్చుంటే ఇంక అడగనక్కరలేదు'' అంది రాధ. "మనం వాళ్ళలా ప్రవర్తించలేం. ఎవరినిపడితే వాళ్ళని, ఇష్టపడితే పెళ్ళిచేసుకుంటారు'' అంది పద్మ.

"రేపు సంగతి ఎవరు చెప్పగలరు? నాకు బాగా నచ్చితే అమెరికన్‌ని తెలుపైనా, నలుపైనా పెళ్ళిచేసుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు'' అంది రాధ. పద్మ మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్కలేదు.

"మీరందరూ ఈవేళ నామీద కక్ష కట్టారే'' అంటూ లేచివెళ్ళింది పద్మ.

ఛాయ ఉన్నపుడు, కేరింతలు కొడుతూ ఉన్న వాతావరణం గంభీరంగా మారింది.

"నేను అలా రెండడుగులు వేసివస్తాను'' అంటూ జగన్నాథం జోళ్ళు వేసుకుని ఇంట్లోంచి బైటకి వచ్చాడు.

"తొందరగా వచ్చేయండి నాన్నా, లంచ్ కలిసి తిందాం'' అన్నాడు నరేంద్ర. ఇంట్లోంచి బయటికి వచ్చిన జగన్నాథంని చల్లని గాలి స్పృశించి వేడెక్కిన మెదడుని చల్లబరచ ప్రయత్నిస్తోంది.

"ఛాయ భయంలేకుండా అమెరికన్ వాతావరణంలో అతిసునాయాసంగా ఇమిడిపోయింది'' అంటూ హరనాథ్‌కి ఈవేళ ఉత్తరం రాసిపడేస్తాను అనుకుంటుంటే ఛాయ మసలిన తీరు జ్ఞాపకానికి వచ్చింది. కొందరు వ్యక్తులు అందరితోనూ కలుపుగోరుతనంగా మాట్లాడగలరు. కొందరు ఎవరితోనూ కలవరు. లోకంలో రకరకాల వ్యక్తులు ఉంటారని మనకి తెలిసినా మనకి భిన్నంగా ఉన్న వ్యక్తి ఎదురుపడి మనకి నచ్చనట్లు ప్రవర్తించినా, ఆ వ్యక్తిలో లోపాలు వెతక ప్రయత్నిస్తాం. పద్మ, ఛాయ శరత్‌తో సన్నిహితంగా మాట్లాడుతున్నట్లు అనుమానపడింది. అదే దృశ్యాన్ని చూసిన నరేంద్రకి అది కనిపించలేదు. రాధకి ఛాయ, ఛాయ ధోరణి బాగా

నచ్చాయి. అది అలా ఉండగా పద్మ వాళ్ళందరినీ లంచ్‌కి పిలవడంలో ఉద్దేశమేమిటి? ఛాయ ధోరణి నచ్చకపోయినా వాళ్ళందర్నీ భోజనానికి రమ్మంటే పద్మ ఆలోచనలు ఆ కుర్రాళ్ళమీద ఉన్నాయనుకోవచ్చా? లేక అది ఊహేనా? తను అనవసరంగా పద్మకి లేని చెడ్డ కారణాలను అంట కడుతున్నాడేమో అనుకుంటూ చల్లగాలి తాకిడి భరించలేక చేతులతో చెవులని మూసుకున్నాడు జగన్నాథం.

★ ★ ★

రాత్రి పదకొండయినా నిద్ర రావడంలేదు జగన్నాథంకి. గత రెండు నెలలుగా రాత్రి నిద్రపట్టడం ఆలస్యమవుతోంది. ఈ మార్పుకి కారణమేమిటి? ఏళ్ళు పైపడడమా? శరీరానికి వ్యాయామం తక్కువయి శరీరం తక్కువ విశ్రాంతిని అడుగుతోందా? లేక సాయంకాలం కాఫీ తాగడంవలన నిద్ర కరువవుతోందా? ఇవేవీకాక తను మెదడుని అర్థంలేని ఆలోచనలలోనికి తోసి నిద్రపోనివ్వకుండా చేస్తున్నాడా?

ఏమిటో ఈ ఆలోచనరోగం తనకి చాలాకాలంగా ఉంది. చంచల తనని ఎన్నోసార్లు,

"అర్థంలేని ఆలోచనలు'', "పనికిరాని పరిజ్ఞానం నీది'' అంటూ ఏడిపించేది. చటుక్కున ఆలోచనలలోనికి వెళ్ళిపోవడం తనకి కొత్తకాదు. ఒకసారి చంచల తనకి మొట్టికాయ పెట్టింది తన పరధ్యానం పోగొట్టడానికి! దీనిని తగ్గించే మార్గం ఉందా? అనుకుంటుంటే హరనాథ్, హరనాథ్ రాసిన ఉత్తరం జ్ఞాపకానికి వచ్చాయి.

హరనాథ్ సాంప్రదాయపు మనిషి. ఇరవైఒకటి-ఇరవైరెండేళ్ళు వచ్చేసరికి కూతురికి పసుపు పారాణి రాసి ఒక అయ్య చేతిలో పెట్టి బాధ్యత తీరిందని ఊపిరి పీల్చుకునే రోజుకోసం ఎదురుచూస్తున్న వ్యక్తి. అలాంటిది ఇరవైనాలుగేళ్లు వచ్చినా కూతురు ఛాయ పెళ్ళి గురించి తలపెట్టకుండా ఒంటరిగా అమెరికా వెళ్ళిందని అమెరికా ఉద్యోగం కూతురి పెళ్ళికి ప్రతిబంధకం అవుతుందేమోనన్న అనుమానం వ్యక్తపరిచాడు హరనాథ్.

"ఒక్కసారి ఛాయ ఎలా ఉందో చూడగలవా?" అని రాయడంలో ఉద్దేశం తనకి అర్థమైంది. తనకి సరిగ్గా అర్థమవదేమోనని ఆఖర్న, "ఛాయకి మంచీ, చెడూ, ఆనవాయితీల గురించి జ్ఞాపకం చెయ్యి'' అని రాసి ఉత్తరాన్ని ముగించాడు.

పరవళ్లు తొక్కే జలపాతంలాంటి ఛాయని ఎవ్వరూ ఆపలేరు. చదువులో, ఉద్యోగంలో నిర్దుష్టభావాలు గలదని విశదమవుతోంది.

"మంచీ, చెడు, ఆనవాయితీల గురించి ఛాయకి చెప్పు" అన్నాడు హరనాథ్.

ఒంటరిగా ఉద్యోగానికి అమెరికా రావడం మంచిదికాదని ఎలా చెప్పడం? ఆర్థికంగా ఉద్యోగంలో పెరుగుదలకి ఉన్న అవకాశం, మేధకి ఉన్న విలువ అమెరికాలో ఉన్నట్లు ఇంకేదేశంలో లేదని అందరికీ తెలిసినప్పుడు అది కాదని ఛాయకి ఎలా నచ్చచెప్పడం? అదీకాక ఈ దేశంలో ఉన్న ఛాయకి నిజానిజాలు తెలియకపోతేకదా చెప్పడం? ఆడపిల్ల ఒంటరిగా ముగ్గురి కుర్రాళ్లతో కలిసివుండడం ఇండియాలో ఉన్న ప్రజలకి ఎబ్బెట్టుగా ఉండవచ్చు. కార్లు లేనిచోట ఇంటికి కావలసిన సామాన్లు తెచ్చుకోవడానికి, సమయానికి ఆఫీసుకి వెళ్ళిరావడం, అవసరమైతే సాయంకాలం ఏడు-ఎనిమిది గంటలవరకు ఆఫీసులో ఉండవలసిన అగత్యం ఏర్పడితే అనివార్యంగా ఇంకొకరి సహాయం కోరడంతప్పదు. పరాయిదేశంలో ఒంటరిగా బతకడం అంత సులువైనపని కాదు. పెర్మనెంట్ ఉద్యోగం వచ్చేంతవరకు ఊరూ ఊరూ మారుతున్నప్పుడు తెలిసిన వ్యక్తులతో ఒకే అపార్ట్‌మెంట్‌లో ఉండడం చాలా శ్రేయస్కరం. ఒంటరిగా ఉండడంలో ఇంకా ఎక్కువ సమస్యలు ఎదురవుతాయి. హైదరాబాద్‌లో ఉదయం ఏడెనిమిది గంటలకి బయలుదేరిన ఆడపిల్ల, సాయంకాలం ఆరు

ఏడు అయితే కాని ఇల్లు చేరదు. ఆ పన్నెండు గంటలలో విశృంఖలంగా తిరగాలన్నా, బాధ్యతతో ప్రవర్తించాలన్నా ఆమెమీద ఆధార పడి ఉంటుంది. అన్ని అవకాశాలు హైదరాబాదులోనే ఉన్నాయి. ఛాయలాంటి వ్యక్తికి, హైదరాబాదైనా అమెరికా అయినా ఒక్కటే. ఛాయ ఒంటరిగా ముగ్గురి కుర్రాళ్లతో ఒకే అపార్ట్‌మెంట్‌లో ఉండడంవలన పెళ్లి ప్రశ్న వచ్చేసరికి ఛాయకి ఇబ్బంది అవుతుందేమోనని పద్మ అభిప్రాయపడింది. ఒక్క ఛాయకేనా ఇబ్బంది? ఆ ముగ్గురి కుర్రాళ్లకీ ఏమీ ఇబ్బంది ఉండదా?

చంచల మళ్ళీ ఆలోచనలోనికి వచ్చింది.

విశాఖపట్నంలో తను ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో ఇసుకతోటలో వ్యభిచారం అతిముమ్మరంగా సాగేది. బౌడారా రోడ్డు దగ్గరగా ఉన్న లాడ్జిలు చీకటి వ్యవహారాలకి ఆలయాలు. ఒకరోజు డబ్బు మామూళ్ళు అందకో లేక గెడ్డం గీసుకుంటున్నప్పుడు చెంపమీద గాయమై రక్తం కారి మండిపోవడంవలనో ఏమోకాని సబిన్స్‌పెక్టర్ లాడ్జీల మీద రెయిడ్ చేశాడు. సుమారు పదిమంది స్త్రీలు, అంతేమంది పురుషులు దొరికితే, స్త్రీలని మాత్రం లాకప్‌లోనికి తోసేశారని పేపరులో పడింది మర్నాడు.

"ఈ కార్యంలో ఇద్దరికీ భాగం ఉందికదా. మరి పురుషులని ఎందుకు వదిలేశారు?" అనడిగింది చంచల తనని.

దానికి తన దగ్గర సమాధానం ఏదీ? ఎవరి దగ్గర మాత్రం సమాధానం దొరుకుతుంది? మౌనం వహించాడు. "అమెరికా సినిమాలు చూసి వాటికి కాపీ సినిమాలు తీస్తాం. అమెరికన్లు జీన్స్ వేసుకుంటారని మనమూ ఆ దారంబటే వెళ్తాం. అమెరికాలో ఉన్న స్వాతంత్ర్యం, జీతాలు కావాలని అభిలషిస్తాం. కాని సాంఘిక సమస్యలు వచ్చినప్పుడు ఇతరులని బేరీజు వేసేటప్పుడు అమెరికా ధోరణి జ్ఞాపకానికి రాదు, అది పట్టించుకోం" అంటూ జగన్నాథం విచారపడ్డాడు.

చంచలతో రెండు సంవత్సరాల పరిచయంలో ఆమె ప్రశ్నలతో తనని చిత్తుచేసి నిష్క్రమించాక తనలో అలజడి మొదలయి, తన ఆలోచనాధోరణి తీవ్రమై తనని వ్యక్తిగా ఒక కొత్త ఎత్తుకు నెట్టింది. దానికి కారణం చంచలే! 'హేట్సాఫ్ టు యు చంచలా!' అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు జగన్నాథం.



"అంకుల్, మీతో మాట్లాడాలి. మీ గదిలోనికి వెళ్దాం" అంది ఛాయ మెల్లిగా జగన్నాథంతో ఇంకెవరికీ వినిపించకుండా.

"నా గది చూద్దువుగాని రా'' అంటూ ఛాయని లోపలికి ఆహ్వానించాడు జగన్నాథం. హాలులో ఉన్న ఇతరులు ఏమీ పట్టించుకోలేదు. జగన్నాథం వెంట నడిచింది ఛాయ.

"ఇప్పుడు చెప్పు" అన్నాడు జగన్నాథం ఛాయ పరుపుమీద కూర్చోగానే.

"మీ సహాయం కావాలి అంకుల్, మీ మాటంటే మా డాడీకి చాలా గురి'' అంటూ మొదలుపెట్టింది ఛాయ. జగన్నాథం ఛాయ వేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఎలా మొదలుపెట్టాలో తెలియడంలేదు. నేను హైద్రాబాద్‌లో కంప్యూటర్స్ డిగ్రీ చేస్తున్నప్పుడు సారధి అనే ఒక క్లాస్‌మేట్‌తో

పరిచయం అయింది. సారధికి అమెరికా రావడానికి ప్రత్యేకంగా ఉత్సాహంలేదు. కాని నాకు ఈ దేశం రావడానికి ఆసక్తి ఉంది. ఇక్కడికి వస్తే మూడు నాలుగేళ్ళు పనిచేసి మిగిల్చిన డబ్బు, ఇండియాలో జీవిత మంతా కష్టపడినా సంపాదించలేమని నే నంటే దానితో సారధి ఏకీభవించలేదు. నేను ఈ దేశం వచ్చాను. ఒకరంటే ఇంకొకరికి ఉన్న కాంక్ష ఎంత బలమైనదో దూరంగా వచ్చేశాక కాని తెలియలేదు. సారధి హైద్రా బాద్‌లో పనిచేస్తున్నాడు. నా సలహామీద ఈదేశం రావడానికి ప్రయత్నం చేస్తున్నాడు. సారధి ఈ దేశం రాగానే పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాం. ఇంకో ఆరునెలలలో అత నికి వీసా రాకపోతే నేను హైద్రాబాద్ వెళ్ళి పెళ్ళి చేసుకుంటాను. అల్లుని విషయంలో మా నాన్న సంప్రదాయపు కోరికలకి, సారధికి ఉన్న అర్హతలకి చాలా వ్యత్యాసముంది. మా నాన్నని బాధపెట్టి పెళ్ళిచేసుకోవడం నాకి ష్టంలేదు. అలాగని నా కోరికలకి విరుద్ధంగా మసలలేను. మీరంటే మా నాన్నకి సదభి ప్రాయం ఉంది కాబట్టి, మీరు నా తరఫున రెండుముక్కలు రాయండి'' అంటూ ఛాయ అర్థించింది.

"నువ్వు ఇక్కడ అమెరికాలో ముగ్గురి కుర్రాళ్ళతో ఒకే ఎపార్ట్‌మెంట్‌లో ఉంటున్న సంగతి సారధికి తెలుసునా? దానికి అతను అభ్యంతరం చెప్పడా?" అనడిగాడు జగ న్నాథం.

"అమెరికాలో జీవనవిధానం గురించి సారధికి బాగా తెలుసు. బావా, రవి, శరత్‌లు సారధికి బాగా తెలిసినవాళ్ళే. పెళ్ళి చేసుకో బోతున్న ఇద్దరు వ్యక్తుల మధ్య ముఖ్యంగా నమ్మకం, మర్యాద ఉండాలి. అవి లేనప్పు డు ఆ సహజీవనంలో అర్థంలేదు. అన్ని కుటుంబాలలో ఇవి ఉన్నాయా? అని మీరడ గవచ్చు. అది నాకు తెలియదు. ఇవి లేకపో యినా కాని కొన్ని కుటుంబాలలో భార్యాభర్త లు కలిసి ఉండడానికి పిల్లలో, ఆర్థిక ఇబ్బందులో ఇంకేవో కారణాలు కని పిస్తాయి. మీరు మా నాన్నకి రాస్తారు కదూ?" అనడిగింది ఛాయ.

"నువ్వు చెప్పినదాని గురించి నేను ఆలో చించాక, నే చేయగలిగినది చేస్తాను''

"మీ ఇష్టం. కాని నా నిర్ణయంలో మీకు తప్పు ఏమైనా కనిపించిందా?"

"చెప్పానుగా, నన్ను ఆలోచించుకోనీ, వె ళ్దాంపద" అంటూ ఛాయవేపు చూశాడు జగన్నాథం.

ఇద్దరూ హాలులోనికి వచ్చారు.

లంచ్ తిని అతిథులు వెళ్ళాక నరేంద్ర, పద్మ, పిల్లలు బట్టలు 'కొనుక్కోవడానికి బయలుదేరారు. జగన్నాథం ఒంటరిగా ఇంటిలో మిగిలాడు.

హరనాథ్‌కి ఛాయగురించి ఏం రాయాలి? అనుకుంటూ కాగితం, పెన్ను అందుకున్నా డు జగన్నాథం. సుమారు ఇలాంటి పరిస్థితి రెండుసార్లు తన జీవితంలో ఎదురయింది, రెండుసార్లు ఇలాంటి చర్చలో తనొక పాత్ర ధారి. మొదటిది, నీరజ డేనియల్‌ని పెళ్ళి చేసుకుందని రామస్వామి వాపోతుంటే, "ఆ మె ప్రేమించిన డేనియల్‌ని పెళ్ళి చేసుకోవ డంలో తప్పేముంది?" అని తను ధైర్యంచేసి ప్రశ్నించలేదు. సంప్రదాయం మంటకలిసిపో యిందని చింతిస్తున్న రామస్వామితో, కా లంతోపాటు సంప్రదాయం మారుతుందని తను చెప్పలేదు. మౌనంగా ఉండిపోయాడు తను ఆనాడు.

రెండవది తన బి.ఏ. డిగ్రీ పూర్తవబోతు న్నపుడు ఎదురైంది. చంచల ఇంటర్మీడి యట్ చదువు పూర్తిచేసి, పరీక్ష ఫలితాలకోసం ఎదురుచూస్తున్న ఒకరోజు, "రేపు సాయంకాలం బీచ్‌కి రా, నీతో మాట్లాడాలి'' అంది చంచల డాబామీద కనిపించినపుడు.

సాయంకాలం తొందరగా తయారయి బీచ్‌కి చేరి, యధాప్రకారం చంచలకోసం ఎదురుచూస్తుంటే, అట్టేసేపు నిరీక్షించ కుండానే చంచల వచ్చింది.

ఆవేళ చంచల ప్రత్యేకంగా అలంకరణలో

శ్రద్ధ చూపిందన్నది నిర్వివాదాంశం. కంటిరెప్పలమీదకి కాటుక, కనుబొమ్మల మీద నలుపురంగు దిద్దింది. మెడలో ముత్యాల దండ రెండుభాగాలు చేసి, ఒకభాగం కంఠాన్ని ఆనుకునేట్లు, రెండవది జాలువారేటట్లు వేసుకుంది. అంతకుముందు తనెప్పుడూ చూడని చెవిజూకాలు. మొహానికి పౌడరు అద్దింది. గోళ్ళకి ఎరుపురంగు, కొమ్ములు తిరిగిన వంకీలని వదిలి మిగతా జుత్తుని ఎర్రని రిబ్బన్‌తో కట్టి ఉంచింది. ఎర్రని చీర, చంచల ఉపరిభాగాన్ని ప్రస్ఫుటపరుస్తూ మెరుస్తున్న ఎర్రని మేచింగ్ జాకెట్. చంచల అందం తనని విచలితుని చేసింది.

ధైర్యంచేసి "చాలా అందంగా ఉన్నావు'' అన్నాడు తను. అంతచొరవ తనెప్పుడూ తీసుకోలేదు.

"నిజంగా?" అంటూ కళ్ళు చికిలించింది. నవ్వాడు తను. ఇద్దరూ కబుర్లలోపడ్డారు.

"చంచల అందంగా ఉంది'' అంటూ మనస్సులోనే చాలాసార్లు ఉచ్ఛరించుకున్నాడు. కబుర్లు భవిష్యత్ మీదకి మళ్ళాయి.

"బి.ఏ. డిగ్రీ తీసుకున్నాక, ఎమ్.ఏ. పూర్తి చేశాక ఉద్యోగం సంపాదించుకోవడం, చాలా కాలంగా భారంగా కుటుంబాన్ని మోస్తున్న మా నాన్నకి వీలుంటే సహాయంచేసి, ఇంటిలో ఉన్న ఆడపిల్లలని అత్తవారింటికి పంపడం ఇవే కనిపిస్తున్నాయి నాకు'' అన్నాడు తను.

ఒక్కసారి చంచల శరీరం బిగుసుకుపోవడం కనిపెట్టాడు తను.

"నీకు నా ఉద్దేశ్యాలు కొన్ని తెలుసు. జీవితంలో డబ్బుకి, సుఖాలకి కరువై బతకడం చాలాకష్టం. వీలుంటే డాక్టరు అవుదామని, తరువాత అవకాశంవస్తే విదేశాలకి వెళ్దామని నా కోరిక. ఈ వెధవ సమాజం గురించి పట్టించుకోకుండా నా ఇష్టం వచ్చినట్లు బతకాలి'' అంది చంచల. చంచలలో అదిమిపెట్టిన ఆవేశం మెల్లిగా పడగలు విప్పి బుసలు కొట్టడం మొదలయింది.

"డబ్బు కొంతమట్టుకు అవసరమే, కాదనను, కాని డబ్బు సుఖాన్నిస్తుందని నేను అనుకోవడంలేదు. సమాజం గురించి పట్టించుకోకుండా నా ఇష్టం వచ్చినట్టు బతకడానికి వీలులేని పరిస్థితి నాది. నేను ఏం చేసినా దాని ప్రభావం నా కుటుంబంమీద కనిపిస్తుంది. ఇంతవరకు నన్ను సాకిన కుటుంబాన్ని ఎలా విస్మరించగలను?" అనడిగాడు తను.

"గాలిపటం బురిడీలు కొట్టకుండా మీదకి నిదానంగా ఎగరడానికి తోక కడతారు. కాని నిదానంకోసం పెద్దతోక కడితే, అది మీదకి వెళ్ళలేదు'' అంది చంచల.

తనేమీ మాటలాడలేదు.

"అయితే మనిద్దరిగురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని సూటిగా ప్రశ్నించింది చంచల.

"మనిద్దరి గురించి ఆలోచించే సమయం కాదిది. నా వయస్సు ఇప్పుడు ఇరవై ఒకటి. దీనిగురించి ఆలోచించడానికి ఎంతలేదన్నా ఏడెనిమిదేళ్ళ వ్యవధి ఉంది. అప్పటికి ఇంట్లో సమస్యలు అన్నీ పరిష్కారమౌతాయి. అంతవరకూ నేను ఏమీ వాగ్దానం చేయలేను'' అన్నాడు తను.

"లాభంలేదు. నీకు ధైర్యంలేదు ఏ పనీచేయడానికి'' అంది చంచల దురుసుగా.

"ధైర్యం! డబ్బున్నవాడికి, ఆకలిబాధ లేనివాడికి ధైర్యం ఉంటుంది. ఏ బాదరబందీలు లేని ఒంటరివాడికి ధైర్యం ఉంటుంది. ఇతరుల గురించి పట్టించుకోనివాడికి ధైర్యం ఉంటుంది. కాని నేను సగటు సంఘజీవిని. నాకు సంఘభయం ఉంది'' అంటూ తన పరిధి గురించి వివరించాడు.

"నువ్వొత్త పిరికివాడివి. నీ కుటుంబాన్ని అడ్డుగా పెట్టుకుని, కులం వేరయిన నాకు చేయి అందించడానికి నిరాకరిస్తున్నావు. అదీ, ఇదీ, అంటూ త్రాసులో ప్రతీదీ వేసి ఏమీ నిర్ణయించకుండా వెళ్ళే బతుకునీది. నీకూ నాకూ కుదరదు. నాతో మళ్ళీ మాట్లా

డకు'' అంటూకోపంగా లేచింది చంచల. తను వారించి చంచల చేయిపట్టుకోబో తుంటే చేయిని బలంగా విదిల్చికొట్టి రోడ్డు మీదకి వెళ్ళింది.

తను సాయంకాలం డాబామీదకి వెళ్ళడం ఆగిపోయింది. చంచల తన అహంమీద దెబ్బకొట్టడంతో కల్పించుకుని ఆమెతో మా టలాడే ప్రయత్నం తను చేయలేదు.

చంచలని కలిసి, ఆమెని మార్చడానికి ప్రయత్నించకపోవడం, వివరంగా ఆమెకి తన సాధకబాధకాలు చెప్పకపోవడం తన తప్పు!

నీరజ విషయంలో తన మౌనం ఏమీ హాని చేయకపోయినా, బహుశా, చంచల విషయంలో తనకి తను అన్యాయం చేసుకు న్నాడేమో! అప్పట్లో చంచలకి ఉన్న ఊహ లు, తను విశదంగా మాటలాడినా మారేవి కావేమో! అయినప్పటికీ తన మౌనంవలన జీవితం మరొక మలుపు తిరిగిందేమో! తను బాగా ఆలోచించి, ప్రయత్నించి ఉంటే ఇంకో విధంగా నడిచేదేమో! హరనాధ్‌కి బాధ కలగ కుండా, ఛాయ తీసుకున్న నిర్ణయం సరి అయినదని రాయాలి అనుకుంటూ జగన్నా థం ఉత్తరం రాయటం మొదలుపెట్టాడు.

★ ★ ★

ఆదివారం ఉదయం ఆరుగంటలకి ఫోన్ మోగగా ఫోన్ ఎత్తి 'హలో' అన్నాడు జగ న్నాథం.

"మోనికా ఉందా? నేను క్లింటన్‌ని మాట్లా డుతున్నాను'' అన్నాడు ఫోన్‌లో అవతలవ్య క్తి.

"ఇక్కడ మోనికా అంటూ ఎవ్వరూ లేరు, మీకే నెంబరు కావాలి?" అనడిగేడు జగన్నాథం.

"సారీ, రాంగ్‌నంబర్' అంటూ సంభాష ణని తుంచేడు ఆ వ్యక్తి.

యధాప్రకారం ఆరుగంటలకి కాఫీ కలుపు కుని, టెలివిజన్ ఆన్ చేశాడు జగన్నాథం.

ఆదివారం ఉదయం నరేంద్ర, పద్మ, పిల్లలు లేచేటప్పటికి దాదాపు నాలుగు గంటల వ్యవధి ఉంది. వాళ్ళకి నిద్రాభంగం అవకుండా టెలివిజన్ వాల్యూమ్ తగ్గించేడు జగన్నాథం.

"ఫండమెంటల్ రైట్స్'' అన్న అంశంమీద చర్చ సాగుతోంది. విచిత్రమైన వివాదాల గురించి వివరిస్తున్నారు. కుటుంబ నియంత్రణ పాటిస్తున్నానని అబద్ధమాడి, అది వాడకుండా తనని మభ్యపెట్టి భార్య గర్భవతి అయిందని, పిల్లలని సాకడానికి తను తయారుగా లేడని భార్యని ఎబార్షన్ చేయించుకొమ్మని భర్తప్రతిపాదిస్తే 'పిల్లలని కనడమా? మానడమా?' అన్నది తన స్వంత విషయమని, ఇతరులకి అందులో జోక్యం లేదని, ఎవరైనా కలగచేసుకుంటే అది తన ప్రాథమిక హక్కుల ఉల్లంఘన అంటూ భార్య వాదిస్తోంది.

ఒక ప్రాణిని ఈ లోకంలోనికి తీసుకువస్తే ఆ పిల్ల/పిల్లవానికి జీవితకాలంలో రెండు లక్షల డాలర్ల ఖర్చు అవుతుందని, ఆ ఖర్చులో సగభాగం భరించబోయే తనకి, పిల్లలని ఈ లోకంలోనికి తీసుకువచ్చే ముందు అది తనకి ఆమోదయోగ్యంగా ఉండాలని భర్త వాదిస్తున్నాడు.

నాకు వయస్సు దాటిపోతే పిల్లలు పుట్టే అవకాశం తగ్గిపోతుందని, తొందరగా పిల్ల లని కంటే వాళ్ళ బాధ్యతలు తొందరగా అయిపోతాయని, తను గర్భవతి అవడానికి కేవలం డబ్బే ఆటంకం అనుకుంటే భర్త ఇచ్చే డబ్బు తనకి అఖ్ఖరలేదంటోంది భార్య.

"ప్రాథమిక హక్కుల" మీద జరుగుతు న్న చర్చలో పాల్గొంటున్న ఒక సభ్యుడు

"పిల్ల/పిల్లవాని ఖర్చుకి తండ్రిజీతంలో పదిహేడు శాతం కోసేస్తారని, చట్టం ఈ విషయంలో చాలా నిక్కచ్చని, అందువలన భర్తకి ఇది చిన్న విషయం కాదని వాదించే డు.

ఎవరివాదన సరిఅయినది? అన్నదాని మీద ఏకాభిప్రాయం కుదరకుండా, చర్చ

ఇంకో అంశంమీదకి మళ్ళింది.

భగవంతుని సృష్టివలన మానవుడు ఉద్భవించేడన్న నమ్మకం ఉన్న యాజమాన్యం, స్కూల్లో ఒక మేస్టరు, మానవుడు కోతుల దశనుంచి క్రమేణా మారడంవలన ఈనాటి స్థితికి వచ్చేడని పిల్లలకి బోధిస్తుంటే అతనిని ఉద్యోగంలోంచి తీసేశారు. తను బోధించే సిద్ధాంతానికి శాస్త్రీయంగా రుజువులున్నాయని, భగవంతుని సృష్టికి ఆధారాలు లేవని, తను నమ్మినదానిని చెప్పే అధికారం తనకి ఉందని అతను వాదిస్తున్నాడు. అంతా గజిబిజిగా ఉంది. చివరికి స్కూళ్లలో సృష్టికి కారణాలంటూ చెబితే రెండు సిద్ధాంతాలని చెప్పాలని, విద్యార్థులు తమకి నమ్మకం కుదిరిన దానిని ఎన్నుకుంటారన్న రాజీకి వచ్చేరు. అమెరికాలో ప్రాథమిక హక్కులకి చాలా ప్రాముఖ్యత ఉందని, ఆ ప్రాథమిక హక్కులని రద్దుచేయడంకాని, ఉల్లంఘించడంకాని ఎవ్వరూ చేయలేరని, దానిని కాపాడే బాధ్యత అందరిదని చర్చ ముగించేడు ఆ చర్చని పర్యవేక్షిస్తున్న అధ్యక్షుడు.

ప్రాథమిక హక్కులు! ఒకరి ప్రాథమిక హక్కులు ఇంకొకరి ప్రాథమిక హక్కులని



ఉల్లంఘించనంతవరకు ఎవరి ఇష్టం వచ్చినట్టు వారు తమకిష్టమైనట్టు ప్రవర్తించవచ్చు. న్యాయం దృష్టిలో అందరూ సమానులే. ప్రభుత్వ ఆఫీసులలో, స్కూళ్లలో, లైబ్రరీలలో మతానికి సంబంధించిన పటాలుకాని, విగ్రహాలుకాని ఉండవు. ఫిర్యాదు రానంతవరకు ఇళ్లలో నాలుగు గోడలమధ్య నడిచే వ్యవహారంలో ప్రభుత్వం కలగచేసుకోదు. జగన్నాధంకి కొన్ని సంవత్సరాల క్రితం ఇండియాలో కెప్టెన్ శ్రీనాధ్‌తో జరిగిన చర్చ జ్ఞాపకానికి వచ్చింది.

"వెధవది, దేశ ప్రధానమంత్రిని చంపిన వ్యక్తులని ఉరితీసేందుకు సంవత్సరాలు పట్టింది. భ్రష్టుపట్టింది ఈ దేశానికి'' అన్నాడు కెప్టెన్ శ్రీనాధ్ ఒకరోజు.

"వాళ్ళే ఆ ఘాతుకానికి ఒడికట్టేరని నిర్ధారణగా నిరూపించడం అవసరంకదా? లేకపోతే నిర్దోషులని ఉరితీసే ప్రమాదం ఉంది'' అన్నాడు తను.

"ఆ నా మొహం! ఈ లాయరు లంజాకొడుకులు ప్రతీదీ సాగతీస్తారు. ఇదంతా అనవసరం" అన్నాడు శ్రీనాధ్.

"నిజమైన న్యాయం కావాలంటే ఈ ఆలస్యం అనివార్యం" అని తను అడ్డుతగిలేడు అతని వాదనకి.

"నీలాంటివాళ్ళు ఉండబట్టే ఈ దేశం ఇలా అఘోరిస్తోంది. షూట్ ది బాస్టర్డ్స్'' అన్నాడు శ్రీనాధ్ తన అధికారదర్పంతో

"మాటవరసకి, మీ అబ్బాయి సెకండ్‌షో సినిమా చూసి తిరిగి వస్తుంటే స్కూటర్ పంక్చరయింది. దానికి దగ్గరగా అదే సమయంలో ఒక హత్య జరిగింది. ఆ ప్రాంతానికి సంబంధించిన ఇన్స్‌పెక్టర్‌కి నువ్వంటే పడదు. ఎదురుగా కనిపించిన మీ అబ్బాయే ఆ హత్యకి కారణమని లాకప్‌లో ఉంచి లాఠీలతో వాయిస్తే మీ అబ్బాయే తనే ఆ నేరం చేశాడని ఒప్పేసుకుంటాడు. ఆ నేరమేమిటి, తనే ఇందిరాగాంధీని చంపేడని వాంగ్మూలం ఇస్తాడు, ఆ లాఠీ దెబ్బలు భరించలేక. ఆ ఇన్స్‌పెక్టర్ పిస్టల్ తీసి, నేరం ఒప్పుకున్నాడని షూట్ చేసేస్తే?"

"నీదంతా వితండవాదం. ప్రాథమిక హక్కులకి సంబంధించిన నీ వాదనంటే నాకు పరమ అసహ్యం" అన్నాడు శ్రీనాధ్.

తనేమీ మాటలాడలేదు. శ్రీనాధ్ తనని దుయ్యపట్టినందుకు కోపం రాకపోయినా, ప్రాథమిక హక్కుల గురించి అతను అంత అల్పంగా మాటలాడడం చూసి విచారమేసింది. పవిత్ర భారతదేశంలో సామాన్య పౌరునికి ప్రాథమిక హక్కులు ఉన్నాయా? అన్న అనుమానం తనకి చాలాసార్లు వచ్చింది.

ఉదాహరణకి శ్రీరామనవమి, శివరాత్రి, కృష్ణాష్టమిలాంటి పండుగలప్పుడు మైక్రోఫోన్‌లు పెట్టి దగ్గరగా ఉన్న ఇళ్లలో నివశిస్తున్న ప్రజలని పగలూ, రాత్రీ ఇబ్బందిపెట్టి, రాత్రుళ్ళు నిద్రపోలేనంత శబ్దం పెట్టి భజనలు చేస్తుంటే, అది వద్దని ఏ వ్యక్తయినా అభ్యంతరపెట్టగలడా? పోలీసులకి ఫిర్యాదు చేస్తే ఆ గోల ఆగదుసరికదా పండుగ గడిచేక అతని బతుకు దుర్భరం అవుతుంది. బాగున్న రోడ్లని త్రవ్వి, పందిర్లువేసి, ఉన్న రోడ్లని మరింత ఇరుకుచేసి రోడ్డుని ఉపయోగించే ప్రజలకి ఇబ్బంది అయితే ఎవరైనా ప్రతిఘటించగలరా? తమ ఆనందంకోసం ఇతరులకి బాధ కలిగిస్తున్నామని, వాళ్ళ ప్రాథమిక హక్కులకి భంగం అవుతోందని తెలియదా? చెప్పినా వినిపించుకుంటారా? మూకుమ్మడిగా తమ విధానాలని ఇతరులమీద రుద్దడం అమానుషం అని గ్రహించరా?

అక్షరాస్యత అయితే పెరుగుతోంది కాని చదువు రావడంలేదు.

సుఖాలు పెంచుకుంటున్నాం కాని క్షమ, సహనం ఎందుకు అడుగంటుకుపోతున్నాయి?

మత్తులో ఒక తాగుబోతు అన్న మాటలకి విలువనిచ్చి, భార్యని వదిలిన రాముడిని, నీతికి ప్రతీకగా చెప్పుకునే ప్రజ, చెవులలో చిల్లులు పడిపోయేలా 'లబ్జనక, పబ్జనక

అంటూ పాటలు వినిపించడం ఎంతదారుణం? అనుకుంటూ నిస్పృహతో కళ్ళు మూసుకున్నాడు జగన్నాథం.

★ ★ ★

ఉదయం తొమ్మిదయేసరికి స్నానపానాదుల కార్యక్రమం ముగించిన జగన్నాథంకి మళ్ళీ పన్నెండు గంటలవరకు ఏ పనీ ఉండదు. అప్పుడు లంచ్ తినడం ఒక పెద్దపని! ఆ పని ముగించేక పిల్లలు ఇంటికి వచ్చేంతవరకు మళ్ళీ అంతా ఖాళీ. సాయంకాలం నాలుగు గంటలకి టీ కాచుకోవడం!

ఏమీ పనిలేని మనిషి మెదడు ఆలోచనలని భోజనం చేస్తుందనుకుంటూ టెలివిజన్ ఆన్ చేశాడు జగన్నాథం.

వార్తలు, వార్తలు, విన్న వార్తలు పదేపదే విని విసుగేసి ఛేనల్స్ మారుస్తూ, ఇరవైనాలుగు గంటలూ ప్రసారమయే 'సైకిక్ ఛానల్ దగ్గర ఆగేడు జగన్నాథం.

"నేను' సైకిక్ ఛానల్ చూసి, సైకిక్ ని సంప్రదించడం వలనే నా జీవితంలో అనుకోని ఆనందం లభించింది' అంటూ ఒక ప్రౌఢ తన ముప్ఫయి రెండు పళ్ళని ప్రదర్శిస్తూ ప్రకటించింది.

"ఒక సంవత్సరం క్రితం 'సైకిక్ ఛానల్కి నేను ఫోన్చేసి, ఇక్కడ ఉన్న సైకిక్తో మాటలాడినపుడు ఆవేళ లంచ్ విరామసమయంలో ఒక వ్యక్తి పరిచయం అవుతుందని, తదనంతరం పరిచయం పెరిగేక అతను నా జీవితంలో ఉన్న వెలితిని తీరుస్తాడని చెప్పేడు. ఆ సైకిక్ చెప్పినట్లే జరిగింది. ఇప్పుడు జాన్, నేను భార్యా భర్తలం. నా ఈ ఆనందానికి నూటికి నూరుపాళ్ళు ఆ సైకిక్తో మాటలాడటమే కారణం. మీరు ఆ సైకిక్తో మాటలాడి 'రేపు' మీ జీవితంలో జరగబోయేది ముందరే తెలుసుకుని ఈవేళే మీ జీవితాలని మలచుకోవచ్చు. ఈ దిగువన ప్రదర్శించిన నెంబర్కి ఫోన్ చెయ్యండి, ఫోన్ చేయడానికి ఖర్చేమీలేదు ఫ్రీ'' అందొక మధ్యవయస్కురాలు.

జగన్నాథం మదిలో 'సైకిక్ కి ఫోన్ చేస్తే ఎలా ఉంటుంది? అన్న చిలిపి ఊహ కదలాడి మాయమైంది. సైకిక్తో సంప్రదించడానికి నిమిషానికి నాలుగు డాలర్లు అవుతుందని, టెలిఫోన్ బిల్లులో దానిని జతపరుస్తారని చిన్న ప్రింటుతో ఉన్నది చదివి నవ్వుకున్నాడు జగన్నాథం.

తెలియని 'రేపు' రాకముందరే ఏం జరగబోతోందో ముందరే చెబుతామని కట్టుకథలు చెబితే నమ్మే ప్రజలు ఉన్నంతకాలం ఇలా మోసాలు చేయడం తప్పదు. ఈ విషయంలో ఇండియా అయినా, అమెరికా అయినా ఒక్కటే. ఇండియాలో సందు మొదట్లో కూర్చుని చిలకజోస్యం వినే అక్షరజ్ఞానం లేని పల్లెవానికి, అమెరికాలో మంచీ చెడూ విచక్షణ తెలిసి అక్షరజ్ఞానం ఉండి సైకిక్ ఛానల్ని సంప్రదించే వ్యక్తికి తేడా ఏమీలేదు. ఇద్దరికీ ఉన్న బలహీనత ఒక్కలాంటిదే. ఇండియాలో ఉన్న ప్రజలు దొంగ బాబాలని గుడ్డిగా నమ్మి డబ్బు దానం ఇస్తే, నాకు రాత్రి భగవంతుడు కలలో కనిపించేడని ఒక ఇవాంజలిస్ట్ ప్రకటించి, ప్రజలని డబ్బు ఇమ్మని అర్థిస్తాడు. కొందరు తమ ఆస్తినంతా అతనికి సమర్పించి, తరువాత గోల పెట్టడం అమెరికాలో చాలాసార్లు జరగడం అందరికీ తెలిసినదే.

తెలియని రేపు గురించి ఈవేళే తెలుసుకుందామని తహతహ. చావు తరువాత ఏమౌతుందోనని భయపడి బతికి ఉన్నప్పుడు డబ్బు ఇచ్చి ఇన్సూరెన్స్ కొనుక్కోవడం, భయంతో జీవితాన్ని నెట్టడం. ఇలాంటి విషయాలలో తర్కం పనిచేయదు అనుకుంటూ టెలివిజన్ కట్టేసి బైటికి చూసేడు జగన్నాథం. ధైర్యం సడలిన సాయంకాలం సూర్యుడు చలిబారినుంచి తప్పించుకోవడానికి మేఘాలవెనక దాగి, పలాయనం మొదలుపెట్టేడు. నవంబరు మాసం, చలికాలం మొదటిరోజులు. మంచు కురవకపోయినా చలిగాలి వీస్తుంటే ఓవర్కోటు వేసుకుని, బైటకి వచ్చి నడకమొదలుపెట్టేడు జగ

# ఏరిన ముత్యాలు

★ నైతికంగా బలహీనులైనవారే బలప్రయోగానికి పూనుకుంటారు.

–ఐన్‌స్టయిన్

★ సత్కార్యాలు, చేసి చూపెట్టు. చేస్తానంటూ ప్రచారం చేస్తూ మురిసిపోకు.

–గాంధీ

★ జీవిత చరిత్ర ప్రపంచంలోని అన్ని పుస్తకాలకంటే విలువైన గ్రంథం. ఉత్తమ ప్రయోజనకరమైన పఠనానికి అది ఆదర్శం.

–కార్లయిల్

★ నిరాశ, నిస్పృహలకు లోనుకాకుండా పట్టుదలగా ప్రయత్నిస్తే దేన్నయినా సాధించగలం.

–హెలెన్‌కెల్లర్

★ ప్రబోధంకన్నా ప్రయత్నం, ఆచరణ మిన్న.

–మదర్ థెరిస్సా

★ భావాలను అభివ్యక్తీకరించే సంకేతాల వ్యవస్థయే భాష.

–సజార్

★ ఆచారాల పేర, నమ్మకాల పేర పనులు మాను జాతి పనికిమాలిన జాతి.

–నార్ల

★ మూడవ ప్రపంచ యుద్ధం అంటూ జరిగితే ఆయుధాలుగా మిగిలేవి రాళ్ళు మాత్రమే.

–ఐన్‌స్టయిన్

★ నీవుచెప్పేది నాకు ప్రాణాంతకమైనా దాన్ని చెప్పేందుకు నీకు గల హక్కును నేను ప్రాణాలర్పించి అయినా కాపాడతాను.

–వోల్టేరు

★ నాకు క్షణమైనా తీరికలేదు. కనీసం విచారించడానికి కూడా నాకు సమయంలేదు.

–విన్‌స్టన్ చర్చిల్

★ దుఃఖానికి ప్రధాన కారణం సంతోషంగా ఉన్నామా, విచారంగా ఉన్నామా అని ఆలోచించే తీరిక దొరకడమే.

–బెర్నార్డ్ షా

★ తనపట్ల శ్రద్ధాసక్తులున్న తల్లిదండ్రులు, ఇంటినిండా పుస్తకాలు ఉన్న పిల్లలు ఏవిధంగానూ పేదవారు కారు.

–స్యామ్ లెవిన్‌సన్

★ పుస్తకంలేని గది జీవంలేని శరీరం వంటిది.

–సిసిరో

సేకరణ : బి. గిరిబాబు

న్నాథం.

టైమెంతైందని చేతి వాచీవేపు చూస్తే గడియారం మూడు గంటలు చూపిస్తోంది. వాచీ సెకన్ల ముల్లు నిశ్చలంగా ఉండడం గమనించి, బేటరీ అయిపోయింది కాబోలు అనుకుంటుంటే జగన్నాథంకి సన్నని దిగులు ఆవహించడం మొదలయింది.

వాచీ నడవాలంటే కొత్త బేటరీ కొనాలి, కొత్త బేటరీ వేయించడానికి పది డాలర్ల ఖర్చు!

వాచీ లేకపోతే ఏం? టైం చూసుకోవల సిన అవసరం తనకేముంది? ఆకలి వేసిన ప్పుడు తిండి, దాహమేసినప్పుడు నీళ్ళు తాగడం తప్ప తనకి ఇంకేముంది పని?

తన దినచర్యలో కాలానికి ఏదీ విలువ?

ఒంటిలో ఆవిర్భవించిన దిగులు మెల్లిగా పెరిగి, పురులు విప్పి నాట్యం చేయడం మొదలుపెట్టింది. నడకలో తీవ్రత తగ్గి, కాళ్ళు నొప్పి పుట్టడంతో ఎదురుగా డంకన్ డోనట్ కాఫీ ప్రదేశం కనిపిస్తే దానిలో ప్రవేశించి, కాఫీ కొనుక్కొని, కిటికీ దగ్గర కూర్చుని దుకాణంలో ఉన్న ఇతర ప్రజల వేపు చూసేడు జగన్నాథం. కాఫీ షాపులో అందరూ వయస్సు మళ్ళిన వాళ్ళే. కబుర్లు చెప్పుకుంటున్న ఒక జంటని వదిలేస్తే మిగతా జనం ఎవరికివారే ఒంటరిగా, నిమీలిత నేత్రులై ఆలోచనల్లో మునిగిపోయి సిగరెట్లని తాగుతూ, పరధ్యానంగా కాఫీ తాగుతున్నారు.

వేడి కాఫీ గొంతు దిగగానే, కెఫీన్ శరీరంలోనికి ప్రవేశించగా దిగులు ప్రభావం తగ్గినట్లనిపించి, నాలుగైదు గుటకలు వేసేసరికి, శబ్దంచేసుకుంటూ ఒక పోలీసు కారు, దాని వెంట ఎర్ర లైట్లని వెలిగించుకుని అంబులెన్స్, కాఫీ దుకాణానికి నూరడుగుల దూరంలో ఆగేయి.

కాఫీ షాప్‌లో ఉన్న ప్రజల దృష్టి అటు వేపు తాత్కాలికంగా మళ్ళింది. అంబులెన్స్ లోంచి పేరామెడిక్స్ దిగి, స్ట్రెచర్‌తో అంబులెన్స్ నిలిచి ఉన్న చోటుకి ఎదురుగా ఉన్న ఇంటిలోనికి హుటాహుటి ప్రవేశించి, రోగిని ఎక్కించుకున్నాక అంబులెన్స్ శబ్దం చేసుకుంటూ శరవేగంతో దూసుకువెళ్ళింది. సినిమాలలో దృశ్యంలా రెండు నిమిషాలలో అంతా ముగిసి వీధంతా మళ్ళీ నిర్మానుష్యమైంది. కాఫీ షాప్‌లో ఉన్న మనుష్యుల దృష్టి తిరిగి కాఫీమీదకి, సిగరెట్లమీదకి మళ్ళడం చూసి ఇతరుల గురించి పట్టించుకోని ప్రజలని చూస్తుంటే ఆశ్చర్యమేసింది జగన్నాథంకి.

"ఎవరి ఇల్లు అది?" అనడిగేడు జగన్నాథం కాఫీ షాప్ మేనేజర్‌ని.

"ఏమో!" అంటూ భుజాలెగరేశాడు కాఫీ షాప్ మేనేజర్.

ఖాళీ కాఫీ కప్పుని చెత్తకుండీలో పడేసి, బైటకి వచ్చి నడుస్తూ, పది నిమిషాలక్రితం అంబులెన్స్ నిలబడ్డ ఇంటి దగ్గరకి రాగానే నడక వేగం తగ్గించేడు. ఆ ఇంటి దగ్గర కాని, ఆ ఇంటి ఇరుగు పొరుగు ఇళ్ళలో కాని, బైట అలికిడి ఏమీ వినిపించలేదు జగన్నాథంకి.

భారంగా అడుగులు వేసుకుంటూ ఇంటికి చేరేడు జగన్నాథం. నరేంద్ర, పద్మ, పిల్లలు ఇల్లు చేరలేదు. వాళ్ళు వచ్చేక ముక్తసరిగా మాట్లాడుతూ రాత్రి భోజనం ముగించి పరుపుమీదకి చేరినా జగన్నాథంకి నిద్రరావడంలేదు. మెదడు ఆలోచించనని మొరాయించడంతో అటూ ఇటూ ఒత్తిగిల్లుతూ చాలా సేపు గడిపేక, అలుపువచ్చి మెల్లిగా రాత్రి పన్నెండు గంటలకి నిద్రలోనికి జారేడు జగన్నాథం. రాత్రంతా కలతనిద్రే. జగన్నాథం నిద్రలేచేటప్పటికి ఆలస్యమైంది. నరేంద్ర, పద్మ, పిల్లలు ఎవరి పరుగులో వాళ్ళు ఉండడంతో ఏ విషయంమీదా చర్చ జరగకుండా ఉదయం గడిచింది. ఇల్లు ఖాళీ అయేక, ఆవాళ్టి పేపరువిప్పి, జననమరణాలు ప్రకటించే పేజీ విప్పి వెతకనారంభించేడు జగన్నాథం. ఎడ్రసుబట్టి ముందరరోజు, అంబులెన్స్‌లో తీసుకెళ్ళిన వ్యక్తిపేరు మార్టిన్ అని, అతని వయస్సు ఏభై మూడేళ్ళని,



అతని జీవిత విశేషాలు వివరంగా పేపరులో రాసి ఉన్నాయి. మృతదేహాన్ని ఉంచిన ఫ్యూనరల్ ఇల్లు గురించి, చనిపోయిన వ్యక్తిని ఏయేవేళల్లో సందర్శించవచ్చో పేపరులో రాసి ఉంది.

పేపరు మడిచి పక్కన ఉంచి స్నానపానాదులు కానిచ్చి, బట్టలు వేసుకుని మార్టిన్ ఇంటివేపు నడక మొదలుపెట్టేడు జగన్నాథం. మార్టిన్ ఇంటిముందర కాని, ఆ ప్రాంతంలో కాని ఏవిధమైన కలకలమూ కనిపించలేదు. క్రితంరోజు ఒక వ్యక్తి ఆ ఇంటిలో చనిపోయేడని అనుమానపడడానికి ఎలాంటి ఆనవాళ్ళు లేవు. తన చల్లని చేతులతో, మృత్యుదేవత ఎలాంటి గుర్తులని మిగల్చకుండా మార్టిన్‌ని కబళించి హరాయించుకుంది. అమెరికాలో ప్రతీదీ ఒక నిర్ణీత పద్ధతిలో నడుస్తుంది. చావూ అంతే.

ఒక వ్యక్తి మరణించేడని తెలిసేక ఆ వ్యక్తి బంధువులు, మిత్రులు ఫ్యూనరల్ హోమ్‌కి వెళ్ళి అలంకరించి కేస్కెట్‌లో ఉంచిన మృతదేహాన్ని ఆఖరిసారి చూశాక, కేస్కెట్‌ని చర్చికి తరలిస్తారు. చర్చిలో మతాధికారి చనిపోయిన వ్యక్తి గుణగణాలని పొగిడేక, కేస్కెట్‌తోపాటు ఊరేగింపుగా కార్లలో శ్మశానప్రదేశానికి అందరూ తరలివెళ్తారు. అంతకుముందరే తవ్వి ఉంచిన గొయ్యి పక్కన కేస్కెట్‌ని ఉంచి అక్కడకి వచ్చిన వ్యక్తులని, చనిపోయిన వ్యక్తి వాళ్ళ జీవితాలని ఎలా ప్రభావితం చేశాడో చెప్పమంటాడు మతాధికారి. అదయ్యేక కేస్కెట్‌ని గోతిలోనికి దించి, చర్చికి తిరిగి వచ్చి విందులో పాల్గొంటారు. ఈ తతంగమంతా రెండు మూడు గంటలలో ముగుస్తుంది.

మర్నాటికి ఆ వ్యక్తి ఒక జ్ఞాపకం! మిగిలిన జీవితాలు తిరిగి వేగం అందుకుంటాయి.

జగన్నాథం ఆలోచన తన పరిస్థితి మీదకి వచ్చి నిలిచింది.

రేపు తనసంగతేమిటి? ఇలా తను ఏ పనీ చేయకుండా రోజులు నిస్త్రాణగా నడుస్తూ ఒక



రోజు అలసి ఆగిపోతాయా? ఈనాడు తన బతుకికి విలువ ఏమిటి?

మనిషి ఉన్నా లేకపోయినా తేడా తెలియకపోతే ప్రపంచానికి ఆ వ్యక్తి విలువ సున్నా!

ప్రపంచంలో ఏ ప్రాణి చనిపోయినా విచారించడం సహజమే, అంతకుమించి ఒక వ్యక్తి గురించి ప్రత్యేకంగా ఆలోచించడానికి కారణ భూతుడు కాకపోతే, ఆ వ్యక్తి భూమికి భారం కాక ఇంకేమిటి? జగన్నాథం గుండె గుభేల్మంది.

★ ★ ★

మేడమీదనుంచి బాధతో మూలుగులు వినిపిస్తుంటే, జగన్నాథంకి మెలకువవచ్చి, స్విచ్ వేసి చూస్తే గడియారం రెండు గంటలు చూపిస్తోంది. పరుపుమీదనుంచి కదలబోతే, అలసిపోయిన శరీరం బాధతో ఆక్రోశించింది. చాలాకాలంగా పరిచయమున్న కరుణాకరం గుండె జబ్బుతో మరణిస్తే, అతని కుటుంబసభ్యులతోపాటు మరుభూమికి వెళ్ళి తిరిగి వచ్చేసరికి సాయంకాలం చీకటిపడింది. శవవాహకులు తక్కువవగా ఒక కొమ్ము అందుకున్నాడు జగన్నాథం. కరుణాకరం బక్కమనిషైనప్పటికీ శరీరపటుత్వం సడలిన జగన్నాథంకి అది భారమైన శ్రమే. ముప్పయి ఏళ్ళుగా తెలిసిన వ్యక్తి మరణం ఒకవైపు జగన్నాథం మనస్సుని కృంగతీస్తుంటే రెండవవైపు ఒళ్లంతా నొప్పి శారీరకంగా బాధపెడ్తోంది. ఎలాంటి వ్యక్తయినా, ఎంతటి నాయకుడైనా చివరికి అయ్యేది గుప్పెడు బూడిదే అన్న నగ్నసత్యం నిద్రలో కూడా జగన్నాథంని పదేపదే హెచ్చరిస్తుంటే, మేడమీద మూలుగు అర్ధాంతరంగా లేపింది. చెప్పులు వేసుకుని, మేడ మెట్లెక్కి తలుపు తట్టేడు.

"మూలుగు వినిపిస్తోంది. ఏమైందేమిటి?" అనడిగేడు తలుపు తెరచిన భార్గవని.

"విశాలికి ప్రసవమయేలా ఉంది. ఇంటిలో సహాయానికి ఇంకెవరూ లేరు. ప్రసవానికి ఇంకా ఆరు వారాల వ్యవధి ఉంది అంది మూడు వారాలక్రితం డాక్టరు. కాని ఒక గంట కింద నొప్పులు ఆరంభమయ్యేయి. క్రమంగా నొప్పుల ఉధృతం ఎక్కువవుతోంది. ఇంత రాత్రపుడు హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాలన్నా, ఎవరి సహాయం అర్థించాలన్నా కష్టమే. విజయనగరంలో రాత్రుళ్లు, ఎక్కడ పడితే అక్కడ ఆటో రిక్షాలు దొరకవు. నాకేమీ పాలుపోవడంలేదు'' అన్నాడు భార్గవ.

"సందు మొదట్లో ఏదైనా రిక్షా దొరుకుతుందేమో చూసివస్తాను. ఏదో ఒకటి చేద్దాం. నువ్వు కంగారుపడుతూ విశాలిని ఇంకా కంగారుపెట్టకు'' అంటూ భార్గవకి ధైర్యం చెప్పి, కళ్లజోడు సవరించుకుంటూ చీకటిగా ఉన్న రోడ్డుమీదకి వచ్చేడు జగన్నాథం. డిసెంబర్ మాసం చలిగాలి ఒక్కసారి జగన్నాథం చెవులని తాకింది. చేతులతో చెవులని మూసుకుని, రిక్షాస్టేండ్‌వేపు నడిచేడు జగన్నాథం.

ఒక గంట గడిచేక భార్గవ కిందకి వచ్చి, "విశాలి మగపిల్లవానికి జన్మనిచ్చింది. మీరు సమయానికి ఆ మిడ్‌వైఫ్‌ని తీసుకురాబట్టి అంతా సవ్యంగా జరిగింది. మేం మీకు చాలా రుణపడి ఉన్నాం" అంటూ జగన్నాథం చేతులు పట్టుకున్నాడు. కృతజ్ఞతతో భార్గవ కళ్లలో నీళ్ళు చిప్పిల్లేయి.

"రుణం గిణం ఏమీలేదు. మీదకి వెళ్ళి విశాలికి ఏమైనా సహాయం కావాలేమో చూడు. నాకు నిద్రముంచుకువస్తోంది'' అంటూ భార్గవని పంపి, పరుపుమీదకి చేరిన జగన్నాథంని నిద్రాదేవత కరుణించలేదు. రాని నిద్రకోసం అలమటిస్తూ ఆలోచనలోపడ్డాడు.

అమెరికానుంచి తిరిగివచ్చేక ఈ మూడు నెలలూ ఇంటికి అవసరమైన కనీస సౌకర్యాలు అమర్చుకోవడంలో పరిగెత్తేయి. అమెరికాలో ఒకరకమైన క్రమబద్ధమైన జీవితం కొన్నాళ్ళు వెళ్లదీయడంవలన తన ఆలోచనల్లో వచ్చిన మార్పు ఒక దిశవైపు వెళ్తే అదే

కాలంలో ఇండియాలో ఉన్న ప్రజల ధోరణిలో వచ్చిన మార్పు రెండవవైపు వెళ్ళడంతో ఉదయం లేచిన దగ్గరనుంచీ ప్రతీదానికీ సంఘర్షణే! నరేంద్ర, "నాన్నా అక్కడ మారిన పరిస్థితులలో మీరు ఒక్కరూ ఇమడలేక బాధపడతారు. నా మాట విని మీరు తిరిగి ఇక్కడకి వచ్చేస్తేనే మీకు సుఖం" అంటూ ఉత్తరం రాశాడు. దానిలో నిజంలేకపోలేదు. అనుకుంటూ పరుపుమీద పక్కకి ఒత్తిగిల్లబోయేడు జగన్నాథం. పుండులా సలుపుతున్న బుజం నొప్పి మళ్ళీ కలుక్కుమంది.

ఉదయం కరుణాకరం మరణం అదే రోజు భార్గవకి పుత్రోదయం.

జనన మరణాలు ప్రకృతిలో సహజం. సంఘంలో నివశిస్తూ, నలుగురితో కలిసి మసలుతుంటే మనిషి తోటి ప్రజల జీవితపు ఆటుపోటుల ప్రభావాలకి లోనవక తప్పదు. మానవుడు సంఘజీవి! అమెరికాలో గడిపిన కాలంలో, తను చూసినది, తనకి అర్థమైనది చాలా తక్కువే. అయినప్పటికీ, అక్కడ మానవుడు సంఘంలో ఒక జీవిగా కనిపించాడేకాని సంఘజీవిలా కనిపించలేదు. నిత్యావసరాలకు ఒకరిమీద ఇంకొకరు ఆధారపడక తన మానాన తను బతకడానికి అలవాటుపడడంతో ఇరుగుపొరుగుల మధ్య సంపర్కం సన్నగిల్లింది. మూకుమ్మడిగా సంఘానికి ఏదైనా విపత్తు వాటిల్లినా, ప్రపంచంలో ఎక్కడ ఏ అవాంతరమైనా అమెరికాలో ఉన్న ప్రజలు ప్రదర్శించిన ఉదారత్వం చూసి తను ముగ్ధుడయిన మాట వాస్తవం. కాని తన ఏభైఏదేళ్ళ ఇండియాలో అలవాటైన జీవనసరళి కావచ్చు. లేదా తరతరాలుగా తనలో జీర్ణించుకుపోయిన ఉద్దేశ్యాలుకావచ్చు ఏదిఏమైనా ఏమిటో తనకి అక్కడ ఏదో వెలితి కనిపించింది.

"నీలో ఇంకా పిసరంత ఆదర్శం మిగిలి ఉంది. దానికి నువ్వు బానిసవి. అది పూర్తిగా కరిగిపోతేకాని ఆధునిక సమాజంలో నువ్వు ఇమడలేవు'' అన్నాడు రామస్వామి తనకి ఇండియా తిరిగి వెళ్ళే ఉద్దేశ్యం ఉందని చెప్పగానే. ఎప్పటిలాగే రామస్వామితో వాదనకి దిగలేదు. ప్రతీ జీవీ తనకంటూ ఒక లక్ష్యం ఏర్పర్చుకుని, అది సాధించడానికి దానికి అనువైన మార్గంలో నడుస్తాడు. ఎన్నుకున్న లక్ష్యం, నడుస్తున్న మార్గము సరి అయినవా? కావా? అన్న ప్రశ్నలో అర్థంలేదు. ధ్యేయంలేకుండా వెళ్ళే జీవితంలో అంతా వెలితే! జీవితంలో ఒక వెలితి ఉందని అది పూడ్చే అవసరముందని తనకి ఈవేళే అవగాహన అయింది. కష్టాలలో ఉన్న సాటి వ్యక్తికి పిసరంత సహాయం, రవ్వంత సానుభూతి అందిస్తే ఎన్నో కన్నీళ్లు ఆగుతాయి. కరుణాకరం ఆఖరి యాత్రలో, విశాలి ప్రసవవేదన సమయంలో కేవలం ప్రేక్షకునిగా ఏమీ అంటనట్లు వదిలేయకుండా, వాళ్ళ బాధ నివారణలో, అసంకల్పితంగా తను చేయూత నిచ్చినపుడు తనలో చాలాకాలంగా రాజుకుని ఉన్న అసంతృప్తి చల్లబడింది.

"నీలో ఉన్న అసంతృప్తికి నువ్వే కారణం" అన్న రామస్వామికి ఉత్తరం రాయాలి అనుకుంటూ కాగితం, పెన్ అందుకున్నాడు జగన్నాథం.

ఉత్తరం రాయడం ముగిసేసరికి, కిటికీ కన్నాలలోంచి బైట సన్నని వెలుతురు కనిపిస్తే కిటికీ తలుపులని సాంతం తెరిచేడు జగన్నాథం. చలిగాలి మెల్లిగా లోపలికి వచ్చి చలి కాచుకుంది.

"ఇంకా చలిగా ఉంది'' అంటూ సూర్యుడు ముసుగు తీసుకుని బైటకి వస్తున్నా, చీకటి చారికలు ఆకాశాన్ని వదలలేదు. ఆ నల్లని చారికలు చూడగానే చంచల మరోసారి జ్ఞాపకానికి వచ్చింది జగన్నాథంకి.

"పిరికితనాన్ని అణిచి, ఇండియా తిరిగి వచ్చేక ధైర్యంగా రోజులు వెళ్ళదీస్తున్నానని'' చంచలకి రాస్తే చాలా సంతోషిస్తుంది. కాని ఆ ఉత్తరం రాఘవ కంటపడితే ఏం రాద్ధాంతం చేస్తాడో! అని గతాన్ని నెమరువేసుకుంటూ ఆలోచనల్లో మునిగిపోయిన జగన్నాథంని చురుక్కుమనిపిస్తూ సూర్యకిరణాలు తాకేయి. ★

# ఏరినముత్యాలు

★ పిరికిపందలతో స్నేహం చేయకు. వారు నీలో వున్న ధైర్యాన్ని కూడా అపహరిస్తారు.

–థోరో

★ ఒక్క గొంగళిలో పదిమంది ఇమడగలరు. కానీ ఒక రాజ్యంలో ఇద్దరు రాజులుండలేరు.

–పర్షియన్ సామెత

★ రత్నాన్ని రాపిడి లేకుండా మెరుగుదిద్దలేము. ఏ మనిషీ కష్టాలు పడకుండా ఉత్తముడు కాలేడు.

–చైనా సామెత

★ కడుపు కాలుతున్న వాడికి దేశభక్తి గురించి ప్రబోధించి లాభంలేదు.

–హీల్

★ ప్రపంచంలో అత్యంత ఉదాత్తమైన ఆలోచనలనూ, సూక్తులను తెలుసుకోవడమే సంస్కృతి.

–మాథ్యూ ఆర్నాల్డ్

★ తెలివైనవాడు పుస్తకాలే కాదు జీవితం కూడా చదువుతాడు.

–లిన్‌యుటాంగ్

★ యౌవనంలో తెలుసుకుంటాం. వార్ధక్యంలో అర్థం చేసుకుంటాం.

–మేరీ ఎబ్నర్ ఎషెన్‌బాబ్

★ సొమ్ముపోతే నష్టంలేదు. ధైర్యం కోల్పోతే నష్టం. గౌరవం పోతే మరింత నష్టం. ఆత్మను చంపుకుంటే అన్నీ పోయినట్లే.

–జార్జ్‌బెర్నార్డ్‌షా

★ ఎన్నో కష్టాలు అనుభవిస్తే కాని పరిపూర్ణమైన సుఖశాంతులు లభించవు. ఇనుమును ఎంతగానో కాల్చి సమ్మెట పోటులు వేస్తేగాని మెత్తబడి సాగదు.

–మహాభారతం

★ మబ్బు వాన కురిసినట్టు, సూర్యుడు చీకట్లను చీల్చినట్టు, చంద్రుడు వెన్నెలలు విరజిమ్మినట్టు మంచి మిత్రుడు తనంతటతాను సహాయంచేస్తాడు.

–రామాయణం

★ తీసినకొద్దీ చెలమలో నీరు ఊరుతుంది. చదివినకొద్దీ మనిషిలో వివేకం పెరుగుతుంది.

–తిరుక్కురళ్

★ యువకుల విద్యావివేక సంపత్తియే దేశ భవిష్యత్తుకు పునాది.

–ఎలిజాపుల్

సేకరణ: పొన్నమండ శ్రీనివాసరావు

# 'ఈ జీవితం నాది' పై సమీక్షలు

మార్చి 'చతుర' లో ప్రచురితమైన గంటి వెంకటరమణ రచన
'ఈ జీవితం నాది' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ఈ జీవితం అందరిదీనూ!

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

కలలువేరు, వాస్తవం వేరు. కలలు వాస్తవం కావాలన్న దురాశకు పోతే ఎదుర య్యేది నిరాశే! కన్నె మనసులు కలలు కన డమూ, కన్నె పిల్లలు ఆశలు పెంచుకోవ డమూ అసహజంకాదు. కాని అవి హద్దులు మీరి వాస్తవానికి భిన్నంగా నేలవిడిచి సాము చేసిననాడు తీవ్రపరిణామాలకు దారితీయకమానవు. అందుకు ఉదాహరణ శ్రీమహాలక్ష్మి జీవితమే!

ఆమె అందగత్తె, ఆలోచనాపరురాలు, తెలి వైనదీ, తెగువగలదీను. ఫార్మల్ ఎడ్యుకే షన్ పెద్దగా లేకపోయినా, లైబ్రరీలోని పుస్త కాలన్నీ చదివేసిన పరిణితి చెందిన యువతి. కానీ ఫాంటసీ అనే మాయపొర ఆమె కన్నులకు కప్పేసింది. స్వప్నావస్థ నుంచి బయటపడలేని బలహీనతతో తనకు తానే అపకారం చేసుకుందామె.

పాణిగ్రాహి చిన్ననాటి స్నేహితుడు, సహృదయుడు, నిష్కల్మషంగా తనను ప్రేమించినవాడూను. అతనితో వివాహానికి శ్రీమహాలక్ష్మి అంగీకరించిననాడు ఆమెలో మనోపరిపక్వత కనిపిస్తుంది. కానీ వివాహా నంతరం ఆమెలో కాపురముండిపోయిన కలల తాలూకు ఆశల అలలు ఉధృతమై ఆమెను తీరని అసంతృప్తికి గురిచేస్తాయి. ఫలితంగా ముగ్గురు పిల్లల తల్లయీ, ప్రాణ ప్రదంగా ప్రేమించిన భర్తను, ఓ మంచి మిత్రుణ్ణి శారీరకంగా, మానసికంగా దూరం



చెసుకుంటుంది. తాను మనశ్శాంతిని కోల్పో వడమేకాక అతని పతనానికి దారితీసేలా చేస్తుంది.

సబిత, మనోహరికూడా శ్రీమహాలక్ష్మి వంటి దృఢనిశ్చయులూ, మనోస్థైర్యంగల అమ్మాయిలే. తాము నమ్మిన పథంలో ధైర్యంగా పయనించి బంగారు భవిష్యత్తుకు బాటలు పరచుకున్నారు.

ఏం చేసినా మనిషికి తృప్తి అవసరం. అది లోపించిన శ్రీమహాలక్ష్మి బతుకును

బజారుపాలు చేసుకుంది. ఆడపిల్లలేదన్న కారణంగా వైష్ణవిని దత్తత చేసుకున్న పూర్ణ చంద్రరావు, ఆ పిల్లను తల్లిదండ్రులవద్దే వుంచేయడం చిత్రమనిపిస్తే, శ్రీమహాలక్ష్మి తనను పెళ్లిచేసుకొమ్మని అతన్ని ప్రాధేయపడడమూ, ఆమె కన్నీటికి కరిగిపోయి అతను అంగీకరించడమూ విడ్డూరంగా వుంటుంది. దీపపు పురుగులా అతని సంపదకే ఆమె ఆకర్షింపబడిందనిపిస్తుందేతప్ప అతనిలో చెప్పుకోదగ్గ ప్రత్యేకత కనిపించదు. డబ్బు మినహా అతను ఆమెకిచ్చినదీ ఏదీ కానరాదు.

భర్త వుండగానే మరో పెళ్లి చేసుకునే స్త్రీని సహించగల స్థితికి సమాజం ఇంకా ఎదగలేదు. శ్రీమహాలక్ష్మి చేసిన పని నైతికంగా, చట్టపరంగా కూడా గర్హనీయమే. 'ఈ జీవితం నాది' అని మొండిగా ఎదురు తిరిగినంతలో సంఘం వూరుకోదు. మనిషి సంఘానికి చెందిన శిల్పం. ప్రతి జీవితమూ మరెన్నో జీవితాలతో ముడిపడి వుంటుంది. భార్య మూర్ఖత్వానికి అమాయకుడైన పాణిగ్రాహి జీవితం నాశనమయింది. ఆమెతో సంబంధమున్న ప్రతి ఒక్కరూ అవమానాలకు, ఆవేదనకూ గురయ్యారు. కన్నపిల్లలే తనను అసహ్యించుకునే దుస్థితి ఏ స్త్రీకీ రాకూడదు.

కొడుకు తనతో రమ్మన్నపుడు పాణిగ్రాహి ఇచ్చిన సమాధానంతో అతని గుండెలలో ఎంతటి బాధ గూడుకట్టుకుని వుందో అర్థమవుతుంది. అతని నిర్ణయం సమంజసంగా వుండి, అతని మనో పరిపక్వతను చాటుతుంది.

చక్కని కథనం, మనోజ్ఞమైన శైలి, పరిణితిగల మనో విశ్లేషణలతో ఆసక్తికరంగా సాగి, ఆద్యంతమూ చదివించే ఈ నవలలోని పాత్రలనుండి ముఖ్యంగా శ్రీమహాలక్ష్మి పాత్రనుండి పాఠకులు కొంతయినా నేర్చుకోగలిగితే రచయిత్రి శ్రమ ఫలించినట్లేనని చెప్పవచ్చును.

-పి.వి.వి.సత్యనారాయణ
హైదరాబాద్- 500007

## కాకతాళీయమా?

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

ఒక కథకాని, నవల కాని చదివిన పాఠకులకు ఒక్కోసారి ఒక్కొక్క రకమైన అనుభూతులు, ఆలోచనలు కలుగుతాయి. కానీ అది చాలా అరుదు. అలాంటి కోవకు చెందినదే గంటి వెంకటరమణగారి 'ఈ జీవితంనాది'. ఇతివృత్తం సమాజానికి వ్యతిరేకం. రచయిత్రి ధైర్యంగా తనకు తోచినది నిర్భయంగా చెప్పగలిగారు. బహుశా విమర్శలు వ్యతిరేకంగా వుండవచ్చు. కాని నా వరకు తృప్తినిచ్చింది, ఆలోచింపజేసింది.

చదువుతున్నంతసేపూ ఎక్కడో ఎప్పుడో ఇలా నిజజీవితంలో జరిగింది ఎక్కడా? అనిపిస్తుంది. నాకు తెలిసిన ఒక కుటుంబంలో ఒక్క ముగింపు మినహా ఈ నవలలోలాగే జరిగింది. ముగింపు ఎలా వుంటుందోనని నాకు ఉత్కంఠ. ఊపిరి ఆడని పరిస్థితి.

పెద్దలు కుదిర్చిన పెండ్లి, కాలక్రమాన కలిగిన ముగ్గురు సంతతి. ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల పెరిగి పెద్దవాళ్లు అయ్యారు. వాళ్లకు కూడా వివాహాలు అయ్యాయి. అంతా బాగున్నారు. కానీ వీళ్ల జీవితంలో అపశ్రుతులు ఎప్పుడు ఆరంభం అయ్యాయో, ఎప్పుడు అంతం అవుతాయో తెలియని అయోమయం. అతని గురించి ఆమె చెడుగా మాట్లాడినా, అతను మాత్రం ఆమె గురించి ఏమీ మాట్లాడడు. ఒకే గూట్లో ఎవరి జీవితం వారిది అన్నట్లుగ బతికేస్తున్నారు. కానీ వాళ్లిద్దరినీ కట్టిపడేసింది ఒక్కటే, అది డబ్బు. అతను లేకపోతే ఆమెకు డబ్బులోటు, కానీ ఆమె లేకపోతే అతనికి ఏం లోటో తెలియని పరిస్థితి. అందుకే అన్నారు 'అన్ని బంధాలూ

డబ్బుతో కూడుకున్నవి' అని. 'రవికాంచనిచో కవికాంచును' అనే పెద్దల వాక్కు ప్రకారం రచయిత్రి ఊహ అద్భుతం. ఎక్కడో ఉండి ఒక కుటుంబంలో జరిగిన, జరుగుతున్న వాస్తవాన్ని ఊహించి 'ఈ జీవితం నాది' అని ఘంటాపథంగా చెప్పగలిగిన ప్రతిభ వర్ణనాతీతం.

కానీ నా కోరిక ఒక్కటే. కథలోలాగ వారి జీవితం ముగియకూడదనీ, ఏనాటికైనా వారు ఒక్కరుగా ఉండాలనీ. ఏదిఏమైనా నా మనస్సును కదిలించిన నవల 'ఈ జీవితం నాది'.

–యస్.హరనాథబాబు
హైద్రాబాద్- 500044

## అసమర్ధుని జీవయాత్ర

*(మూడవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)*

ఈ జీవితం నాది, నా ఇష్టం అంటూ పర్యవసానం ఆలోచించకుండా అడుగువేసిన శ్రీమహాలక్ష్మి ఒకరకంగా ఏటికి ఎదురీదినట్లే. కొంతమంది తాము తీసుకున్న నిర్ణయంవల్ల ఎదుటివారికి ఎంత కష్టం కలిగినా, నష్టపోయినా పట్టించుకోరు. ఆ సమయంలో తమకి ఏది తోస్తే అది అనుసరిస్తారు. ఆ కోవకు చెందినదే శ్రీమహాలక్ష్మి. సంతృప్తి అనేది మనసులోంచి పుట్టుకువచ్చేదే కానీ పరిస్థితులకి తలొగ్గి మాసిపోయేది కాదు. ఆమె చేసిన పనివల్ల నష్టపోయింది కేవలం పాణిగ్రాహి మాత్రమే. అన్నీ కోల్పోయి, పిల్లలకి దూరం అయి, ఏం చేయలేని నిస్సహాయతతో తనకి తాను శిక్ష విధించుకుని ఒంటరిగా అందరికీ దూరంగా వెళ్ళిపోయాడు. ఎడారిలో ఒంటరిమానులా మిగిలిపోయాడు.

ఎన్నప్పటినుంచి లేనిపోని భేషజాలతో, తన అందంమీద నమ్మకంతో కలలో రాకుమారుడి కోసం ఎదురుచూసి, అవి తీరక పాణిగ్రాహిని ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకుని, ముగ్గురు పిల్లల తల్లి అయి కూడా ఆలోచనారహితంగా ప్రవర్తించింది శ్రీమహాలక్ష్మి. తనంటే ప్రాణం పెట్టే భర్తను గురించి ఆలోచించకుండా స్వార్ధంతో, ఎవరో ఏదో అన్నారని ఆ నింద నిజం చేసింది. పిల్లలు కూడా తమ తండ్రిని మరచిపోయి కేవలం డబ్బుకోసం, సంఘంలో పరపతి కోసం తల్లి చేసిన పని నచ్చకపోయినా తండ్రి ఒంటరిగా వెళ్ళిపోతుంటే ఏం మాట్లాడలేదు. అందరూ ఎవరికి తోచినట్లు వాళ్ళు పాణిగ్రాహి అతిమంచితనాన్ని అసమర్ధతగా జమకట్టి అతని జీవితాన్ని, సంతోషాన్ని నాశనం చేశారు. ఇదేపని ఒక మగవాడు చేస్తే ఆడదానికి తీరని అన్యాయం జరిగిందని ఊరూ వాడా యాగీ చేస్తారు.

భర్త ఎక్కడున్నాడు, ఎలా వున్నాడు అని ఒక్కసారి కూడా ఆలోచించని శ్రీమహాలక్ష్మి, పిల్లలూ ఎంత స్వార్ధపరులు.

ఏదిఏమైనా ఈ నవల రోటీన్‌కి భిన్నంగా వుండి ఆలోచింపచేసేట్లుగా వుంది.

–యస్. ఇందిర
సికింద్రాబాద్-500 015

## ఏటికి ఎదురీత

*(నాలుగవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)*

ఈ జీవితం నాది అనుకుంటూ నేలవిడిచి సాము చేసే ఊహలతో శ్రీమహాలక్ష్మి, ప్రేమించడమే తప్ప ప్రేమను ఎలా వ్యక్తపరచాలో తెలియని ఏటికి ఎదురీదలేని పాణిగ్రాహి, రాకుమారుడి కోసం ఎదురు చూడకుండా తనకోసం వచ్చిన వ్యక్తిని భర్తగా చేసుకుని లభించిన జీవితాన్ని తృప్తిగా సాగించే సబిత, మనకు సుపరిచితమైన ఇలాంటి పాత్రలను ఎంతో హృద్యంగా, మనోజ్ఞంగా తన నవల "ఈ జీవితం నాది'' ద్వారా రచయిత్రి గంటి వెంకటరమణ

పరిచయం చేశారు. కలలు కనడం తప్పు కాదు కాని తన స్థాయిని మరచి ఆకాశానికి నిచ్చెన వేయాలనుకోవడం అత్యాశ అవుతుందని శ్రీమహాలక్ష్మి పాత్ర ద్వారా చక్కగా తెలియజేశారు రచయిత్రి. భార్యని ప్రేమిస్తే చాలదు ఆ ప్రేమను ఎదుటి మనిషికి తెలియచేయడం ముఖ్యం. ఆమె ఊహలకు అనుగుణంగా నడుచుకుంటేనే, ఆ కాపురం అందంగా వుంటుంది. ఈ విషయం పాణిగ్రాహికి తెలియదు. శ్రీమహాలక్ష్మి ఎప్పుడూ తెలియచెప్పడానికి ప్రయత్నించలేదు. అందుకే అతనిలోని తప్పులని భూతద్దంలోంచి చూసి అతని సాన్నిహిత్యాన్ని భరించలేక వేరొకరికి దగ్గరయ్యింది. ఇక యతి, మనోహరిలకు జీవితంలో కష్టాలు అంటే ఏమిటో తెలుసు. డబ్బు విలువ తెలిసినవారు. వీరి ప్రవర్తన చాలా సహజంగా చిత్రీకరించారు. సబిత, చలపతి జీవితాన్ని అందంగా, ఆనందంగా జీవించడం తెలిసినవారు. ఒకరి ఆలోచనలను ఇంకొకరు సమర్థించుకుంటూ జీవితంలో సాగిపోయారు. ఇటువంటివారు ప్రస్తుత సమాజంలో చాలాతక్కువగా కనిపిస్తున్నారు. అన్ని కుటుంబాలు ఇలాగే వుంటే సంసార సముద్రంలో తుఫానులు రావు అని ఈ పాత్రల ద్వారా చెప్పారు రచయిత. కాని శ్రీమహాలక్ష్మి, పాణిగ్రాహిల సమస్యకు సూచించిన పరిష్కారం మాత్రం వాస్తవానికి దూరంగా వుంది. ఇలా సమాజంలో ప్రతి భార్య భర్తలోని నచ్చని గుణాలని పెద్దవిగా చేసి చూసుకుని కుటుంబాన్ని పిల్లల్ని విడిచి వేరొకరికి దగ్గరవ్వడమే పరిష్కారం అయితే మనం ఎంతో గొప్పగా చెప్పుకునే మన కుటుంబ వ్యవస్థను గేలిచేసినట్లే అవుతుంది. పరిష్కారం వేరేరకంగా చూపించివుంటే ఇలాంటి సమస్యలతో బాధపడే చాలా కుటుంబాలకి ఒక చక్కటి నీతిని బోధించినట్లుండేది.

–బుర్రా నాగమణి
కానూరు-520 007

## చెప్పదలచిందేమిటి?

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఈ జీవితం నాది అని గర్వంగా అనుకోటానికి ఏం సాధించింది శ్రీమహాలక్ష్మి? రచయిత్రి ఏం చెప్పదలచుకున్నారో అర్థంకాలేదు. నాయిక పాత్రకు ఆదర్శం ఏముంది? అవకాశవాదం తప్ప. డబ్బుకే ప్రాధాన్యత ఇచ్చింది. డాక్టరు, ఇంజనీరు దొరికే పరిస్థితి కాదు కనుక దొరికిన పాణిగ్రాహిని చేసుకుంది. అతడు దుర్మార్గుడో, తనని బాధపెట్టేవాడో ఐతే 'ఈ జీవితం నాది' అనుకోవచ్చు. అమితంగా ప్రేమించే భర్తని మార్చుకోవచ్చు. లేదా అతని చిన్న బలహీనతని క్షమించొచ్చు. పూర్ణచంద్రరావు దగ్గర కూడా వేరే గొప్ప అర్హతలు ఏమున్నాయి డబ్బు తప్ప? తన బిడ్డల తండ్రిని, మంచివాడిని వెళ్ళగొట్టింది. ఎదిగిన పిల్లలు కూడా కన్నతండ్రిని వదిలి నాన్న అని ఇతని వెంట తిరుగుతారు. చివరలో పెద్ద కొడుకైనా తండ్రిని ఆదరించాలి అనుకోవటం పాఠకులకు కొంచెం ఊరట కలిగించింది. మిగతా పాత్రలు కూడా ఈమె ఏం చేసినా రైటే అంటాయి తప్ప విశ్లేషించవు. సౌమ్యుడైన భర్తతో దొరికిన జీవితాన్ని జీవించక నా జీవితం బురదలో వేసుకనే హక్కు నాది అన్నట్లుంది. మొదట్లో చక్కని వ్యక్తిత్వంతో చూపిన పాణిగ్రాహిని అసమర్థుడుగా ఎందుకు మార్చారో? ఏమైనా భార్యను అమితంగా ప్రేమించిన నేరానికి ఒంటరిగా మిగిలిపోయాడు. పాఠకుల సానుభూతి పాణిగ్రాహికే.

–యం. లక్ష్మి,
విజయవాడ - 520 011

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల శీతాకాలం సూర్యుడు

సమీక్షకుని పేరు . ______________________

చిరునామా ______________________

______________________

______________________

# చతురకతలు

## బ్రహ్మరాత

త్రిలోకసంచారి నారదుడు యధాప్రకారం భూలోకంలో సంచారం సాగిస్తూ దార్లో ఓ శ్మశానం తగలడంతో అందులోంచి నడుస్తు

కపాలం చేతిలోకి తీసుకొని మరింతగా పరి కించి చూశాడు.

ఆయన కనుబొమలు ముడివడ్డాయి.

దివ్యదృష్టితో ఆ కపాలం తాలూకు వ్యక్తి యొక్క జీవితాన్ని చూశాడు.

అతిబీద కుటుంబంలో పుట్టిన వ్యక్తి కష్టపడి చదివిస్తున్నారు తల్లిదండ్రులు.



న్నాడు. శ్మశానవైరాగ్యం అంటారే... అలాంటిదేమైనా కల్గిందో ఏమో నారాయణ స్మరణ మరిచి పరధ్యానంగా అడుగులే స్తుండగా పాదుకకి తగిలి చిన్నగా శబ్దం చేస్తూ ముందుకి దొర్లుకుంటూపోయింది ఓ కపాలం. ఆ శబ్దానికి పరధ్యానంలోంచి బయటకొచ్చేసరికి కళ్ళకెదురుగా కపాలం కన్పించింది. యధాలాపంగా దానివంక చూసి ఉలిక్కిపడ్డాడు. మరుక్షణం ఆ

విద్యార్థినాయకుడిగా ఎదిగాడు. ప్రభుత్వాని కి వ్యతిరేకంగా ఏదో ఉద్యమాన్ని నడుపు తుండగా హత్యకు గురై మరణించాడు. అతడి జీవితం ముగిసింది. సరే! మరి ఈ నుదుటివ్రాత సంగతేమిటి? ఇది ఇదిలా గుందేం? మనసులోనే అనుకున్నాడు నార

దుడు.

తన భూలోకపర్యటనని అర్ధాంతరంగా నిలిపివేసుకొని ఆ పుర్రెతో సత్యలోకానికి బయల్దేరాడు.

నారదుడు వెళ్ళేసరికి సరస్వతీదేవి కచ్ఛపితో సాగించే కచేరి వింటున్నాడు అష్టకర్ణాలతో చతుర్ముఖ బ్రహ్మ.

కొడుకును చూడగానే "రారా అబ్బాయీ. మీ అమ్మతో కలిసి మహతీనాదం కూడా విన్పిద్దువుగాని'' అంటూ ఆహ్వానించాడు.

"సారీ డాడీ. కచేరీ చేసే మూడ్ లేదు'' అనేసరికి "ఏంజరిగింది నాయనా. ఎందుకలా వున్నావు'' అనడిగింది చేతిలోని వీణను తన పక్కన పెడుతూ వాణి.

"ఏంలేదమ్మా. ఈమధ్య నాన్నగారి వ్రాతలు వమ్మవుతున్నాయేమోనని అనుమానంగా ఉంది'' అన్నాడు నారదుడు.

"నా రాతలు వమ్మవడమా. అసంభవం నారదా!" నమ్మబలికాడు బ్రహ్మ.

"అది తేల్చుకుందామనే వచ్చాను. ఇదిగో ఈ పుర్రెను చూడండి. దాని నుదుటిమీద ఏం వ్రాసివుందో చదువుకోండి'' అన్నాడు నారదుడు.

ఆ కపాలంవంక చూసి తన హాండ్రైటింగ్ తనకే అర్థంకాక ఓమారు కళ్లు చికిలించి, ఎందుకైనా మంచిదని నాల్గుముఖాల్లోని కళ్లతోనూ చూసి "బాగానే ఉందికదా. దీనికి విరుద్ధంగా ఏం జరిగింది'' అన్నాడు బ్రహ్మ.

"ఇతనివల్ల రాష్ట్రంలో గొప్ప సంచలనం కల్గుతుంది. తల్లిదండ్రులకు ధనయోగం కల్గుతుంది అని కదా వ్రాశారు. మరిలా చదువుకుంటూండగానే మరణించాడుగదా. దీనర్థమేమిటి?" అనడిగాడు నారదుడు కొంచెం చిరాగ్గా.

కొడుకు మాటలకి నాల్గు నోళ్లతోనూ గట్టిగా నవ్వాడు బ్రహ్మ దేవుడు. "ఇందులో తేడా ఏమీలేదు. నువ్వు కేవలం అతని మరణంవరకే నీ దివ్యదృష్టితో గమనించావు. ఆ తర్వాత ఏం జరిగిందో తెల్సుకోకుండానే ఈ కపాలాన్ని పట్టుకొని ఆదరాబాదరాగా నా దగ్గరికి వచ్చేశావు'' అన్నాడు.

"అయితే ఆ తర్వాతేం జరిగింది తండ్రీ'' అన్నాడు నారదుడు.

"విద్యార్థి నాయకుడిగా ఉద్యమం జరుపుతున్నవాణ్ణి ఎవరు హత్య చేశారనేది పక్కన ఉంచు. ఆ నేరాన్ని అధికారపక్షంమీదకి త్రోశాయి ప్రతిపక్షాలన్నీ కలిసి. ప్రజావ్యతిరేకతను పెల్లుబికేలా చేశాయి. ఊరేగింపులు, ధర్నాలు ఒకటేమిటి. రాష్ట్రమంతా ఈ సంఘటనతో అట్టుడికిపోయింది. ప్రభుత్వం బెంబేలు పడిపోయి ఈ హత్యతో మాకేం సంబంధం లేదంటూ ఓ ప్రకటన పారేసి అతడి కుటుంబానికి పదిలక్షలు ఎక్స్‌గ్రేషియా ఎనౌన్స్ చేసింది. అతని తమ్ముడికి ప్రభుత్వోద్యోగాన్ని కల్పించింది. మరి నా వ్రాత తప్పిందంటావా నారదా'' అనడిగాడు బ్రహ్మ.

–సూరిపండు

---

# నమ్మకం

డాక్టరు అంకుల్ గారింట రిసెప్షన్. ఒకే ఒక్క కూతురి పెళ్లి. అమెరికా అల్లుడు. కట్నకానుకలులేవు. పెళ్లి అట్టహాసంగా జరిగింది. విందులో వండబడిన ఐటమ్స్ అంత వరకు మావూర్లో ఎవ్వరూ తినలేదని టాక్. ఆరోజు అశోక్‌కుమార్ నైట్. అశోక్ అంటే బాలీవుడ్‌లో నెంబరువన్ స్థానంలోవున్న గాయకుడు. అతని గొంతు కొన్ని కోట్ల రూపాయలకు ఇన్సూర్ అయిందని కథనం. కేవలం తన గానంతో కాకుండా మంచి లైటింగ్ ఎఫెక్ట్స్ ఉన్న స్టేజీ సామగ్రి, లేటెస్టు

మ్యూజికల్ ఇన్‌స్ట్రుమెంట్సు ఆరోజు నైట్‌లో ఒక హైలైట్. ఎంతో కాలంగా నాలో ఉన్న కోర్కె ఆ రోజు తీరబోతోందన్న ఉత్సాహం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. డాక్టరు అంకుల్ నాకు అప్పజెప్పిన పనులు పూర్తిచెయ్యడం, స్టేజ్ అలంకరణ ముగిసేసరికి చీకట్లు ముసిరాయి. పగలంతా ఎండలో తిరగడం మూలానేమి, పనిఒత్తిడి వలనేమి సన్నగా తలనొప్పి ఆరంభమయింది నాలో. అయినా నేను లక్ష్యపెట్టలేదు. అశోక్‌కుమార్ మ్యూజికల్ నైట్ చూసే సంరంభంలో ఉన్నాను.

డాక్టరు అంకుల్ మెయిను గేటు దగ్గర నిలబడి సిగరెట్ కాలుస్తున్నారు.

ఇక్కడ మా డాక్టరుగారి గురించి ఒక మాట చెప్పాలి. ఆయనకు అపర ధన్వంతరి అన్న పేరు. ఆయన హస్తం పడితే కడుపులమ్మ కనేస్తుంది, రోగాలు రోడ్డునెక్కేస్తాయి. ఆపరేషను ఆయనకొక ఆట. డాక్టరు అంకుల్‌కి చిరునవ్వు ఒక భూషణమయితే మాట మధురాతి మధురం. ఊరిలో జనాలు అతని దగ్గరకు స్టేటస్ కోసం వస్తారు జబ్బులు లేకపోయినా.



రాత్రి ఎనిమిదింటికే ఆరంభమయింది ప్రోగ్రాం. వీడియో తీస్తున్నారు. జనం నోరు ఆవలించి చూస్తున్నారు. డ్రమ్‌బీట్స్‌కి, లైటింగు ఎఫెక్ట్స్‌కి అంతవరకు అణిగిఉన్న తలనొప్పి ఒక్కసారి తలెత్తింది. ప్రోగ్రాం సరిగ్గా ఎంజాయ్ చెయ్యలేకపోతున్నాను. అశోక్‌కుమార్ మ్యూజికల్ నైట్ వదిలివచ్చేయాలంటే బాధగా ఉంది. మైక్‌లో ఎనౌన్స్‌మెంటు జరుగుతోంది. లేచి వస్తున్నాను.

నన్ను చూసి ఒక్కక్షణం ఆశ్చర్యపోయాడాయన. చేతిలోని సిగరెట్ పారేసి నా దగ్గరకు వచ్చారు.

"ఏమిటి క్లింటన్! ఎక్కడికి" అన్నారు. పేషంట్స్‌కి పేర్లు పెట్టడం ఆయనకొక హాబీ. నన్ను బిల్‌క్లింటన్ అని పిలుస్తారు.

"అంకుల్! విపరీతమైన తలనొప్పి. వెళ్లి పోతాను'' అన్నాను నిరాసక్తతగా. నేను అశోక్‌కుమార్ అభిమానినని ఆయనకు తెలుసు.

నా దగ్గరగా వచ్చి నుదుటిమీద చెయ్యి వేసి చూశారు. ఆ స్పర్శ సగం బాధని తగ్గించినట్లనిపించింది. పల్స్ పట్టి చూశారు.

"ఏంలేదు మైబోయ్! ఈ టాబ్లెట్ నోట్లో ఉంచుకొని మిగతా కార్యక్రమం చూసేయ్'' అంటూ కోటు పాకెట్‌నుండి ఒక మాత్ర తీసి నా నోట్లో పెట్టారు.

"ఇది బుగ్గన ఉంచుకొని చప్పరిస్తుండు. బట్ డోన్ట్ టేక్ ఇన్‌సైడ్. ప్రొసీడ్'' అని భుజం చరిచి వెళ్లమన్నారు. స్టేజిమీద అశోక్‌కుమార్ మైకుపట్టుకుని మైకేలు జాక్సన్‌లా పాడుతుంటే జనం హిస్టీరియా పేషంట్స్‌లా ఊగుతున్నారు. ఆర్కెస్ట్రా ముగిసేసరికి రాత్రి రెండయింది. ఆశ్చర్యం! నాకు తలనొప్పి వచ్చిందన్న విషయమే మరిచిపోయాను. అతిథులు ఒక్కొక్కరే డాక్టరుగారితో చెప్పి వెళ్తున్నారు. నేను గుడ్‌బై చెప్పాను.

"క్లింటన్! వెళ్లిపోతున్నావా! తలనొప్పి తగ్గిందా!" నాతో మాట్లాడుతున్నారేగాని కళ్లు నవ్వుతూ అతిథులికి వీడ్కోలు చెప్తున్నాయి.

"సర్‌దర్ద్ గాయబ్. మాయమైపోయింది. థ్యాంక్యూ అంకుల్'' అన్నాను డ్రమటిక్‌గా.

"సరే! నా కోటు గుండి ఇచ్చేసి వెళ్లిపో'' అన్నారాయన ఎవరితోనో కరచాలనం చేస్తూ.

"కోటు గుండీయా! ఏదీ ఎక్కడుంది'' అన్నాను నేను విభ్రాంతితో.

"నీ నోట్లో ఉందోయ్ బిల్. ముందది తియ్'' అన్నారు చిరునవ్వుతో.

నోట్లో వేలుపెట్టి మాత్రతీసి చూశాను. నిజమే కోటుగుండి. తెల్లని రంగులో మిలమిల్లాడుతోంది. అన్ని గంటలు నానిందేమో మరింత మెరుస్తోంది. అయితే ఇంతసేపు నా తలనొప్పి తగ్గించిన టాబ్లెట్ ఇదా! ఈసారి ఆశ్చర్యపోవడం నావంతయింది.

—ఆనందరావ్ పట్నాయక్

---

# వినయం

"నారాయణా... నారాయణా..."

శేష తల్పశయనుడైన శ్రీమహావిష్ణువు 'కళ్ళు' విప్పాడు. తన కాళ్ళు ఒత్తుతూ... నారదమహాముని కనుపించాడు. శ్రీమహాలక్ష్మి భూలోకంలో బ్యాంకుల సంచారానికి బయలుదేరి వెళ్ళినట్లుంది.

"లే... నారాదా... నీవు కాళ్ళు పట్టుకుంటే బావోదు''

"ఫర్వాలేదు స్వామీ..." అతివినయంగా జవాబిచ్చాడు నారదుడు.

ఇంతలో స్టాక్ మార్కెట్‌నుండి లక్ష్మీదేవి కూడా వచ్చింది.

నారదుడు లేచి ఆమెగార్కి సాష్టాంగ ప్రమాణం చేశాడు. ఆమె కంగారుపడింది. ఆ దంపతులిద్దరికీ నారదుడి ప్రవర్తన అగమ్యగోచరంగా వుంది.

సరిగా అప్పుడే భూలోక వ్యవహారాలు మాట్లాడేందుకు బ్రహ్మ, మహేశ్వరులతో సహా అష్టదిక్పాలకులందరూ వచ్చారు. నారదుడు వాళ్ళందరికీ సాష్టాంగ నమస్కారాలు చేసి దూరంగా వెళ్ళి, చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

వచ్చిన విషయం మర్చిపోయి నారదుడి విపరీతానికి విస్తుపోయారు వారందరూ. ఎప్పుడూ యాక్టివ్‌గా కథ నడిపించే ఈ సూత్రధారునికి ఏమైందా? అని జాలిపడ్డారు.

వెంటనే ధన్వంతరిని పిలిపించారు. ఆయన పరీక్షించి నారదుడు 'అతి వినయం' అనే జబ్బుతో బాధపడుతున్నట్లు తేల్చాడు. ఆరోగ్యం నయం అవ్వాలంటే... ఏం చె

యాలో వాళ్ళకి వివరించాడు.

వినయం పోగొట్టటానికి నారదుణ్ణి భూలోకానికి తీసుకెళ్ళారు దేవతలు.

రాజకీయాల్లోకి దింపితే వినయం పోతుందనుకొన్నారు. కాని ఎలక్షన్లు దగ్గిరపడటంతో నాయకులు ప్రజలముందు నారదుడి కంటే గొప్పగా వినయం అభినయిస్తున్నారు.

రాజకీయాలే వినయభారంతో అతలాకుతలం అవుతున్నాయ్! ఇంక నారదుడికేం తగ్గుతుంది?




పోనీ, అనుకుని పోలీసు డిపార్ట్‌మెంట్‌లో చేర్చారు నారదుణ్ణి. ఎన్ని ఎన్‌కౌంటర్లు, ఎన్నెన్ని లాకప్ డెత్‌లు చూసినా ఆయన జబ్బు పోలేదు.

ఆనక గవర్నమెంట్ హాస్పిటల్‌లో గేట్‌కీపర్‌గానూ, వార్డ్‌బాయ్‌గానూ వేసినా పొగరు రాలేదు. వినయం తగ్గలేదు.

విసిగివేసారిన దేవతలు తిరిగి వైకుంఠం వెళ్ళిపోదామనుకొన్నారు. ఆర్టీసీ బస్సెక్కితే తిన్నగా వెళ్ళిపోతారని చెప్పారెవరో... అందరూ బస్‌స్టేషన్‌లో వెయిట్ చేస్తున్నారు. వాళ్ళెక్కే బస్సు యింకా రాలేదు.

నారదుడికి కాళ్ళు నొప్పెట్టి... దగ్గర్లో ఖాళీగా కనుపించిన ఆర్.టి.సి ఎంక్వాయిరీ బూత్ కుర్చీలో కూర్చున్నాడు. సదరు ఎంక్వయిరీ ఆయన లఘుశంఖ తీర్చుకోడానికో సెకండ్‌షో సినిమాకో వెళ్ళినట్లున్నాడు.

ఆ కుర్చీలో కూర్చోగానే నారదుడి ముఖంలో మార్పు వచ్చింది. "ఒరే... దేవతలూ... ఇటు రండిరా!?" అని అరిచాడు.

వాళ్ళందరూ మొహమొహాలు చూసుకున్నారు.

ఏ బస్సు ఎటు పోతుందీ అని... అడిగేవాళ్ళని ఛడామడా తిడుతున్నాడు నారదుడు. పైగా గర్వంతో పైకెగసి పడుతున్నాడు. ఆర్.టి.సి ఎంక్వయిరీ కుర్చీకెంత మహత్తు వుందో... అని దేవతా జనం విస్తుపోయినా, నారదుడి జబ్బు తగ్గింది కదా అని ఆనందపడ్డారు.

డా॥ కె. శివసుబ్బారావు

# స్టాండర్డ్

యాభయ్యోపడిలో వున్న పర్వతరావు భార్యతోసహా కొడుకు దగ్గరకు అమెరికా వెళ్ళి మూడు నెలల తరువాత ఇంటికి తిరిగివచ్చాడు. వచ్చినరోజు రాత్రే గుండెనొప్పి వస్తే హాస్పిటల్లో అడ్మిట్‌చేశారు అతన్ని. ఇంటెన్సివ్ కార్డియాక్ కేర్ యూనిట్‌లో వుంచి జాగ్రత్తగా చూడసాగారు డాక్టర్స్. నగరంలోని ప్రముఖ హార్ట్ స్పెషలిస్టు పర్యవేక్షణలో ట్రీట్‌మెంట్ జరుగుతోంది.

ఇసిజిలో ఒకటి, రెండు చోట్ల మైనర్ ఇన్వర్షన్స్ కనిపించాయని యాంజియోగ్రఫీ చేశారు. ఆ తరువాత స్పెషల్ రూంకి మార్చబడ్డాడతను. అనంతరం 'ఇకో టెస్టూ, 'స్ట్రెస్ ఎనాలిసిస్' టెస్టూ ప్రిస్క్రైబ్ చేయబడ్డాయి గుండె బలాన్ని పరీక్షించేందుకు. ఆ టెస్ట్‌ల ఫలితాన్నిబట్టి సర్జరీ అవసరమా కాదా అన్నది నిర్ణయింపబడుతుంది.

ఆరోజు- ఆ టెస్టులను జరిపించేందుకని పర్వతరావు వద్దకు వచ్చిన స్పెషలిస్టు గది లోని వాతావరణంచూసి కంగారుపడ్డాడు. పర్వతరావు బెడ్‌మీదపడుకుని నిశ్శబ్దంగా శూన్యంలోకి చూస్తున్నాడు. అతని చేతిలో ఏదో కాగితంవుంది. పక్కనే అతని భార్య వాడిపోయిన వదనంతో దిగాలుగా కూర్చుని వుంది.




విషయమేమిటో అడగాలని డాక్టరు నోరు విప్పేంతలోనే, "ఈ మాత్రానికే నువ్వింతగా బెంబేలుపడడం అనవసరం. డోంట్‌వర్రీ'' వోదార్పుగా అన్నాడు పర్వతరావు భార్యతో.

"ఇంత పెద్ద సమ్మెటపోటును తట్టుకోవడం ఎవరికి శక్యం?" అంది భార్య పాలిపోయిన ముఖంతో.

ఏదో ఘోరమే జరిగిందనుకున్న డాక్టర్, "ఏమిటమ్మా? ఏం జరిగింది? ఎందుకలా

వున్నారు?" అంటూ పలకరించాడు.

అప్పుడుగాని అతన్నెవరూ చూళ్ళేదు.

"పులిమీద పుట్ర అంటారు. ఇదే కాబోలు! అసలే ఈయనకు ఒంట్లో బాగోలేదనుకుంటే మధ్యలో ఈ వుప్పెన ఒకటి! దీన్ని చూడండి'' అంటూ భర్త చేతిలోని కాగితాన్ని తీసి డాక్టర్‌కి ఇచ్చింది పర్వతరావు భార్య.

దానిని పరిశీలనగా చూసిన డాక్టర్, "ఇది టెలిఫోన్ బిల్లులా వుందే'' అన్నాడు.

"ఔను డాక్టర్! గత రెండు నెలల్లోనూ మా ఇంటి ఫోన్‌కి పాతికవేల రూపాయల యిందంటూ టెలిఫోన్ డిపార్ట్‌మెంటు పంపించిన బిల్లు ఇది'' అందామె. "గత మూడు నెలలుగా మేము దేశంలోనే లేము. ఆ సమయంలో మా ఇల్లు లాక్‌చేసే వుంది. అయినా పాతికవేలయిందంటూ బిల్లు పంపించారు. గడువులోపున కట్టకపోతే ఫోన్ కనెక్షన్ పీకేస్తారట"

"ఆఁ?" తెల్లబోయాడు డాక్టర్.

"టెలిఫోన్ డిపార్ట్‌మెంటు వారి పోకడలు చిత్రాతిచిత్రాలు డాక్టర్‌గారూ!" అన్నాడు పర్వతరావు ఏడవలేక నవ్వుతూ. "ముందు బిల్లు పేచేసి ఆ తర్వాత మాట్లాడమంటే, అంత డబ్బు ఎక్కణ్ణుంచి తెస్తారు ఎవరైనా?"

ఆశ్చర్యపోయిన డాక్టర్ ఓ క్షణంపాటు ఏదో ఆలోచించాడు. తరువాత పర్వతరావు నుద్దేశించి, "మీకు ఫరదర్ టెస్ట్స్ ఏమీ అవసరంలేదు. వెంటనే డిశ్చార్జ్ అయి ఇంటికి వెళ్ళిపోవచ్చును'' అన్నాడు.

పర్వతరావు భార్య తెల్లబోయి, "అదేమిటి డాక్టర్? ఇంకో టెస్టు, స్ట్రెస్ ఎనాలిసిస్ టెస్టూ తప్పక జరిపించాలన్నారుగా?" అంది.

"అన్నమాట నిజమేనమ్మా! కాని ఇప్పుడు ఆ అవసరంలేదు'' అన్నాడు డాక్టర్.

"ఏం?"

"ఉపయోగించని టెలిఫోన్‌కి వచ్చిన పాతికవేల బిల్లును చూసి కూడా మీ ఆయన గుండె చలించలేదంటే అది చాలా గట్టిదన్నమాట! టెలిఫోన్ బిల్లును మించిన స్ట్రెస్ టెస్టు ఇంకోటి లేదు. సింపుల్ అండ్ చీప్'' వివరించాడు డాక్టర్ నవ్వుతూ. "నౌ హి యీజ్ అబ్సల్యూట్లీ ఆల్‌రైట్. ఇంటికి వెళ్ళిపోవచ్చును''

సంభ్రమాశ్చర్యాలతో వెళ్ళిపోతూన్న డాక్టర్ని చూస్తూండిపోయారు ఆ దంపతులు.

–తిరుమలశ్రీ

---

# పరమానందం

ప్రొఫెసర్ పరమానందంగారికి ఇవ్వాళ గొప్ప ఆనందంగా ఉంది.

తీసికెళ్ళిన వస్తువులు తిన్నగా ఇంటికి తేవటం లేదనీ, ఏదో ఒకటి మర్చిపోతున్నాడని పెండ్లాం నిత్యం తిట్టిపోస్తోంది.

తను ఎన్నో గోల్డు మెడల్సు సంపాదించుకున్నాడు. మరెన్నో అవార్డులొచ్చాయి. తన పరిశోధనల ఫలితంగా తయారైన వస్తువులు మార్కెట్లో బాగా అమ్ముడవుతున్నాయి.

ప్రపంచం అంతా తనని మెచ్చుకుంటున్నా తన పెళ్ళాం మాత్రం మెచ్చుకోవటంలేదు. ఇంత తెలివైన తను పెళ్ళాం దగ్గర తెలివి తక్కువవాడిగా నిరూపణ కావటం... పరమానందంకి చాలా బాధగా ఉంది.

ఒక్కోరోజు కారులో వెళ్ళి, వచ్చేటప్పుడు ఆటోలో వస్తున్నాడు.

వాటర్‌బాటిల్, హాట్‌ప్యాక్, పర్సు, ఖరీదైన పెన్ను, కోటు, ఇలా.. నిత్యం ఏదో ఒకటి పారేసుకొంటున్నాడు. ఖరీదైన రిసెర్చి పుస్తకాల సంగతి ఇంక చెప్పక్కర్లేదు.

దాంతో ఆవిడ తనో తెలివి తక్కువ



వాడినని హేళన చేస్తోంది.

అందుకే పరమానందంలో పట్టుదల హెచ్చింది.

ప్రపంచం ముందే కాదు, తన భార్య ముందు కూడ తను మేధావిగా నిరూపించబడాలి అన్న నిర్ణయానికి వచ్చాడు.

అందుకో ప్రయోగం మొదలెట్టాడు.

ఒక చిన్న క్యాలిక్యులేటరుని బెల్టుదగ్గర అమర్చుకున్నాడు. అందులో ఉదయం ఇంటినుంచి రిసెర్చి సెంటరుకి వెళ్ళేముందు తన వెంట ఏయే వస్తువులు తీసుకెడుతున్నాడో, ఆఖరికి ఏ రంగు కోటు వేసుకెడుతున్నాడో, ఏ రంగు కారు తీసుకెడుతున్నాడో నెంబరుతో సహా అన్నీ క్యాలిక్యులేటర్‌లో 'మెమొరి' బటన్ నొక్కి ఫీడ్ చేసుకున్నాడు. సాయంత్రం ఆరింటికి క్యాలిక్యులేటర్‌లో అలారం మోగేలా సెట్ చేశాడు. అలారం మోగగానే క్యాలిక్యులేటర్‌లో "ఫీడ్‌బ్యాక్ మెమొరి'' వస్తుంది. అప్పుడు తన వెంట వున్న వస్తువుల లిస్ట్ వస్తుంది. అన్నీ వున్నాయో లేదో చూసుకుని మరీ ఇంటికి బయలుదేరతాడు. అప్పుడు ఇంక మర్చి పోవటం అంటూ జరగదు.

ఈ ప్రయోగం ఈ రోజునుంచే ప్రారంభించాడు. భార్యకి ఆ విషయం చెప్పలేదు.

ఆ సాయంత్రం తెచ్చిన వస్తువుల్ని క్యాలిక్యులేటర్ సహాయంతో సరిచూచుకొని కారులో సర్దుకొని తన కారు నెంబరు, కలరూ కూడా సరిచూచుకొని సాయంత్రం హుషారుగా ఇంటికి బయలుదేరాడు పరమానందం బ్రహ్మానందంగా.

అతనికారోజు గొప్ప థ్రిల్లింగ్‌గా ఉంది.

"ప్రపంచంతో పాటు తన పెళ్ళాం కూడ ఈ రోజు తన తెలివితేటల్ని పొగడాల్సిందే. తన జాగ్రత్తని మెచ్చుకోవాల్సిందే. టెక్నాలజీ బాగా పెరిగింది. దాన్ని మనం ఇలా ఉపయోగించుకోవటంలోనే ఉంది. తన పెండ్లాం తనని మెచ్చుకోక ఏం చేస్తుంది?

మెచ్చుకొని తీరాల్సిందే. మెచ్చుకొని తను ఖరీదయిన వస్తువులన్నీ సరిగా తెచ్చానన్న ఆనందంతో తనని ఎంతగా పరవశింపచే స్తుందో... ఎంతటి నవరసానుభూతుల్లో ముంచెత్తుతుందో... తన తెలివికి పరవశించి పోతూ గాలిలో తేలుతూ హాయిగా పరమానందం ఇంటికి వచ్చాడు. గేటు లోంచి లోపలికి వచ్చి కారు దిగి కాలింగ్ బెల్ నొక్కాడు.

తెల్లటి చీరలో జడనిండా మల్లెపూలతో అప్సరసలా తలుపు తెరిచిన భార్యని అమాంతం కౌగలించుకొని ఎడా పెడా ఆమెని ముద్దులతో ముంచెత్తాడు.

"కాంతం. ఇవ్వాళ నేను ల్యాబ్‌లో ఏమీ మర్చిపోలేదు. అన్ని వస్తువులూ భద్రంగా తెచ్చాను. కారులో వెళ్ళి కారులోనే వచ్చా ను. ఇవ్వాళేకాదు.. ఇకనుంచి ఏ రోజు ఏం మర్చిపోను. చిల్లిగవ్వకూడ పోగొట్టను''

అంటూ మితిమీరిన ఆనందంతో భార్యని అమాంతం రెండు చేతుల్తో ఎత్తి గాలిలో గిరగిరా తిప్పసాగాడు.

అంతలో ఆయన నెత్తిన బాంబు పేలిన శబ్దం.

తెల్లచీరలోని ఆ అప్సరస మహంకాళిలా విరుచుకు పడుతూ పరమానందం చెంప ఛెళ్లుమనిపించింది.

"నేను మీ కోప్రొఫెసర్ శివానందం పెళ్ళా న్ని. మీరు వెళ్లాల్సింది పక్కింటికి'' గట్టిగా అరిచింది.

ఈ గలాభాకి తలుపులు తెరుచుకుని వచ్చిన కాంతం పక్కింటి శివానందం పె ళ్ళాం నిర్మలని, తన భర్తని చూస్తూ పులిలా గాండ్రించింది.

"మనిల్లు ఇది. మీరు ఇటురండి. మీ పెండ్లాం కాంతంని ఇక్కడ చచ్చాను."

—కాకాని కమల

# వార్నింగ్

ఆకుపచ్చ రంగు కవరు చూడగానే చిత్రకి ఒళ్ళు మండింది.

మళ్ళీ లవ్‌లెటర్. ఇదప్పుడే నాలుగవది.

కాలేజీలో చదువుతున్న ఆడపిల్లలకు ఇటు వంటి లెటర్స్ రావడం మామూలే అని



అంతకుముందు లెటర్స్ గురించి పట్టించుకోలేదు. కాని, మరీ విసిగిస్తే యాక్షన్ తీసుకోవలసిందే అనుకుంటూ, కవరు తెరిచి చదవకుండానే చించి పడేసింది చిత్ర.

మర్నాడు కాలేజీకి వెళ్ళినప్పుడు, అభిజిత్ విష్‌చేసి "లెటర్ చూశారా?" అన్నాడు.

అంతవరకూ చిత్రకి తెలియదు ఆ లెటర్స్ రాస్తున్నది ఇతనే అని. అభిజిత్ ఇంటెలిజంట్ స్టూడెంట్. ఇలాటి పన్లు చేస్తాడంటే, నమ్మబుద్ధికాదు కాని అతనే చెప్పాడు కదా.

గట్టిగా వార్నింగ్ ఇచ్చి, మళ్ళీ ఇటువంటి పనిచేస్తే ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ ఇస్తానని చెప్పింది చిత్ర!

మరింక ఆరోజునుంచీ ఏ లెటరూ రాలేదు. దాంతో అతని సంగతి మరిచిపోయింది. అదీగాక పరీక్షలు దగ్గిరపడ్డాయ్.

చిత్ర శ్రద్ధగా చదువుకుంటోంది. చిత్ర ఇంట్లో ఆమె రూం రోడ్‌వైపుకి ఉంటుంది. వేసవికాలం అవడంవలన కిటికీ తలుపు తెరచి దగ్గరగా కుర్చీలో కూర్చుని చదువుకుంటూ ఉంటోంది.

ఇంతలో పెద్దగా శబ్దం చేసుకుంటూ, మోటార్‌బైక్‌మీద ఎవరో అటూ, ఇటూ చక్కర్ కొడుతూండటంతో ఆ డిస్టర్బెన్స్ భరించలేక తలుపు దగ్గరగానే వేసింది చిత్ర.

అయినా ఆ శబ్దం కర్ణకఠోరంగా వినబడుతూనే వుంది.

ఎవరబ్బా ఇలా పనీపాటూ లేకుండా... అనుకుంటూ, పరిశీలనగాచూస్తే ఆ మోటార్ బైక్‌మీద తిరుగుతున్న మహానుభావుడు 'అభిజిత్' అని గుర్తించగలిగింది.

పట్టరాని కోపం వచ్చింది చిత్రకి. విసురుగా, వాళ్ల అన్నయ్య మారుతీరాం దగ్గరకు వెళ్ళి, "అన్నయ్యా! బైట రోడ్‌మీద ఎవడో చక్కర్లు కొడుతున్నాడుగానీ అతని సంగతి చూసిరా'' అంది. అతను సందేహిస్తుంటే అంతకుముందు లెటర్ రాసిన సంగతీ, తను వార్నింగ్ ఇవ్వడం వగైరా అంతా చెప్పింది.

మారుతీరాం, రోడ్ మీదకి వెళ్ళి, అభిజిత్ మోటార్ బైక్‌కి అడ్డంగా నిలబడి, ఆగగానే అతని చెయ్యి పట్టుకున్నాడు బలంగా.

"ఏయ్ మిస్టర్! మా చెల్లాయ్‌కి లెటర్స్ రాయడం, వార్నింగ్ ఇచ్చినా, మా ఇంటిచుట్టూ రౌండ్స్ కొట్టడంలో నీ ఉద్దేశం ఏమిటీ?" అనడిగాడు తీవ్రంగా!

"లెటర్స్ రాసిన మాట నిజమే అనుకోండి..." అంటూండగానే మారుతి అరిచేడు "పరీక్షలు దగ్గిరకు వచ్చాయి కదాని... ఉత్తరాల్రాయటం వాయిదా వేసి, ఈ డ్యూటీ తీసుకున్నావా?"

"కాదండీ బాబూ! పరీక్షలు గదాని మా చెల్లాయ్ వాళ్ళ లెక్చరర్‌గారి దగ్గిరకు ట్యూషన్‌కి వస్తోంది. ఈ రోజు లేటవుతుంది, నువ్వు వచ్చి పికప్ చేసుకో అన్నయ్యా, అంటే వచ్చాను. నా బైక్..."

"తప్పించుకోవాలని చూడకు. కథలు చెబుతున్నావా, నీ పని పట్టాల్సిందే పద ఇంట్లోకి నీ సంగతి చూడాల్సిందే!" విసురుగా అభీ షర్ట్ కాలర్ పట్టుకున్నాడు మారుతి.

"వదలండి సార్! నాకేం దురుద్దేశంలేదు. మీ గురించి మా ఫ్రెండ్స్ చెప్పారు. మీరు మాంచి పహిల్వాన్ అనీ, మారుతీ హెల్త్ స్కూల్లో మీరే స్వయంగా కుస్తీలూ, బస్కీలూ నేర్పుతారనీను.

అలాంటి మీ చెల్లాయ్ జోలికి రావడానికి, నాకు ధైర్యం ఎక్కడిదండీ. నేను చెప్పేది వినండి. నా బైక్ ఈ రోజెందుకనో కండిషన్‌లో లేదు. ఆగితే మరి కదలడం బ్రహ్మప్రళయంగా ఉంది. అందుకని, ఆపకుండా అలా రౌండ్స్ వేస్తున్నాను. అదిగో మా చెల్లి వస్తోంది. ప్రొద్దున్న దింపి వెళ్ళింది నేనేగా. అడగండి కావాలంటే!" దూరంగా వాళ్ళ లెక్చరర్ ఇంటినుంచి వస్తున్న చెల్లెల్ని చూపించేడు అభిజిత్.

చూడగానే ఆమె తన క్లాస్‌మేట్ రాధ అని అర్థమయింది మారుతికి!

"ఇతను రాధ అన్నయ్యా? చచ్చాంరా

దేవుడా, అసలు సంగతి తెలిస్తే నా పని గోవిందా'' అనుకున్నాడు మారుతి.

అంతకు చాలా నెలలముందే మారుతి రాధ ఇంటిచుట్టూ తిరిగి, తిరిగి ఆమె చేత చీవాట్లు తినేశాడు. "మళ్ళీ నా జోలికివస్తే మా అన్నయ్యతో చెప్పి, నీ భరతం పడతానని'' చెప్పు తీసిన ఆ రాధని చూసేసరికి, మారుతి కాళ్ళు వణికాయి. మరుక్షణం ఇంట్లోకి పరుగెత్తాడు మొహం చాటేస్తూ!

ఇంత హడావిడీ చేసి, ఇప్పుడిలా జారుకోడం, అర్థంకాలేదు అభిజిత్‌కు.

ఇంట్లోకి వెళ్ళిన మారుతి వీధి తలుపు మూసి,

చెల్లెలిమీద చిందులు తొక్కాడు.

"చిత్రా, నీకసలు బుద్ధుందా, ఆ కిటికీ దగ్గర కూర్చోవడం ఎందుకూ? ఇంత ఇంట్లో నీకు చదువుకోడానికే చోటు దొరకలేదా?" అంటూ చీవాట్లు పెడుతున్న అన్నగారిని, విచిత్రంగా చూడసాగింది చిత్ర.

—ఎ. అన్నపూర్ణ

---

## కంప్యూటర్ మిస్టేక్

యం. సెట్ రిజల్ట్స్ వెలువడే నాటికి నేను నార్త్ ఇండియాలో టూర్‌లో వున్నాను. కాబట్టి ఆ సంగతి నాకు విజయవాడకి తిరిగి వచ్చేదాకా తెలీదు.

మా మామయ్య కూతురు, కొడుకు ఇద్దరూ యం. సెట్ మెడిసిన్‌కి పరీక్షలు రాశారని నాకు తెలుసు. నా టూర్‌నుంచి పిల్లలకి తెచ్చిన ఆటవస్తువులు, డ్రస్‌లు ఇచ్చి స్నానం చేశాక చెప్పింది మా ఆవిడ సన్నగా నవ్వుతూ.

"యం. సెట్ రిజల్ట్స్ వచ్చాయండీ!"

ఏదో విశేషం చెప్పేలా వుందావిడ మొహం.

"అలాగా? వేణి, శ్రీరామ్‌లిద్దరూ పాసయ్యారా? " అడిగాను.

"శ్రీరామ్‌కి మంచి రాంక్ వచ్చింది. వేణి



క్వాలిఫై కాలేదు" చెప్పింది మా ఆవిడ.

నేను ఆ సమాధానానికి షాక్ తిన్నాను. వేణికన్నా శ్రీరామ్ ఓ ఏడాది పెద్ద. అయినా శుద్ధ మొద్దు కాబట్టే రెండోసారి యం. సెట్ రాసాడు. వేణి ఎల్. కే. జీ. నించి ఎప్పుడూ ఫస్ట్ రాంకరే. సెకండ్ రేంక్ ఒక్కసారే సిక్స్‌లో వచ్చింది... అదయినా మలేరియా జ్వరంతో బాధపడుతూ పరీక్ష రాయడంతో.

"సరిగ్గా విన్నావా? వేణి క్వాలిఫై కాలేదా? " అడిగాను ఆశ్చర్యంగా.

"అవునండి!"

"శ్రీరామ్‌కి రేంక్ వచ్చిందా? అటు దిటు ఇటుదటు అయినట్లుందే" నవ్వుతూ అన్నాను.

మర్నాడు ఉదయం పేపర్‌లో యం. సెట్‌లోని రేంక్స్ విషయంలో కంప్యూటర్ చేసిన తప్పులమీద చాలామంది కోర్ట్‌కి వెళ్ళారన్న వార్తని చూపించింది మా ఆవిడ.

"చూశారాండీ! పాపం వేణికి కంప్యూటర్ చేసిన తప్పులవల్లే ఇంత తక్కువ రేంక్ వచ్చివుంటుంది. మీ మామయ్యకి సలహా ఇద్దాం కోర్ట్‌కి వెళ్ళమని"

ఆ సాయంత్రం మామయ్య ఇంటికి వెళ్ళాం... నూట ఏభైలోపు రేంక్ వస్తుం దని ఎదురుచూస్తూ దివాలా తీసిన వేణిని ఎలా ఊరడించాలా అనుకుంటూ.

మా మామయ్య గుమ్మంలో ఎదురుపడి చిరునవ్వుతో పలకరించాడు.

"శ్రీరామ్‌కి ఈ ఏడు యం. బి. బి. ఎస్‌కు ఉస్మానియా మెడికల్ కాలేజీలోనే సీట్ వస్తుంది తెలుసా? " ఆనందంగా చెప్పాడు.

"మరి **వేణి** మాటేమిటి? కోర్ట్‌కి వెళ్తున్నావా మామయ్యా? " అడిగాను.

"లేదురా కోర్టు అసలీ కంప్యూటర్ మిస్టేక్స్‌ని కరెక్ట్ చేయించడానికి వ్యతిరేకంగా తీర్పు ఇస్తేనే బెటర్" చెప్పాడు ఆయన.

"అదేమిటి మామయ్యా! వేణిలాంటి బెస్ట్ స్టూడెంట్‌కి అంత తక్కువ రేంక్ రావడం అసాధ్యం. అలాంటప్పుడు..." అంటున్న నాకు అడ్డుపడ్డాడాయన.

"అది బ్రిలియంట్ స్టూడెంట్ కాబట్టి వచ్చే ఏడాదైనా హయ్యెస్ట్ రేంక్ తెచ్చుకోగ లదు. వీడో శుంఠ. ఇంకోసారి కంప్యూటర్ మిస్టేక్ జరగనిస్తారా? వీడికి హయ్యెస్ట్ రేంక్ వచ్చి చస్తుందా? "

మామయ్య లాజిక్ నాకర్థమైంది.

ఆ తర్వాత కోర్టు తీర్పు మామయ్య కోరుకున్న విధంగానే వచ్చింది. దాంతో శ్రీరామ్ తక్షణం ఫీజ్ కట్టేసి యం. బి. బి. యస్‌లో చేరిపోయాడు.

ఆ తర్వాత సంవత్సరం విద్యాశాఖవారు ఎలాంటి పొరపాట్లు జరగకుండా తగిన కట్టుదిట్టాలు చేయడంతో వేణికి ఏభై ఎనిమిదో రేంక్ వచ్చింది. దాంతో ఆమెకూ హైద్రాబాద్‌లోని ఉస్మానియా మెడికల్ కాలేజీలోనే యం. బి. బి. యస్‌లో సీట్ వచ్చింది.

"కంప్యూటర్ పొరపాటువల్ల నీకు ఓ ఏడాది నష్టమైనందుకు బాధగా లేదూ? " అనడిగాను వేణిని, ఆ సందర్భంగా మామయ్య ఇచ్చిన టీపార్టీలో.

"లేదు ఆ పొరపాటువల్ల శ్రీరామ్‌కి బెనిఫిట్ అయినప్పుడు నాకెందుకు బాధ? " నవ్వుతూ జవాబు చెప్పింది వేణి.

అయిదేళ్ల తర్వాత శ్రీరామ్ డాక్టర్ అయినా మా ఆవిడగాని, నేనుగాని అతని దగ్గరకి చికిత్సకి వెళ్లకూడదని నిర్ణయం తీసుకున్నాం. అది వేరే సంగతి అనుకోండి.

**–డి. పద్మజ**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 338734

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ !!




ఔను... ఇష్టమైన కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.



Mango Avakaya | Mango Thokku | Cut Mango | Tender (Vadu) Mango | Sweet Mango Chutney | Amla | Gongura | Drumstick | Lime | Tomato | Mixed Vegetable



Bitter Gourd | Green Tamarind | Ginger | Sweet Ginger | Mango Ginger | Garlic | Onion | Red Chilli | Green Chilli (Sliced) | Green Chilli (Paste) | Gongura & Red Chilli | Green Tamarind & Red Chilli

**priya**

**Pickles**
**ఏ పచ్చడంటే**
**ఆ పచ్చడి నంసి**